ఇతిపూర్వోత్తరేణ సంప్రతిపత్తేర్భూరివిషయత్వేపి తత్ర క్రియాభావాన్మిథ్యోత్తరక్రియామాదాయ వ్యవహారః ప్రవర్తయితవ్యః । యత్ర తు మిథ్యాకారణోత్తరయోః కృత్స్నపక్షవ్యాపిత్వం యథా శృఙ్గగ్రాహికయా కశ్చిద్వదతీయం గౌర్మదీయా అముకస్మిన్కాలే నష్టాస్య గృహే దృష్టేతి । అన్యస్తు మిథ్యైతదేతత్ప్రదర్శితకాలాత్పూర్వమేవాస్మద్గృహే స్థితా మమ గృహే జాతా వేతి వదతి । ఇదం తావత్పక్షనిరాకరణసమర్థత్వాన్నానుత్తరం - నాపి మిథ్యైవ కారణోపన్యాసాత్ । నాపి కారణం ఏకదేశస్యాభ్యుపగమాభావాత్ తస్మాత్సకారణమిథ్యోత్తరమిదం అత్ర చ ప్రతివాదినః క్రియా - కారణే ప్రతివాదిన ఇతి వచనాత్ । నను మిథ్యాక్రియా పూర్వవాద ఇతి పూర్వవాదినః క్రియా కస్మాన్న భవతి । తస్య శుద్ధమిథ్యావిషయత్వాత్ । కారణే ప్రతివాదిన ఇత్యేతదపి కస్మాచ్ఛుద్ధకారణవిషయం న భవతి - నైతత్ - సర్వస్యాపి కారణోత్తరస్య మిథ్యాసహచరితరూపత్వాత్ - శుద్ధకారణోత్తరస్యాభావాత్ - ప్రసిద్ధకారణోత్తరే ప్రతిజ్ఞాతార్థైకదేశస్యాభ్యుపగమేనైకదేశస్య మిథ్యాత్వం - యథానేన రూపకశతం గృహీతం సత్యం ధారయామి ప్రతిదత్తత్వాదితి । ప్రకృతోదాహరణే తు ప్రతిజ్ఞాతార్థైకదేశస్యాభ్యుపగమో నాస్తీతి విశేషః । ఏతచ్చ హారీతేన స్పష్టముక్తం । మిథ్యాకారణయోర్వాపి గ్రాహ్యం కారణముత్తరమితి । యత్ర మిథ్యాప్రాఙ్న్యాయయోః పక్షవ్యాపిత్వం । యథా రూపకశతం ధారయతీత్యభియోగే మిథ్యైతత్ । అస్మిన్నర్థే పూర్వమయం మయా పరాజితః । అత్రాపి ప్రతివాదిన ఏవ క్రియా - ప్రాఙ్న్యాయే కారణే చోక్తే ప్రత్యర్థీ నిర్దిశేత్ క్రియామితి వచనాత్ । శుద్ధస్య ప్రాఙ్న్యాయస్యాభావాదనుత్తరత్వప్రసంగాత్ । సంప్రతిపత్తేరపి సాధ్యత్వేనోపదిష్టస్య పక్షస్య సిద్ధత్వోపన్యాసేన సాధ్యత్వనిరాకరణాదేవోత్తరత్వం । యదా తు కారణప్రాఙ్న్యాయసంకరః । యథా రూపకశతమనేన గృహీతమిత్యభియుక్తః ప్రతివదతి సత్యం గృహీతం ప్రతిదత్తం చేత్యస్మిన్నేవార్థే ప్రాఙ్న్యాయేనాయం పరాజిత ఇతి - తత్ర ప్రతివాదినో యథారుచీతి న క్వచిద్వాదిప్రతివాదినోరేకస్మిన్వ్యవ ౬౪
హారే క్రియాద్వయప్రసంగ ఇతి నిర్ణయః ॥

తా॥ ప్రతివాదియుత్తరమిచ్చుకొనెడు విధానము దెలుపఁబడుచున్నది॥ పూర్వోక్తప్రకారముగా పరిశోధించి కాగితముమీఁద వ్రాయించఁబడిన ప్రతిజ్ఞాపత్రికయొక్క తాత్పర్యమును ప్రతివాది లెస్సగా విన్నవాఁడై రాజసమ్ముఖమునందు వాది యెట్టి యుత్తరమును వ్రాయించవలయు - ఆయుత్తరము వా

ఉత్తరము-అనఁగా ఆనసరు.

ది వాదనిరాకరణసమర్థమైన్యాయ్యమైనందేహరహితమై పూర్వోత్తరవిరుద్ధంబుగాక అప్రసిద్ధమ్లిష్టపదప్రయోగదేశాంతరభాషామలచేత దుర్బోధంబుగాకయుండవలయు. ఆయుత్త

ఆయుత్తరము చతుర్విధము

రము-సంప్రతిపత్తి (అనఁగా సత్యోత్తరము). మిథ్యోత్తరము. ప్రత్యవస్కందనము-పూర్వన్యాయము-అని నాలుగు విధములై ప్రవర్తిల్లును. అది యెట్లనిన వాది యైనవాఁడు తనకు నూఱురూపాయలు రావలయునని ప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయించియుండఁగా ప్రతివాది నిశ్చయమే యని యొప్పుకొనుట సత్యోత్తరము - వాది వ్రాయించిన విషయము అబద్ధమనుట మిథ్యోత్తరము - ఆ మిథ్యోత్తరము చతుర్విధమై యుండును-ఇది యబద్ధమనుట ౧ - నేనెఱుంగననుట ౨- నాకు అప్పిచ్చినట్లుగా వాది చెప్పుచున్న కాలమందు నేను దేశాంతరగతుఁడనై యుంటిననుట ౩ - అపుడు నేను పుట్టనేలేదనుట ౪ । రూపాయలు తీసుకొంటినని యొప్పుకొని తిరుగా చెల్లించితినని గాని వాది దానముగా నిచ్చెనాఁడని గాని వ్రాయించుట ప్రత్యవస్కందనోత్తరము- ఈ వాది పూర్వము నామీఁద వాదము దెచ్చి వ్యవహారమార్గముచేత పరాజితుఁడై యున్నాఁడనుట పూర్వన్యాయోత్తరము। ఈ పూర్వన్యాయము జయపత్రికవల్లనైనను పూర్వన్యాయవిచారణకర్తలవల్లనైనను దెలియఁదగినది ॥ ఈ చెప్పఁబడిన యుత్తర

ఉత్తరాభాసంబులు గ్రాహ్యంబులు గావు.

లక్షణములు లేక యుత్తరములవలెఁ దోఁచుచుండు ప్రతివాదివాక్యంబులు ఉత్తరాభాసంబులనంబడునని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియున్నది-ఆయుత్తరాభాసంబులు-సందిగ్ధము-అప్రకృతము అత్యల్పము- అతిభూరి- పక్షైకదేశవ్యాపి-వ్యస్తపదము- అవ్యాపి-నిగూఢార్థము. ఆకులము-వ్యాఖ్యాగమ్యము-అన్యాయ్యము-అని ౧౧ విధములు-అందు-నూఱు సువర్ణములు దీసుకొన్నాఁడని వాది వాదించుచుండఁగా ప్రతివాది నూఱు సువర్ణములో నూఱు మాషములో తీసుకొనియున్నాననుట సందిగ్ధోత్తరము-సువర్ణశతవాదమందు సువర్ణశతము దీసుకొనియున్నాననుట అప్రకృతోత్తరము-సువర్ణశతవాదమందు అయిదు సువర్ణ

ములుదీసుకొన్నాననుట అత్యల్పోత్తరము- సువర్ణశత వాదమందు ఇన్నూఱు సువర్ణములుదీసుకొనియున్నాననుట అతిభూయ్యుత్తరము- బంగారును వస్త్రంబులును దీసుకొనియున్నాఁడనెడు వాదమందు బంగారుదీసుకొనియున్నాను గాని వస్త్రములుదీసుకొనలేదనుట పదైకదేశవ్యాప్యుత్తరము - నూఱు సువర్ణములుదీసుకొనియున్నాఁడని వాదము తేఁబడియుండగా వీఁడు నన్నుఁ గొట్టినాఁడనియుత్తరమిచ్చుట వ్యస్తపదోత్తరము- మధ్యదేశమందు కాశికి పూర్వదిగ్భాగంబుననున్నా భూమినపహరించినాఁడనెడు వాదమందు దేశస్థానాదివిశేషములం దెలుపక అతని భూమి నపహరింపలేదనుట అవ్యాప్యుత్తరము - నూఱు సువర్ణములియ్యవలయునని వాదము తేఁబడియుండఁగా నేనేయియ్యవలెనా అనుటనిగూఢార్థోత్తరము - నిశ్చయమే తీసుకొంటినని చెప్పి యియ్యవలసినది లేదనుట ఆకులోత్తరము అనఁగా పూర్వాపరవిరుద్ధోత్తరము- దుశ్లిష్టవిభక్తినమాసాధ్యాహారాదుల చేతనైనను దేశాంతర భాషచేతనైనను స్పష్టముగాఁ దెలియకుండునట్లు వ్రాయించుట వ్యాఖ్యాగమ్యోత్తరము- నూఱు సువర్ణములు వడ్డికిఁ దీసుకొని వడ్డియిచ్చినాఁడు మూలధనమియ్యలేదనెడు వాదమందు సత్యమే వడ్డియిచ్చినాను అసలు నేఁ దీసుకొనలేదనుట అన్యాయోత్తరము ॥ ఇట్టియుత్తరాభాసంబుల భూవల్లభుండంగీకరింపఁగూడదు ॥

ఉత్తరసాంకర్యనిషేధము.

ఇదియునుంగాక ప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయించఁబడియున్నవిషయములలో నొకవిషయము నిశ్చయమనియు మఱియొక విషయము పరిష్కరింపఁబడినదనియు- ఇంకొకవిషయము అబద్ధమనియు ఇట్లు సంకరముగా వ్రాయించఁబడిన యుత్తరంబులు అంగీకరింపఁ దగినవి కావని కాత్యాయనులచేఁ జెప్పఁబడియున్నది- అదియెట్లనిన- సువర్ణంబులును రూప్యములును వస్త్రములును దీసుకొనియున్నాఁడని వాది ప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయించియుండఁగా ప్రతివాది సువర్ణము దీసుకొన్నది సత్యమనియు రూప్యములను తిరుగ చెల్లించియున్నాననియు వస్త్రవిషయము అబద్ధమనియు నుత్తరమిచ్చుట యుత్తరసాంకర్యము ॥ ఈ యుత్తరసాంకర్యం బేలయంగీకరింపఁగూడదనిన- ఒకవివాదమందు వాదిప్రతివాదులకిద్దఱికిని సాక్షివిచారణాదిక్రియలు జరుగవనియు- ఉభయవాదులకును జయసిద్ధిగలుగదనియు- ఒకని విషయమై సాక్షివిచారణాదిక్రియలు రెండు జరిగింపఁబడవనియు కాత్యాయనులచేఁ జెప్పఁబడియున్నది- మిథ్యోత్తరవ్యవహారమందు వాదియొక్క సాక్ష్యాదివిచారణ సేయవలయుననియు కారణోత్తరవ్యవహారమందును పూర్వన్యాయోత్తరవ్యవహారమందును ప్రతివాదియొక్క సాక్ష్యాదివిచారణ సేయవలయుననియు స్మృతులయందుఁ జెప్పఁబడియున్నవి ఉత్తరసాంకర్యము నంగీకరించినపక్షమందు ఈ చెప్పఁబడినప్రకారము సాక్షివిచారణాదిక్రియలు జరిగించుటకు యుక్తపడదు కాఁబట్టి ఉత్తరసాంకర్యంబు నంగీకరింపఁగూడదు ॥

ఒకవివాదమందు అనేకవిధోత్తరములు ప్రత్యేకముగా గ్రహింపవచ్చును.

అయితే ఆయా విషయమునకుఁ దగిన యుత్తరము ప్రత్యేకముగా వ్రాయించఁబడెనేని క్రమంబుగా అన్నియుత్తరములు గ్రాహ్యంబులే యగును- అట్టి వ్యవహారమందు అధికధనవిషయమై మొదట నుత్తరము దీసుకొని ఆవిషయమును విమర్శించి పిమ్మట అల్పధనవిషయమై యుత్తరము దీసుకొని విచారింపవలయు- అదియెట్లనిన సువర్ణంబును రూప్యములును వస్త్రములును దీసుకొనియున్నాఁడనెడు వాదమందు- సువర్ణంబు నేను దీసుకొనలేదనియు రూప్యవిషయమును బరిష్కరించితిననియు వస్త్రవిషయమై యీ వాది పూర్వము పరాజయమును పొందియున్నాఁడనియు ప్రతివాది యుత్తరముల వ్రాయించెనేని అందు మిక్కిలి అధికధనవిషయమైన సువర్ణవ్యవహారమును వాదిసంబంధములైన సాక్ష్యాది సాధనముల చేత మొదట విచారించి పిమ్మట రూప్యవ్యవహారంబును ఆతర్వాత వస్త్రవ్యవహారంబును ప్రతివాదిసంబంధములైన సాక్ష్యాది సాధనముల చేత విచారింపవలయు- అన్ని విషయములు సమానములు గానుండెనేని వాదిప్రతివాదులయిచ్ఛానుసారముగానైనను సభికుల చిత్తానుసారముగానైనను విచారింపవచ్చును - ప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయించఁబడియున్న యొకవిషయమందే మిథ్యోత్తర కారణోత్తరములు రెండును వ్యాపించియుండెనేని అదియును నసదుత్తరమే యగును - అదియెట్లనిన- ఒకఁడు ఈ యావు నాది యిట్టి కాలమందుఁ బోయి యిపుడు వీని యింటఁ జిక్కినది- అని వాదము దె

చ్చుచుండఁగా మరియొకఁడు-ఇదియబద్ధము-వీఁడు ఏ కాలమందు గోవు పోయినదని చెప్పుచున్నాఁడో ఆ కాలమునకు ముందఁగనే నాయింటనున్నదనియైనను ఇది నాయింటఁబుట్టినదనియైనను ఉత్తరమిచ్చె నేని - ఇది వాదిపక్షనిరాకరణసమర్థమై యుండుటవలన ఉత్తరాభాసంబుగాదు- కారణమును జెప్పుటవలన కేవలమిథ్యోత్తరంబునుగాదు - ఆ కారణము ఏకదేశమును బొందకయుండుటవలన కేవలకారణోత్తరంబునుగాదు-కాఁబట్టి కారణసహితమైన మిథ్యోత్తరమనఁబడును - ఇట్టి వివాదమందు ప్రతివాదియొక్క సాక్ష్యాదిసాధనములను విచారించి తీర్పు సేయవలయునని తాత్పర్యము -ఇట్లు హారీతావివచనానుసారముగా తాత్పర్యమూహింపఁదగినది॥ ౫

మూ. తతోఽర్థీ లేఖయేత్సద్యః ప్రతిజ్ఞాతార్థసాధనమ్॥౬॥

వ్యా॥ ఏవముత్తరే పత్రే నివేశితే సాధ్యసిద్ధేః సాధనాయత్తత్వాత్సాధననిర్దేశం కః కుర్యాదిత్యపేక్షిత ఆహ॥ తత ఇతి॥ తత ఉత్తరానంతరమర్థీ సాధ్యవాన్ సద్య ఏవానంతరమేవ లేఖయేత్ । ప్రతిజ్ఞాతస్సాధ్యః-సచాసావర్థశ్చేతి ప్రతిజ్ఞాతార్థః తస్య సాధనం సాధ్యతేఽనేనేతి సాధనం ప్రమాణం । అత్ర సద్యో లేఖయేదితి వదతా ఉత్తరాభిధానే కాలవిళంబనమప్యంగీకృతమితి గమ్యతే। తచ్చోత్తరత్ర వివేచయిష్యతే । అర్థీ ప్రతిజ్ఞాతార్థసాధనం లేఖయేదితి వదతా యస్య సాధ్యమస్తి స ప్రతిజ్ఞాతార్థసాధనం లేఖయేదిత్యుక్తం। అతశ్చ ప్రాఙ్న్యాయోత్తరే ప్రాఙ్న్యాయస్యైవ సాధ్యత్వాత్ప్రత్యర్థ్యేవార్థీ జాత ఇతి స ఏవ సాధనం నిర్దిశేత్। కారణోత్తరేఽపి కారణస్యైవ సాధ్యత్వాత్కారణవాద్యేవార్థీతి స ఏవ లేఖయేత్ । మిథ్యోత్తరే తు పూర్వవాద్యేవార్థీతి స ఏవ సాధనం నిర్దిశేత్ ।తదాహ అర్థీ లేఖయేదితి వదతా అర్థ్యేవ లేఖయేత్ నాన్య ఇత్యుక్తం । అతశ్చ సంప్రతిపత్త్యుత్తరే సాధ్యాభావాదేవ భాషోత్తరవాదినోర్ద్వయోరప్యర్థిత్వాభావాత్సాధననిర్దేశ ఏవ నాస్తీతి తావతైవ వ్యవహారః పరిసమాప్యత ఇతి గమ్యతే । ఏతదేవ హారీతేన స్పష్టముక్తం। ప్రాఙ్న్యాయే కారణోక్తౌ తు ప్రత్యర్థీ నిర్దిశేత్క్రియాం। మిథ్యోక్తౌ పూర్వవాదీ తు ప్రతిపత్తౌ న సా భవేదితి॥

తా॥ పూర్వన్యాయోత్తరమందు ఆ పూర్వన్యాయంబును కారణోత్తరమందు ఆ కారణంబును సాక్ష్యాదిసాధనములవల్ల ప్రతివాది స్థిరపరచవలయుఁ గనుక ఈ రెండు వ్యవహారములయందును ప్రతివాది సాక్ష్యాదిసాధననిర్దేశము చేయవలయు-మిథ్యోత్తరమందు వాదియైనవాఁడు తన వాదము అబద్ధము గాదని స్థిరపఱచవలయుఁ గనుక వాదియె సాక్ష్యాదిసాధననిర్దేశము చేయవలయు కాఁబట్టి యీరీతిగా వాదిప్రతివాదులలో ఎవని సాక్ష్యాదిసాధనములు విచారింపఁదగినవై యుండునో వాఁడు కాలవిళంబము చేయక తత్కాలమందే సాక్ష్యాదిసాధనములను వ్రాయించవలయు ననియు. ఇట్లు చెప్పుటవలన ఉత్తరమునకు కొంచి త్కాలవిళంబము గూడుననియు । అర్థీ లేఖయేత్ - అని చెప్పుటవలన సాధ్యార్థము గలవాఁడే సాధనములు వ్రాయించవలయుఁగాని యితరుఁడు వ్రాయింపనక్కరలేదనియు-సత్యోత్తరవ్యవహారమందు వాదిప్రతివాదులకిద్దఱికి సాధింపఁదగిన కార్యం బేమియు లేమగనుక సాక్ష్యాదిసాధనములు లేకనే ఆవ్యవహారము సమాప్తంబగుననియును తాత్పర్యము-ఇట్లు హారీతవచనమందుఁ జెప్పఁబడియున్నది. ౬

మూ. తత్సిద్ధౌ సిద్ధిమాప్నోతి విపరీతమతోఽన్యథా॥౭॥

వ్యా॥ తతః కిమిత్యత ఆహ॥ తదితి॥ తస్య సాధనస్య ప్రమాణస్య వక్ష్యమాణలిఖితసాక్ష్యాదిలక్షణస్య సిద్ధౌ నిర్వర్తితౌ సిద్ధిం సాధ్యస్య జయలక్షణాం ప్రాప్నోతి । అతోఽస్మాత్ప్రకారాదన్యథా ప్రకారాంతరేణ సాధనాసిద్ధౌ విపరీతం సాధ్యస్యాసిద్ధిం పరాజయలక్షణాం ప్రాప్నోతీతి సంబంధః॥

జయాపజయఫలములు.

తా॥ పూర్వోక్తప్రకారముగా వాదిప్రతివాదులలో ఎవనియొక్క లిఖిత సాక్ష్యాదిసాధనములు విమర్శింపఁబడునో వాఁడు ఆ సాధనంబులు అవిరుద్ధంబులై సిద్ధించెనేని జయసిద్ధిని బొందుననియు.-ఆ సాధనంబులు పరస్పరవిరుద్ధంబులై సిద్ధించకపోయెనేని అపజయమును బొందుననియు తాత్పర్యము

మూ. చతుష్పాద్వ్యవహారోఽయం వివాదేషూపదర్శితః॥౮॥

వ్యా॥ ఏవం వ్యవహారస్వరూపమభిధాయోపసంహరతి ॥ చతుష్పాదితి ॥ వ్యవహారాన్నృపః పశ్యేదిత్యుక్తో వ్యవహారః సోఽయం

తా॥ఇట్లుసకలవ్యవహారోపయుక్తంబగువ్యవహారమాతృకను జెప్పియపుడావ్యవహారములలోనొకొకచోటనొకొకవిశేషము చెప్పఁబడుచున్నది॥ఒకఁడుతనమీఁదవివాదము దెచ్చియుండఁగా ఆవివాదమునుపరిష్కరించుకొనక ఆవాదిమీఁదమఱియొకవివాదమును తేఁగూడదు- అయితే వాదితనమీఁద దెచ్చియున్నవివాదమునుపరిహరించుకొనుటకుఉపయోగపడునట్టిప్రతివాదమునకీనిషేధము లేదు॥ఒకవ్యవహారమందుప్రతివాదియైయున్నవానిమీఁదఆవివాదపరిష్కారపర్యంతముమఱియొకఁడువివాదము లేఁగూడదు॥ మొదటవిజ్ఞాపనకాలమందు జెప్పఁబడినయర్థమునకువిరుద్ధముగాప్రతిజ్ఞాపత్రిక(వ్రా)యించఁగూడదు-ఈయర్థము-౬౮-శ్లోకమందుఁ జెప్పఁబడియుండఁగా నిచ్చటమఱలఁజెప్పుటయెందుకనిన-అచ్చటవిజ్ఞాపనకాలమందుఒకవస్తువును జెప్పి ప్రతిజ్ఞాపత్రికయందుమఱియొకవస్తువును(వ్రా)యించఁగూడదని చెప్పఁబడియె- అదియెట్లనిన - విజ్ఞాపనకాలమందునాయుడుపాయలువడ్డికిఁదీసుకొన్నాఁడని చెప్పి ప్రతిజ్ఞాపత్రిక(వ్రా)యించునపుడునాలుగువస్త్రంబులువడ్డికిఁదీసుకొన్నాఁడని చెప్పుట ॥ ఈశ్లోకమందువస్తుభేదము లేకున్నను ఋణాదానము మొదలుగాఁగలఅష్టాదశవ్యవహారపదములలోనొకపదమునను సరించి మొదటవిజ్ఞాపనముచేసిమఱియొకపదమునను సరించి ప్రతిజ్ఞాపత్రిక(వ్రా)యించగూడదని చెప్పఁబడియె-అదియెట్లనిన-విజ్ఞాపనకాలమందునాయుడుపాయలువడ్డికిఁదీసుకొన్నాఁడనిఋణాదానవ్యవహారమునననుసరించి చెప్పి ప్రతిజ్ఞాపత్రికయందుసాహసవ్యవహారమునననుసరించినాయుడుపాయలుబలాత్కారముగానపహరించినాఁడని(వ్రా)యించఁగూడదని తెలియఁజేయఁబడియెఁగావునపౌనరుక్త్యము లేదు॥ఇట్లువిజ్ఞాపనకాలమందొకవిధముగాఁజెప్పి ప్రతిజ్ఞాపత్రికయందుమఱియొకవిధముగా(వ్రా)యించినవాఁడుహీనవాదియనఁబడిశిక్షార్హుండగును॥ అయితేయీశ్లోకమందువాదిప్రతివాదులుప్రమాదమునుబొందక జాగ్రత్తగలిగివ్యవహరించుటకైయిట్లు చెప్పఁబడెనుగానిప్రకృతకార్యసిద్ధ్యసిద్ధివిషయమైచెప్పఁబడలేదుగనుక నారదాదివచనానుసారముగాఋణాదానాద్యర్థవ్యవహారములయందు వాదిప్రతివాదులుప్రమాదముచేతచలోక్తులుపలికిదండనార్హులైనప్పటికిని ప్రకృతవ్యవహారమునకు భంగముగలుగదనియు - కొట్టుతిట్టు మొదలైనకోపకృతవ్యవహారములయందు పూర్వోత్తరవిరుద్ధముగాఁబలికినహీనవాది శిక్షార్హుండగుటయగాక ప్రకృతవ్యవహారముగూడతోసివేయఁదగునని యును తెలియఁదగినది- అదియెట్లనిన- విజ్ఞాపనకాలమందు-వీఁడునాతలమీఁదకాలితోఁదన్నినాఁడని చెప్పి- ప్రతిజ్ఞాపత్రికయందుచేతితోఁగొట్టినాఁడని(వ్రా)యించెనేనివాఁడుదండనార్హుఁడగుటయేగాక వానివాదంబుతోసివేయఁదగినదౌనని తాత్పర్యము॥ ౯

తనమీఁదివాదమును పరిష్కరించుకొనక ప్రతివాదిమీఁద వాదము తేఁగూడదు. పూర్వోత్తరవిరుద్ధముగాఁబలికినవాఁడు హీనవాదియనంబడు, అట్టిహీనవాదికి అర్థవివాదమందు శిక్షగలుగును గానివాదహాని లేదు. కోపకృతవ్యవహారమందుశిక్షయు వాదహానియుఁ గలుగును.

మూ- కుర్యాత్ప్రత్యభియోగంచకలహేసాహసేషుచ॥౯౫॥

వ్యా॥ అభియోగమనిస్తీర్య్యనైనంప్రత్యభియోజయేదిత్యస్యాపవాదమాహ॥కుర్యాదితి॥కలహేవాగ్దండపారుష్యాత్మకే-సాహసేషువిషశస్త్రాదినిమిత్తప్రాణవ్యాపాదనాదిషుప్రత్యభియోగసంభవేస్వాభియోగమనిస్తీర్య్యాపిఅభియోక్తారంప్రత్యభియోజయేత్-నన్వత్రాపిపూర్వపక్షోనుపమర్దనరూపత్వేనానుత్తరత్వాత్ప్రత్యభియోగస్యప్రతిజ్ఞాంతరత్వేయుగపద్వ్యవహారాసంభవస్సమానః - సత్యం-నాత్రయుగపద్వ్యవహారాయప్రత్యభియోగోపదేశః| అపితున్యూనదండప్రాప్తయేధికదండనివృత్తయేచ-తథాహి - అనేనాహంతాడితశ్శప్తోవేత్యభియోగేపూర్వమహమనేనతాడితశ్శప్తోవేతిప్రత్యభియోగేదండాల్పత్వం - యథాహనారదః॥ పూర్వమాక్షారయేద్యస్తు నియతంస్యాత్సదోషభాక్ ।పశ్చాద్యస్సోప్యసత్కారీపూర్వేతువినయోగురురితి॥ యదాపునర్యుగపద్ద్వయోస్తాడనాదిప్రవృత్తిస్తదాపిదండనివృత్తిః॥పారుష్యేసాహసేవాపియుగపత్సంప్రవృత్తయోః।విశేషశ్చేన్నలభ్యేతవినయస్స్యాత్సమస్తయోరితి॥ఏవంచతియుగపద్వ్యవహారప్రవృత్త్యసంభవేపికలహాదౌప్రత్యభియోగోర్థవాన్-ఋణాదానాదిషుతునిరర్థకఏవ॥ ౯౫

తా॥ ఒకఁడుతనమీఁదతెచ్చియున్నవివాదమునుపరిష్కరించుకొనకముందరఆవాదిమీఁదప్రతివాదము తేఁగూడదనిపూర్వశ్లోకమందుఁజెప్పఁబడెనుగదా ఆవిషయము కొన్నివ్యవహారముల

కలహసాహస

వ్యవహారముల యందు తనమీఁది వాదము దీరకముందర నే వాదిమీఁద వాదము తేవచ్చును.

యందుఉపయోగపడదని తెలియఁజేయఁబడుచున్నది॥ కొట్టుతిట్టు మొదలుగాఁగల కలహవ్యవహారములయందును విషముపెట్టుట కత్తిచేనఱుకుట మొదలుగాఁగల సాహసవ్యవహారములయందును ఆ వాదిమీఁద ప్రతివాదము గలిగియుండెనేని మొదట తనమీఁద వచ్చియున్న వాదము పరిష్కరింపఁబడకముందర నే ఆ వాదిమీఁద ప్రతివాదము తేవలయును-అదియెందువల్లననిన-ఒకఁడు తన్నుఁ గొట్టినాఁడని వాదము దెచ్చియుండఁగా మొదట నన్నుఁ గొట్టినాఁడని ప్రతివాది యెదురు వాదమాడి సాక్ష్యాది సాధనముల చేత సాధించెనేని మొదటఁ గొట్టినవానికి అధిక శిక్షయు వెనుకఁ గొట్టినవానికి స్వల్ప శిక్షయు విధించవలయుననియు-సాక్ష్యాది సాధనములవల్లను ముందు వెనక తేర్పడకుండెనేని ఇద్దఱికిని సమాన శిక్ష విధింపవలయునని యీ నారదవచనమందుఁ జెప్పఁబడియున్నది గనుక కలహసాహసవ్యవహారములయందు మొదటి వివాదము పరిష్కరింపఁబడకముందర నే వాదిమీఁద ప్రతివాదము తేవలయునని తాత్పర్యము॥ ౯౪

మూ. ఉభయోః ప్రతిభూర్గ్రాహ్యస్సమర్థః కార్యనిర్ణయే॥౧౦॥

వ్యా॥ అర్థిప్రత్యర్థినోర్విధిముక్త్వా సభ్యస్య సభాపతేః కర్తవ్యమాహ॥ ఉభయోరితి॥ ఉభయోరర్థిప్రత్యర్థినోః సర్వేష్వపి వాదేషు-నిర్ణయస్య కార్యం కార్యనిర్ణయః-ఆహితాగ్న్యాదిషు పాఠాత్కార్యశబ్దస్య పూర్వనిపాతః-నిర్ణయస్య కార్యం సాధితధనదానం దండదానంచ-తస్మిన్ సమర్థః-ప్రతిభూః ప్రతిభవతి తత్కార్యే తద్వద్భవతీతి ప్రతిభూః గ్రాహ్యః- సభ్యైస్సభాపతినా-తస్యాసంభవే ఽర్థిప్రత్యర్థినో రక్షణే పురుషా నియోక్తవ్యాః। తేభ్యశ్చ తాభ్యాం ప్రతిదివసం దినాంతే వేతనం దేయం యథాహ కాత్యాయనః-అథ చేత్ప్రతిభూర్నాస్తి కార్యయోగ్యస్తు వాదినః। రక్షితో ఽసౌ దినస్యాంతే దద్యాద్భృత్యాయ వేతనమితి॥ ౧౦

జామీనుదీసుకొనుట.

తా॥ ఇట్లు వాదిప్రతివాదులకుఁ గల విధానములఁ జెప్పి యిఁకను సభికసహితుండైన ప్రాడ్వివాకుండనెడు సభాపతికిఁ గల విధానములు చెప్పఁబడుచున్నవి॥ సభికసహితుండైన సభాపతి వ్యవహారములయందు పరాజయమును బొందినవానివల్ల జయమును బొందినవానికి రాఁదగిన ద్రవ్యమునకును భూపాలునకుఁ జేరఁదగిన దండనద్రవ్యంబునకును ఆ ద్రవ్యమును చెల్లింపశక్తుండైన యొకధనికుని జామీను దారునిఁగా నేర్పరచుకొనవలయు। అట్టి జామీను దారుఁడు దొరకనిపక్షమందు కాత్యాయనోక్త ప్రకారముగా ఆ ద్రవ్యమియ్యవలసినవానిఁగా పాడుటకై బంటుల నేర్పఱచి ప్రతిదినము సాయంకాలమందు ఎవనివిషయమై ఆ బంటులేర్పరచఁబడియుందురో వానివల్ల ఆ బంటులకు వేతనమిప్పించవలయునని తాత్పర్యము॥ ౧౦

మూ. నిహ్నవే భావితో దద్యాద్ధనం రాజ్ఞే చ తత్సమమ్। మిథ్యా
భియోగీ ద్విగుణమభియోగాద్ధనం వహేత్॥౧౧॥...

వ్యా॥ అర్థిప్రత్యర్థినోర్నిర్ణయకార్యే సభ్యైస్సభాపతినా ప్రతిభూర్గ్రాహ్య ఇత్యుక్తం కింతన్నిర్ణయకార్యం యస్మిన్ ప్రతిభూర్గ్రాహ్య ఇత్యపేక్షిత ఆహ॥ నిహ్నవ ఇతి॥ అర్థినా నివేదితస్యాభియోగస్య ప్రత్యర్థినా నిహ్నవే కృతే యద్యర్థినా సాక్ష్యాదిభిర్భావితో ఙ్గీకారితః ప్రత్యర్థీ తదా దద్యాద్ధనం ప్రకృతమర్థినే రాజ్ఞే చ తత్సమమపరం దండం-అథార్థీ భావయితుం న శక్నోతి తదా స ఏవ మిథ్యాభియోగీ జాత ఇత్యభియోగాదభియుక్తధనాద్ద్విగుణం ధనం దద్యాద్రాజ్ఞే- ప్రాఙ్న్యాయే ప్రత్యవస్కందనే చేదమేవ యోజనీయం - తత్ర ప్రత్యర్థీ యావన్నిహ్నవవాదీ తత్ప్రత్యర్థినా భావితో రాజ్ఞే ప్రకృతధనసమం దండం దద్యాత్ - అథ ప్రత్యర్థీ ప్రాఙ్న్యాయం కారణం వా భావయితుం న శక్నోతి తదా స ఏవ మిథ్యాభియోగీతి రాజ్ఞే ద్విగుణం ధనం దద్యాదర్థినే చ ప్రకృతం ధనం- సంప్రతిపత్త్యుత్తరే తు దండాభావ ఏవ-ఏతచ్చ ఋణాదానవిషయ ఏవ- పదాంతరేషు తత్ర తత్ర దండాభిధానాద్ధనవ్యవహారేష్వస్యాసంభవాచ్చ-న సర్వవిషయత్వం - రాజ్ఞాధమర్ణికో దాప్య ఇత్యస్య ఋణాదానవిషయత్వేపి తత్ర విశేషం వక్ష్యామః-అథవైతదేవ సర్వవ్యవహారవిషయత్వేనాపి యోజనీయం - కథమభియోగస్య నిహ్నవేఽభియుక్తేన కృతే యద్యభియోక్త్రా సాక్ష్యాదిభిర్భావితోఽభియుక్తస్తదా తత్సమం తత్ర తత్ర ప్రతిపదోక్తమేవ - చశబ్దోఽవధారణే - ధనదండం దద్యాద్రాజ్ఞ ఇత్యనువాదః - అథాభియోక్తాభియోగం భావయితుం న శక్నోతి తదా మిథ్యాభియోగీతి ప్రతిపదోక్తం ద్విగుణం దండం దద్యాదితి విధేయతే అత్రాపి ప్రాఙ్న్యాయే ప్రత్యవస్కందనే చ పూర్వవదేవ యోజనీయం॥

తా॥ పూర్వశ్లోకమందు వాదము చేత సాధింపఁబడిన ద్రవ్యమునకును దండనద్రవ్యమునకును జామీను దీసుకొనవల

వాదిప్రతివాదులకుదండనాదిధననిర్ణయక్రమము.

యనని చెప్పఁబడెనుగదా యీశ్లోకమందు ఆదండనాదినిర్ణయక్రమము దెలియఁజేయఁబడుచున్నది॥ వాది తెచ్చినవాదము బద్ధమని ప్రతివాది యుత్తరమిచ్చుచుండఁగా ఆవాది సాక్ష్యాదిసాధనములచేత తనవాదమును స్థిరపఱచెనేని అపుడా ప్రతివాది వాదిధనంబును వాదికిచ్చి ఆవాదధనమునకు సమానమైనధనమును అపరాధార్థమై ప్రభువునకియ్యవలయు॥ వాదియైనవాఁడు తనవాదమును సాక్ష్యాదిసాధనములచే స్థిరపఱచలేనిపక్షమందు అబద్ధపువాదమును దెచ్చినవాఁడవుచున్నాఁడుగనుక తనవాదధనమునకు రెట్టింపుధనమును అపరాధార్థమై భూపాలునకియ్యవలయు - పూర్వన్యాయోత్తరమందు వాది పూర్వము పరాజయమును బొందియున్నాఁడనుటను జయపత్రికాదులచేత ప్రతివాది స్థిరపఱచవలయుఁగనుక నుకారణోత్తరమందు తాను చెప్పినకారణమును సాక్ష్యాదులచే స్థిరపఱచవలయుఁగనుక నట్లు ప్రతివాది స్థిరపరచినపక్షమందు వాదియైనవాఁడు తనవివాదధనమునకు సమానమైనధనమును అపరాధార్థమై ప్రభువునకియ్యవలయు- ప్రతివాది తాను ఉత్తరమందుఁ దెలియఁజేసిన పూర్వన్యాయమునైనను కారణమునైనను స్థిరపఱచలేనిపక్షమందు ఆప్రతివాది అనృతవాదియవుచున్నాఁడుగనుక ఆవాదధనమునకు రెట్టింపుధనమును అపరాధార్థమై భూపాలునకియ్యవలయు - సత్యోత్తరమందు వాదిప్రతివాదులకిద్దఱికిని అపరాధములేదు॥ ఇది ఋణాదానవిషయము-ఇతరవ్యవహారవిషయమై అచ్చటచ్చట ప్రత్యేకముగా దండనక్రమమును జెప్పియుండుటవలన ఈదండనము సర్వవ్యవహారవిషయముగాదని యొకపక్షము॥ మఱియొకపక్షమందు సర్వవ్యవహారవిషయముగా నేయోజింపవచ్చును - అదియెట్లనిన- వాది తెచ్చినవాదము బద్ధమని ప్రతివాది యుత్తరమిచ్చుచుండఁగా ఆ వాది సాక్ష్యాదిసాధనములచేత తనవాదమును స్థిరపఱచెనే ప్రతివాదికి ఆయావ్యవహారమందు అచ్చటచ్చటఁ జెప్పియున్న శిక్షయే విధింపఁదగినది- వాదియైనవాఁడు తనవాదమును స్థిరపఱచలేనిపక్షమందు ఆయావ్యవహారమందుఁ జెప్పియున్న శిక్షకు రెట్టింపుగా వాదికిశిక్షవిధింపఁదగినది- ఈరీతిగా నే పూర్వన్యాయోత్తరమందును కారణోత్తరమందును ఊహింపఁదగినది॥

మూ. { సాహసస్తేయపారుష్యగోభిశాపాత్యయే స్త్రియాం।
వివాదయేత్సద్య ఏవ కాలోఽన్యత్రేచ్ఛయా స్మృతః॥ ౧౨ }

వ్యా॥ తతోఽర్థిలేఖ్యమేత్సద్యః ప్రతిజ్ఞాతార్థసాధనమితివదతోత్తరపాదలేఖనే కాలప్రతీక్షణందర్శితం తత్రాపవాదమాహ॥ సాహసేతి॥ సాహసంవిషశస్త్రాదినిమిత్తం ప్రాణివ్యాపాదనాది - స్తేయంచౌర్యం. పారుష్యంవాగ్దండపారుష్యం వక్ష్యమాణలక్షణం - గావోదోగ్ధ్ర్యః -అభిశాపఃపాతకాభియోగః. అత్యయః ప్రాణధనాతిపాతస్తస్మిన్ - ద్వంద్వైకవద్భావాదేకవచనం - స్త్రియాంకుల స్త్రియాం దాస్యాంచ - కులస్త్రియాం చారిత్రవివాదే దాస్యాంస్వత్వాస్వత్వవివాదే వివాదయేత్ ఉత్తరందాపయేత్సద్యఏవకాలప్రతీక్షణంనకుర్యాత్ - అన్యత్ర వివాదాంతరేషూత్తరదానకాల ఇచ్ఛయా అర్థిప్రత్యర్థి సభ్యసభాపతీనాం స్మృతః ఉక్తః॥ ౧౨

తత్క్షణమేయుత్తరమిచ్చుకొనదగినవివాదములు

తా॥ విషము పెట్టుటను ఖుకుట మొదలుగాఁగల సాహసవ్యవహారములయందును-చౌర్యవ్యవహారమందును-కొట్టుతిట్టులనెడు పారుష్యవ్యవహారములయందును-గోవ్యవహారమందును-పాతకవిషయమైనవ్యవహారమందును- ప్రాణధనాద్యపాయవ్యవహారములయందును - కులస్త్రీచారిత్రవివాదమందును వేశ్యలస్వాతంత్ర్యపారతంత్ర్యవివాదములయందును- కాలవిళంబము సేయక తత్కాలమందే ప్రతివాది యుత్తరమిచ్చుకొనవలయు-ఇతరవ్యవహారములయందు వాది ప్రతివాదులయిచ్ఛానుసారముగానైనను సభిక ప్రాడ్వివాకుల చిత్తానుసారముగానైనను ఉత్తరమిచ్చుకొనవచ్చునుట॥

మూ. { దేశాద్దేశాంతరం యాతి సృక్కిణీ పరిలేఢి చ। లలాటం స్విద్యతే చాస్య ముఖం వైవర్ణ్యమేతి చ॥ పరిశుష్యత్స్ఖలద్వాక్యో విరుద్ధం బహు భాషతే। వాక్చక్షుః పూజయతి నో తథోష్ఠౌ నిర్భుజత్యపి॥ స్వభావాద్వికృతిం యాతి మనోవాక్కాయకర్మభిః। అభియోగేఽథ సాక్ష్యే వా స దుష్టః పరికీర్తితః॥ ౧౪ }

వ్యా॥ దుష్టలక్షణమాహ॥ దేశాదిత్యాది॥ య మనోవాక్కాయకర్మభిః యస్స్వభావాదేవ నభయాదినిమిత్తాద్వికృతిం వికారం యాతి స కృతవ్యసాధభియోగేసాక్ష్యే వా దుష్టః పరికీర్తితః - తాం వికృతిం విభజ్య దర్శయతి-దేశాద్దేశాంతరం యాతి న క్వచిదవతిష్ఠతే-సృ

త్ర కస్యక్రియేత్యాకాంక్షితఆహ॥సాక్షిష్వితి॥ ఉభయతఉభయోరపివాదినోస్సాక్షిషుసంభవత్సుసత్సుసాక్షిణఃపూర్వవాదినఃపూర్వపక్షస్యాలేఖ్యయాగృహీతముపభుక్తంచేతియోవదత్యసౌపూర్వవాదీ-సపునఃపూర్వంయోనివేదయతి-తస్యసాక్షిణఃప్రష్టవ్యాః- యదాత్వన్యఏవంవదతిసత్యమనేనపూర్వంగృహీతముపభుక్తంచ- కింతురాజ్ఞఏవమేక్షేత్రమస్మాదేవక్రయేణలబ్ధ్వామహ్యందత్తమన్యేనవాప్రతిగ్రహేణలబ్ధ్వామహ్యందత్తమితి-తత్రపూర్వపక్షోఽసాధ్యతయాధరీభూతస్తస్మిన్పూర్వపక్షేఽధరీభూతేభవంత్యుత్తరవాదినఃఉత్తరకాలంప్రతిగృహీతముపభుక్తంచేతివాదినస్సాక్షిణఃప్రష్టవ్యాభవంతి - ఇదమేవవ్యాఖ్యానంయుక్తతరం-మిథ్యోత్తరేపూర్వవాదినస్సాక్షిణోభవంతి- ప్రాఙ్న్యాయేకారణోక్తౌపూర్వపక్షేధరీభూతేఉత్తరవాదినస్సాక్షిణాంభవంతీతివ్యాఖ్యానమయుక్తం- అస్యార్థస్యతతోఽర్థలేఖమేతస్యద్వ్యక్షీప్రతిజ్ఞాతార్థసాధనమిత్యనేనోక్తత్వాత్పునరుక్తిప్రసంగాత్పూర్వవ్యాఖ్యానమేవస్పష్టీకృతంనారదేన॥మిథ్యాక్రియాపూర్వవాదేకారణేప్రతివాదినః। ప్రాఙ్న్యాయవిధిసిద్ధౌతుజయపత్రంక్రియాభవేదిత్యుక్త్వా-ద్వయోర్వివదతోరర్థేద్వయోస్సత్సుచసాక్షిషు। పూర్వపక్షోభవేద్యస్యభవేయుస్తస్యసాక్షిణఇతివదతైతస్యసర్వవ్యవహారవిలక్షణత్వాద్భేదేనోపన్యాసః॥ ౧౭

తా॥ ఒకఁడుఒకానొకభూమినిప్రతిగ్రహమువలనస్వాధీనపఱచుకొనికొంతకాలమనుభవింపుచుండి కార్యవశంబునకుటుంబసమేతుఁడై దేశాంతరమునకుఁబోయెను-పిమ్మటమఱియొకఁడుఆభూమినేరాజప్రతిగ్రహమువలనస్వాధీనపఱచుకొనియనుభవింపుచుండి వాఁడును దేశాంతరమువెళ్లెను - తర్వాతనాయిద్దఱువచ్చి వివాదపడియేకకాలమందు న్యాయాధికారిసమ్ముఖమునవిజ్ఞాపనచేసుకొనిరేనివారిలో ఎవనిసాధనముల విచారింపవలయుననిన - ఆయిద్దఱికిని సాక్షులుండిరేని పూర్వకాలమందునేనుప్రతిగ్రహించి యనుభవింపుచున్నవాఁడననియెవఁడుచెప్పుచున్నాఁడో వాఁడేయిచ్చటపూర్వవాదిగనుకవానిసాక్షులవిచారింపవలయు- ఒకవేళఉత్తరకాలవాదియితఁడు మొదటప్రతిగ్రహించియనుభవింపుచుండెననుటసత్యమే- పిమ్మటప్రభువువీనివల్లక్రయమునకుఁదీసినాకుదానముచేసినాఁడనియైనను . ఇతనివల్లమఱియొకఁడు ప్రతిగ్రహించివాకిచ్చినాఁడనియైననుచెప్పె నేనిఅపుడుపూర్వపక్షముబలహీనమాచున్నదిగనుకఉత్తరకాలమందుఆభూమిననుభవింపుచున్నట్టుగాచెప్పినవానిసాక్షులనేవిచారింపవలయుననితాత్పర్యము-ఈయర్థమేనారదవచనమందునుజెప్పఁబడియున్నది. ౧౭

ఏకకాలంబున ఇద్దఱువివాదపడివచ్చిరేని-ఎవనిసాక్షులవిచారింపవలయు.

మూ. సపణశ్చేద్వివాదస్స్యాత్తత్రహీనంతుదాపయేత్ ।
దండంచస్వపణంచైవధనినేధనమేవచ ॥౧౮॥ . . . . .

వ్యా॥ అపిచ॥ సపణఇతి॥ యదివివాదోవ్యవహారఃపణనంపణస్తేనసహవర్తతఇతిసపణస్స్యాత్తదాతత్రసపణేవ్యవహారేహీనంపరాజితంపూర్వోక్తందండంస్వకృతంచపణంరాజ్ఞేఅర్థినేచవివాదాస్పదీభూతంధనందాపయేత్ప్రాజా - యత్రపునరేకఃకోపావేశవశాద్యద్యహమత్రపరాజితోభవామితేదాశతంపణశతందాస్యామీతిప్రతిజానీతే - అన్యస్తునకించిత్ప్రతిజానీతే-తత్రాపివ్యవహారప్రవర్తనే - తస్మింశ్చప్రవృత్తేపణప్రతిజ్ఞావాదీయదిహీయతేతదాసఏవస్వపణందండందాప్యః-అన్యస్తుపరాజితోదండందాప్యోనపణం - స్వపణంచేతివిశేషోపాదానాత్-యత్రత్వేకశ్శతమన్యస్తుపంచాశతంప్రతిజానీతే-తత్రాపిపరాజయేస్వకృతమేవపణందాప్యః సపణశ్చేద్వివాదస్స్యాదితివదతాపణరహితోపివివాదోదర్శితఇతి॥ ౧౮

తా॥ వివాదసమయమందువాదిప్రతివాదులొకనితోనొకఁడునేనీవ్యవహారమందోడినపక్షమందు ఇంతధనమునిత్తునని పందెమాడివ్యవహారమందుప్రవర్తించిరేని వారిలోపరాజయమునుబొందినవాఁడుతానుపందెమాడినపైకంబునుపూర్వోక్తమైనదండనధనంబును భూపాలునకిచ్చి వివాదధనమును వాదికియ్యవలయు - ఒకఁడుకోపాటోపంబున నేనీవివాదమందోడితినేని నూఱుపణములనిత్తునని పందెమాడఁగామఱియొకఁడేమియుపందెమాడకయుండె నేనిఅట్టివ్యవహారమందుపందెమాడినవాఁడోడినయెడల తానుపందెమాడినపణంబులను దండనద్రవ్యంబును ప్రభువునకిచ్చివివాదద్రవ్యమును వాదికియ్యవలయు . పందెమాడకయున్నవాఁడుపరాజితుండయ్యె నేని దండనద్రవ్యమునుభూపాలునకియ్యవలయునుగాని మొదటివాఁడుపందెమాడినద్రవ్యమునియ్యనక్కరలేదు- వాదిప్రతివాదులలోనొకఁడునూఱుపణం

పందెమువేసుకొని వ్యాజ్యమాడుట.

బులను కుటిలయొకఁడు పంబదివణంబులను పందెము వేసుకొన్నపక్షమందు వారిలో ఓడినవాఁడు తాను పందెమాడిన ద్రవ్యంబును దండనద్రవ్యంబును రాజునకిచ్చి వివాదద్రవ్యమును వాదికియ్యవలయు- సపణశ్చేత్ - అని చెప్పుటవలన పందెము లేనివ్యవహారంబును గలదని తాత్పర్యము. ౧౮

మూ. { ఛలంనిరస్యభూతేన వ్యవహారాన్నయేన్నృపః। భూ
తమప్యనుపన్యస్తంహీయతేవ్యవహారతః॥౧౯॥ }

వ్యా॥ కించ॥ ఛలమితి॥ ఛలం ప్రమాదాభిహితం నిరస్య పరిత్యజ్య భూతేన వస్తుతత్త్వానుసరణేన వ్యవహారాన్నయేదంతం నృపః- యస్మాద్భూతమపి వస్తుతత్త్వమప్యనుపన్యస్తమనభిహితం హీయతే హానిముపగచ్ఛతి వ్యవహారతో వ్యవహారేణ సాక్ష్యాదిభిః తస్మాద్భూతానుసరణం కర్తవ్యం - యథార్థిప్రత్యర్థినౌ సత్యమేవ వదతస్తథా సభ్యైస్సభాపతినా యతితవ్యం సామాదిభిరుపాయైః తథా సతి సాక్ష్యాదినైరపేక్ష్యేణైవ నిర్ణయో భవతీతి - అథ సర్వథాపి భూతానుసరణం న శక్యతే కర్తుం తథా సతి సాక్ష్యాదిభిర్నిర్ణయః కార్య ఇత్యయమనుకల్పః- యథోక్తం॥ భూతఛలానుసారిత్వాద్ద్విగతిస్సముదాహృతా। భూతం తత్త్వార్థసంయుక్తం ప్రమాదాభిహితం ఛలమితి। తత్ర భూతానుసారీ వ్యవహారో ముఖ్యః - ఛలానుసారీ త్వనుకల్పః- సాక్షిలేఖ్యాదిభిర్వ్యవహారనిర్ణయే కదాచిద్వస్తుస్వరూపానుసరణం భవతి- కదాచిన్న భవతి- సాక్ష్యాదీనాం వ్యభిచారస్యాపి సంభవాత్॥ ౧౯

వ్యవహారతత్త్వనిర్ణయక్రమము.

తా॥ వాదిప్రతివాదులు వస్తుతత్త్వమును దెలుపక అనృతము పలికిన యెడల యథార్థవిషయమైనను ఒకప్పుడు సాక్ష్యాదులవల్ల హానిని బొందుచున్నది కాఁబట్టి న్యాయాధికారి వ్యవహారవిచారణకాలమందు వాదిప్రతివాదులు ప్రమాదమువల్ల అనృతోక్తులు పలికినను ఆ యనృతోక్తులం దోసివేసి వారు సత్యము పలుకునట్లు సామాద్యుపాయముల చేత బోధించి ఆ వాదిప్రతివాదులవలన వస్తుతత్త్వమును దెలుసుకొని వ్యవహారమును తీరుమానించుట ముఖ్యపక్షము - ఇట్లు చేసిన యెడల సాక్ష్యాదిసాధనములు లేకనే వ్యవహారనిశ్చయజ్ఞానము గల్గుచున్నది- సామాద్యుపాయముల చేత వాదిప్రతివాదులు వస్తుతత్త్వమును దెలుపని యెడల సాక్ష్యాదిసాధనములవల్ల వ్యవహారమును తీరుమానించుట రెండవపక్షము ॥ ఈ రీతిగా నన్యస్మృత్యంతరమందు-భూతానుసారి-ఛలానుసారి. అని వ్యవహారము ద్వివిధంబై యుండుననియు - అందు తత్త్వార్థయుక్తమైన భూతానుసారివ్యవహారము ముఖ్యమనియు ప్రమాదాభిహితమైన ఛలానుసారివ్యవహారము ముఖ్యము గాదనియును జెప్పఁబడియున్నది॥ ౧౯

మూ. { నిహ్నుతే లిఖితంనైకమేకదేశే విభావితః। దాప్యస్స
ర్వంనృపేణార్థంన గ్రాహ్యస్త్వనివేదితః॥౨౦॥ }

వ్యా॥ భూతమప్యనుపన్యస్తంహీయతే వ్యవహారత ఇత్యస్యోదాహరణమాహ॥ నిహ్నుత ఇతి॥ నైకమనేకం సువర్ణరజతవస్త్రాదిలిఖితమభియుక్తమర్థినా ప్రత్యర్థీ యది సర్వమేవ నిహ్నుతే అపజానీతే తదార్థినా నైకదేశే హిరణ్యే సాక్ష్యాదిభిః ప్రత్యర్థీ భావితోంగీకారితస్సర్వం రజతాద్యర్థం పూర్వలిఖితం దాప్యోర్థినే నృపేణ-న గ్రాహ్యస్త్వనివేదితః- పూర్వం భాషాకాలే అనివేదితః పశ్చాదర్థినా పూర్వం మయా యం న్యస్తమిత్యనివేద్యమానో న గ్రాహ్యోర్థినా దత్తప్యాన్నృపేణ- ఏతచ్చ న కేవలం వాచనికం ఏకదేశే ప్రత్యర్థినో మిథ్యావాదిత్వనిశ్చయాద్దేశాంతరేపి మిథ్యావాదిత్వసంభవాదర్థిన ఏకదేశే సత్యవాదిత్వనిశ్చయాద్దేశాంతరేపి సత్యవాదిత్వసంభవాత్ - ఏవం తర్కాఖ్యసహకారిసంభావనాప్రత్యయానుగృహీతాదస్మాదేవ యోగీశ్వరవచనాత్సర్వం దాపనీయం నృపేణేతి నిర్ణయః- ఏతం చ తర్కవ్యాఖ్యానసారేణ నిర్ణయే క్రియమాణే వస్తునోన్యథాత్వేపి వ్యవహారదర్శినాం న దోషః- తథా చ గౌతమః। న్యాయాధిగమే తర్కోభ్యుపాయస్తేనాభ్యూహ్య యథాస్థానం గమయేదితి- యుక్త్వా తస్మాద్రాజాచార్యావనింద్యావితి ప్రకరణముపసంహరతి- న చైకదేశే విభావితో మహాపాపేయవచనః ప్రత్యర్థీ [illegible] వాదిహా గమ్యతే - ఏకదేశవిభావితో నృపేణ సర్వం దాప్య ఇతి వచనాత్- యత్తు కాత్యాయనేనోక్తం॥ అనేకార్థాభియోగేపి [illegible] సాధయేద్ధనీ। సాక్షిభిస్తావదేవాసౌ లభతే నాధికం ధనమితి- తత్పుత్రాదిదేయపిత్రాదిఋణవిషయం - తత్ర [illegible] క్తః పుత్రాదిర్న జానామీతి వదతి నిహ్నవవాదీ న భవతీత్యేకదేశవిభావితోపి న సర్వం దాప్యః వాదీ తినిహ్నుతే లిఖితం [illegible] త్రం తత్ర న

ప్రవర్తతే - నిహ్నవాభావాదపేక్షితత్వాభావాచ్చ - అనేకార్థాభియోగేపీతి కాత్యాయనవచనం సామాన్యవిషయం విశేషశాస్త్రవిషయం నిహ్నవోత్తరం వరిత్యజ్య జ్ఞానోత్తరే ప్రవర్తతే - నను - ఋణాదిషు వివాదేషు స్థిరప్రాయేషు నిశ్చితం । ఊనే వాభ్యధికే వార్థే ప్రోక్తే సాధ్యం న సిధ్యతీతి వదతా కాత్యాయనేనానేకార్థాభియోగే సాక్షిభిరేకదేశే విభావితేఽధికే వాభావితే సాధ్యం సర్వమేవ న సిధ్యతీత్యుక్తం - తథా సత్యేకదేశవిభావితేఽభావితైకదేశసిద్ధిః కుతస్స్యాదుచ్యతే - లిఖితసర్వార్థసాధనతయోపన్యస్తైస్సాక్షిభిరేకదేశాభిధానేఽధికాభిధానే వా కృత్స్నమేవ సాధ్యం న సిధ్యతీతి తస్యార్థస్తత్రాపి నిశ్చితం న సిధ్యతీతి వచనాత్పూర్వవత్సంశయ ఏవేతి ప్రమాణాంతరస్యావకాశోఽస్త్యేవ - ఫలం నిరస్యేతి నియమాత్ప్రహసాదాతుస్సకలసాధ్యసాధనతయోపదిష్టైస్సాక్షిభిరేకదేశేఽపి సాధితే కృత్స్నసాధ్యసిద్ధిర్భవత్యేవ - తావతైవ సాహసాదేస్సిద్ధత్వాత్కాత్యాయనవచనాచ్చ ॥ సాధ్యార్థాంశేఽపి గదితే సాక్షిభిస్సకలం భవేత్ । స్త్రీసంగే సాహసే చౌర్యే యత్సాధ్యం పరికీర్తితమితి ॥ ౨౦

ఒక వ్యవహారమందు కొంతకు సాధనములుండి కొంతకు సాధనములు లేకుండెనేని చేయఁదగిన క్రమము.

తా ॥ వాదిప్రతివాదులు యథార్థముగాఁ జెప్పనియెడల వస్తుతత్త్వము హానిని బొందుచున్నదన్నందుకు ఉదాహరణము దెలియఁజేయఁబడుచున్నది ॥ వాదియైన వాఁడు ప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయించిన బంగారు వెండి వలువలు మొదలుగాఁగల యనేకవస్తువులలో నొకటియైనను నేఁదీసుకొనలేదని ప్రతివాది యుత్తరమిచ్చి పిమ్మట సాక్ష్యాదిసాధనములచేత తప్పించుకొనఁజాలక యొకవస్తువు దీసుకొన్నట్లుగా నొప్పుకొన్నపక్షమందు ఆ ప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయఁబడిన అన్నివస్తువులను రాజవశ్యముగా వాదికిప్పించవలయుననియు - వాదిప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయించని వస్తువును మొదట ఈవస్తువును వ్రాయించుటకు మఱచితినని చెప్పుకొన్నను అంగీకరింపఁగూడదనియును తాత్పర్యము ॥ ఇది కేవలవచనప్రమాణసిద్ధంబె గాదు యుక్తియుక్తంబుగానుంచున్నది - అదియెట్లనిన ప్రతివాదియొక విషయమందు అనృతవాదియని నిశ్చయమాటవలన ఇతరవిషయములయందును అనృతవాదియై యుండుననియు - వాదియొక విషయమందు సత్యవాదియని నిశ్చయమాటవలన ఇతరవిషయములయందును సత్యవాదియై యుండుననియు ఊహింపఁదగియుండుటవలన - ఇట్టి తర్కన్యాయానుసారముగా నిశ్చయింపఁబడిన వ్యవహారమందు వస్తుతత్త్వము మఱియొకవిధమై యున్నప్పటికిని వ్యవహారవిచారణకర్తలకు దోషము లేదని గౌతమసూత్రమందుఁ జెప్పఁబడియున్నది ॥ మఱియును ఈవ్యాఖ్యానమందున్న కాత్యాయనవచనములలో మొదటివచనమునకు - తండ్రి మొదలైనవారి ఋణమునుగురించి కొమారుఁడు మొదలైనవారిమీఁద అనేకవస్తువులకు వివాదము వచ్చినపక్షమందు వారు తామేమియు నెఱుఁగమని యుత్తరమిచ్చినప్పటికిని మిథ్యావాదులు గారుగనుక అట్టివ్యవహారమందు వాది యేయేవస్తువును సాక్ష్యాదిసాధనములచే సాధించుకొనుచున్నాఁడో ఆ యావస్తువునే పొందును గాని అధికము పొందఁజాలఁడని తాత్పర్యము - రెండవవచనమునకు - ఋణాదివ్యవహారములయందు ప్రతిజ్ఞాపత్రికయందు వ్రాయించఁబడిన యావత్సంగతులకు సాక్షులుగా నేర్పడివచ్చినవారు కొంత తక్కువగానైనను హెచ్చుగానైనను జెప్పరేని అట్టిసాక్షులవలన ఆవ్యవహారము సిద్ధింపదనియు - ఇతరప్రమాణములున్నయెడల సిద్ధించుననియును తాత్పర్యము - మూఁడవవచనమునకు - స్త్రీసంగ్రహణము విషముపెట్టుట నఱుకుట దొంగిలించుట మొదలుగాఁగల వ్యవహారములయందు కొన్ని సంగతులు సాక్షులవల్ల స్థిరపడి కొన్ని సంగతులు స్థిరపడకున్నను ఆవ్యవహారము సంపూర్ణముగా సిద్ధింపుచున్నదని తాత్పర్యము - ఇట్లు విషయవ్యవస్థ చేయుటవలన ఈవచనములకు పరస్పరవిరోధము లేదని యెఱుంగఁదగినది ॥ ౨౦

మూ. స్మృత్యోర్విరోధే న్యాయస్తు బలవాన్ వ్యవహారతః ॥ ౨౧ ॥

వ్యా॥ నను నిహ్నుతే లిఖితం నైకమితీయం స్మృతిస్తథానేకార్థాభియోగేపీతీయమపి స్మృతిరేవ - తత్రానయోస్స్మృత్యోః పరస్పరవిరోధే సతీతరేతరబాధనాదప్రామాణ్యం కస్మాన్న భవతి విషయవ్యవస్థా కిమిత్యాశ్రీయత ఇత్యత ఆహ ॥ స్మృత్యోరితి ॥ యత్ర స్మృత్యోః పరస్పరతో విరోధస్తత్ర విరోధపరిహారాయ విషయవ్యవస్థాపనాదావుత్సర్గాపవాదాదిలక్షణో న్యాయో బలవాన్ సమర్థః - న చ న్యాయః కుతః ప్రత్యేతవ్య ఇత్యత ఆహ - వ్యవహారత ఇతి - వ్యవహారాద్వృద్ధవ్యవహారాదన్వయవ్యతిరేకలక్షణాదవగమ్యతే - అతశ్చ ప్రకృతోదాహరణేఽపి విషయవ్యవస్థైవ యుక్తా - ఏవమన్యత్రాపి విషయవ్యవస్థా వికల్పాదియథాసంభవం యోజ్యం ॥ ౨౧

లబ్ధిర్భవతి - నధర్మశాస్త్రమనుసృతం భవతి-తథాన్యస్య జయేఽవధార్యమాణే ధర్మశాస్త్రమనుసృతం భవతి-మిత్రలబ్ధిర్విపరీతా. తత్రార్థశాస్త్రాద్ధర్మశాస్త్రం బలవదితి ఏవ-ధర్మార్థసన్నిపాతేఽర్థగ్రాహిణ ఏతదేవేతి ప్రాయశ్చిత్తస్య గురుత్వం దర్శితమాపస్తంబేన. ఏతచ్ఛబ్దేన ద్వాదశవార్షికం ప్రాయశ్చిత్తం పరామృశ్యతే॥ ౨౧

తా॥ ధర్మశాస్త్రానుసారముగా వ్యవహారములవిచారింపవలయునని చెప్పుటచేతనే ఔశనసాద్యర్థశాస్త్రానుసారముగా వ్యవహారములవిచారింపఁగూడదని యర్థమాచున్నది కాఁబట్టి యిచటధర్మశాస్త్రాంతర్గతమైన రాజనీతిప్రతిపాదకగ్రంథమె అర్థశాస్త్రమని చెప్పఁబడుచున్నది - ఇట్టి యర్థశాస్త్రమునకును ధర్మశాస్త్రమునకును పరస్పరవిరోధము సంభవించెనేని అర్థశాస్త్రమునకంటె ధర్మశాస్త్రము ప్రబలమైనదని శాస్త్రమర్యాదగనుక అర్థశాస్త్రమును పరిత్యజించి ధర్మశాస్త్రప్రకారముగానే వ్యవహారములవిచారింపవలయునని తాత్పర్యము - సమానకర్తృకములైన ధర్మశాస్త్రార్థశాస్త్రములకు స్వభావగతమైన భేదము లేకున్నప్పటికిని-ధర్మము ప్రధానమైనదనియు అర్థము అప్రధానమైనదనియు పతచ్ఛాస్త్రాదియందుఁదెలుపఁబడియుండుటవలన ప్రధానమైన ధర్మశాస్త్రంబునకును అప్రధానమైన యర్థశాస్త్రంబునకును విరోధము సంభవించినయెడల ధర్మశాస్త్రప్రకారముగానే కార్యనిశ్చయము సేయందగును గానివిషయవ్యవస్థావికల్పాదులు సేయఁగూడదని తెలియఁదగినది

అర్థశాస్త్రధర్మశాస్త్రములకు విరోధము గలిగనేని ధర్మశాస్త్రమె గ్రాహ్యంబగును.

ఉదాహరణము

——— దీనికి ఉదాహరణము॥ గురుం వా బాలవృద్ధౌ వా-అను నిత్యాదివచనములయందు-గురువునైన బాలవృద్ధులైనను బహుశ్రుతుఁడైన బ్రాహ్మణునైనను-తన్నుఁజంపఁదలఁచివచ్చుచున్నవానిఁ దానుజంపుటవలన దోషము లేదని చెప్పఁబడియున్నది - ఇది యర్థశాస్త్రము-ఇయంవిశుద్ధిరుదితా అనువచనమందు బుద్ధిపూర్వకముగా బ్రాహ్మణునిఁజంపిన మహాపాపికి ఆపాపము సంభవించితీగఁదగినదియె కాని ప్రాయశ్చిత్తము లేదని చెప్పఁబడియున్నది - ఇది ధర్మశాస్త్రము- ఈ రెంటికి పరస్పరవిరోధము గలుగుచున్నది కాఁబట్టి ధర్మశాస్త్రానుసారముగా బ్రాహ్మణునిఁజంపఁగూడదని నిశ్చయించుటయె యుక్తము - అయితే యీ యుదాహరణముందుఁ దెలియఁజేసిన వచనములకు విషయభేదము గలిగియుండుటవలన పరస్పరవిరోధము లేమి కాఁబట్టి యిచ్చట బలాబలవిచారంబావశ్యకంబుగాదు ——— ఆ విషయభేదంబెట్లనిన-ధర్మోపరోధకాలమందు అట్టి ధర్మమును సంరక్షించుటకై ద్విజులు ఆయుధమును ధరింపవలయునని యెను ప్రకరణమును ప్రారంభించి ఆత్మరక్షణమందును దక్షిణాదియజ్ఞోపకరణరక్షణమందును యుద్ధకాలమందును స్త్రీ బ్రాహ్మణులకు హింస సంభవించు కాలమందును ఆతతాయియైవచ్చిన వానిని విషదిగ్ధములగు శస్త్రములచేతఁ జంపినవాఁడు రాజశిక్షార్హుండుగాఁడని చెప్పి ఆయర్థమును దృఢపఱచుటకై యొకప్పుడును వధింపఁగూడని బ్రాహ్మణగురువృద్ధాదులైనను ఆతతాయులై వచ్చిరేని వారినిఁగూడఁ జంపవచ్చును ఇతరుల విషయమై చెప్పనేలయని తెలియఁజేయఁబడియె-ఇట్లు చెప్పినమాత్రమున నెగురు బ్రాహ్మణాదులకు వధ్యత్వప్రతీతి గలుగదు- అది యేమనిన-సుమంతువచనమందు ఆతతాయులలో గోబ్రాహ్మణులు దప్పతక్కిన వారినిఁ జంపుటచేత దోషము లేదని చెప్పఁబడియున్నది-ఆచార్యంచ ప్రవక్తారం- అనెడు మనువచనమునకును- ఆచార్యపితృమాతృగురుబ్రాహ్మణగోతాపసులు ఆతతాయులైయున్నను వారినిఁ జంపఁగూడదని తాత్పర్యం జెప్పఁడుచున్నది కాఁబట్టి- నాతతాయివధే దోషో హంతుర్భవతి కశ్చన - అనెడు వచనము బ్రాహ్మణాదివ్యతిరిక్తవిషయమె యని తెలియఁదగినది

ద్విజులు ఆయుధముధరించుట.

ఆతతాయి లక్షణము

——— ఇల్లుదగలఁబెట్టువాఁడును-విషము పెట్టువాఁడును - ఆయుధహస్తుఁడును-ధనాపహారియు-పరులభూమినపహరించువాఁడును-పరభార్యలనపహరించువాఁడును- మంత్రప్రయోగాదులచేత పరులఁజంపువాఁడును రాజునొద్దఁజేరి కొండెము సెప్పువాఁడును- భార్యను విక్రయించుకొనువాఁడును- రంధ్రాన్వేష

ణము సేయుచుండువాఁడును-వీరు మొదలుగాఁగలవారు ఆతతాయులనంబడుదురని సామాన్యముగాఁ జెప్పియుండుటవలన బ్రాహ్మణ గురుబాలవృద్ధాదులు ఈ చెప్పఁబడిన ప్రకారముగా ఆతతాయులై యుండిరేని అట్టివారిని చంపవలయును వేఱు యత్నము లేక ఆత్మసంరక్షణయజ్ఞోపకరణగతక్షణార్థమైయెవఁడైనను నివారింపుచుండఁగా అట్టికాలమందు ప్రమాదమువలననైనను ఆయుధాదులు దగిలి వారు మృతిఁబొందిరేని అట్టిమరణమునకు కారణభూతుండైనవానికి లఘుప్రాయశ్చిత్తమువలననే పారిశుద్ధ్యము గలుగుననియు రాజదండన లేదనియును- ఈ యుదాహరణమందున్న - గురుం వా బాలవృద్ధౌ వా- అనెడు వచనమునకు తాత్పర్యము గనుక ఇచ్చట పరస్పరవిరోధము లేదనియెఱుంగఁదగినది ——

మఱియొక యుదాహరణము.

హిరణ్యభూమిలాభేభ్యో మిత్రలబ్ధిర్వరాయతః. అను వచనమందు హిరణ్యభూలాభములకంటె మిత్రలాభము అధికమైనదిగనుక ఎవ్విధంబుననైన మిత్రలాభమునకు యత్నము చేయవలయునని చెప్పఁబడియున్నది - ఇది యర్థశాస్త్రము। ధర్మశాస్త్రానుసారేణ క్రోధలోభవివర్జితః. అను వచనమందు ధర్మశాస్త్రానుసారముగా శత్రువునందు క్రోధంబును మిత్రునియందు స్నేహంబును లేనివాఁడై వ్యవహారములవిచారింపవలయునని చెప్పఁబడియున్నది ఇది ధర్మశాస్త్రము - ఈ రెండు వచనములకును ఒకానొకచోట విరోధము గలుగుచున్నది-అదియెట్లనిన- ప్రతిజ్ఞాపాదోత్తరపాదక్రియాపాదసాధ్యసిద్ధిపాదముల నెడు నాలుగు పాదములు గల వ్యవహారము జరుగుచుండఁగా నొకనికి జయము గలుగఁ జేసినపక్షమందు మిత్రలాభంబును ధర్మశాస్త్రవిరోధంబును గలుగుచున్నది - మఱియొకనికి జయము గలుగఁ జేసినపక్షమందు మిత్రవిరోధంబును ధర్మశాస్త్రానుకూల్యంబును సంభవించుచున్నది - ఇట్టి పరస్పరవిరుద్ధస్థలమందు ధర్మశాస్త్రము నవలంబించవలయుఁగాని అర్థశాస్త్రము నవలంబించఁగూడదు —— గౌతమసూత్రమందు అర్థశాస్త్రము ననుసరించి వ్యవహారవిచారణ చేసినవానికి మహాపాతకులకుఁ జెప్పియున్న ద్వాదశవార్షిక ప్రాయశ్చిత్తము చెప్పఁబడియున్నది కాఁబట్టి అర్థశాస్త్ర ధర్మశాస్త్రములకు విరోధము గలిగినప్పుడు ధర్మశాస్త్రము నే గ్రహింపవలయునని తాత్పర్యము. ౨౧

అర్థశాస్త్రానుసారముగా తీర్పు చేసిన యధికారికి ప్రాయశ్చిత్తము.

మూ. ప్రమాణం లిఖితం భుక్తిస్సాక్షిణశ్చేతి కీర్తితమ్। ఏషా
మన్యతమాభావే దివ్యాన్యతమముచ్యతే॥ ౨౨ ॥

వ్యా॥ తతోఽర్థీ లేఖయేత్సద్యః ప్రతిజ్ఞాతార్థసాధనమిత్యుక్తం కిం తత్సాధనమిత్యపేక్షిత ఆహ॥ ప్రమాణమితి॥ ప్రమీయతే పరిచ్ఛిద్యతే నేనేతి ప్రమాణం-తచ్చ ద్వివిధం - మానుషం దైవికం చేతి-తత్ర మానుషం ప్రమాణం త్రివిధం-లిఖితం భుక్తిస్సాక్షిణశ్చేతి-కీర్తితం మహర్షిభిః-తత్ర లిఖితం ద్వివిధం - శాసనం జానపదం చేతి-శాసనముక్తలక్షణం-జానపదం తు వక్ష్యమాణలక్షణం- భుక్తిరుపభోగస్సాక్షిణో వక్ష్యమాణస్వరూపప్రకారాః - నను లిఖితస్య సాక్షిణాం చ శబ్దాభివ్యక్తిద్వారేణ శబ్దాంతర్భావాద్యుక్తం ప్రామాణ్యం- భుక్తేస్తు కథం ప్రామాణ్యం-ఉచ్యతే-భుక్తిరపి కైశ్చిద్విశేషణైర్యుక్తా స్వత్వహేతుభూతక్రయాదికమవ్యభిచారాదనుమాపయంతీ అనుపపద్యమానా వా కల్పయంతీత్యనుమానేఽర్థాపత్తావాంతర్భవతీతి ప్రమాణమేవ- ఏషాం లిఖితాదీనాం త్రయాణామన్యతమస్యాభావే దివ్యానాం వక్ష్యమాణస్వరూపభేదానామన్యతమం జాతిదేశకాలద్రవ్యాద్యపేక్షయా ప్రమాణముచ్యతే-మానుషాభావ ఏవ దివ్యస్య ప్రామాణ్యమస్మాదేవ వచనాదవగమ్యతే- దివ్యస్య స్వరూపప్రామాణ్యయోరాగమగమ్యత్వాత్ -అతశ్చ యత్ర పరస్పరం వివదతోర్ద్వయోరపి ధర్మాధికారిణం ప్రాప్తయోరేకో మానుషీం క్రియాం బ్రూయాదపరస్తు దైవీం క్రియామవలంబతే-తత్ర మానుష్యేవ గ్రాహ్యా-తథా చ కాత్యాయనః॥ యద్యేకో మానుషీం బ్రూయాదన్యో బ్రూయాత్తు దైవికీం। మానుషీం తత్ర గృహ్ణీయాన్న తు దైవీం క్రియాం నృప ఇతి। యత్రాపి ప్రథాసైకదేశసాధనం మానుషం సంభవతి - తత్రాపి న దైవమాశ్రయణీయం- యథా-రూపకశతమనయా వృద్ధ్యా గృహీత్వాయం న ప్రయచ్ఛతీత్యభియోగాపహ్నవే గ్రహణే సాక్షిణస్సంతి నో సంఖ్యాయాం వృద్ధివిశేషే వా- అతో దివ్యేన భావయామీతి తు ఏకదేశవిభావితన్యాయేనాపి సంఖ్యావృద్ధివిశేషసిద్ధేర్న దివ్యస్యావకాశః - ఉక్తం చ కాత్యాయనేన। యద్యేకదేశవ్యాప్తాపి క్రియా విద్యేత మానుషీ।సా గ్రాహ్యా న తు పూర్ణాపి దైవీ వివదతాం నృణామితి-యత్తు గూఢసాహసికానాం తు ప్రాప్తం దివ్యైః పరీక్షణమితి తదపి మానుషాసంభవకృతనియమార్థం- యదపి నా

రశేనోక్తం । అరణ్యే నిర్జనే రాత్రావంతర్వేశ్మని సాహసే । న్యాసస్యాపహ్నవే చైవ దివ్యా సంభవతి క్రియేతి । తదపి మానుషాసంభవ ఏవ-
తస్మాన్మానుషాభావ ఏవ దివ్యేన నిర్ణయ ఇత్యౌత్సర్గికం-తస్య చాపవాదో దృశ్యతే ॥ ప్రక్రాంతే సాహసే వాదే పారుష్యే దండవాచికే । బ
లోద్భవేషు కార్యేషు సాక్షిణో దివ్యమేవ చేతి - తథా లేఖ్యాదీనాం అపి క్వచిన్నియమో దృశ్యతే-యథా । పూగశ్రేణిగణాదీనాం యా స్థి
తిః పరికీర్తితా । తస్యాస్తు సాధనం లేఖ్యం న దివ్యం న చ సాక్షిణః । తథా । ద్వారమార్గక్రియాభోగ జలవాహాదిషు క్రియా । భుక్తిరేవ తు గు
ర్వీ స్యాన్న దివ్యం న చ సాక్షిణః । తథా ॥ దత్తాదత్తేష్వభృత్యానాం స్వామినాం నిర్ణయే సతి । విక్రయాదాన సంబంధే క్రీత్వా ధనమని
చ్ఛతి । ద్యూతే సమాహ్వయే చైవ వివాదే సముపస్థితే । సాక్షిణః సాధనం ప్రోక్తం న దివ్యం న చ లేఖ్యకమితి ॥ ౨౨

తా॥ సప్తమ శ్లోకమందు సాధింపఁదగిన యర్థమునకు సాధనముల వ్రాయించవలయునని చెప్పఁబడెనుగదా-ఆసాధనభేదంబులు దెలియఁజేయఁబడుచున్నవి ॥ ప్రమాణమనఁగా వస్తుతత్వంబిట్టిదని తెలియఁజే

లిఖిత సాక్ష్యాదిసాధనములు.

యునట్టి సాధనము-ఆ ప్రమాణమునకు-మానుషము దైవికము అని రెండు భేదములుగలవు- అందు మానుష ప్రమాణము-లిఖితము-భుక్తి-సాక్షులు-అని మూఁడువిధములుగా ఋషులచే విభజింపఁబడియున్నది-అందు లిఖితమునకు- శాసనము జానపదము అని రెండు భేదములుగలవు-శాసనలక్షణము పూర్వకాండమునందు ౩౧౮వ-శ్లోకంబునఁ జెప్పఁబడియున్నది - జానపదలక్షణము ఈకాండమందె ౮౪ మొదలుగాఁగల శ్లోకములయందుఁ జెప్పఁబడును-భుక్తియనఁగా అనుభవము- సాక్షిలక్షణము ౬౮ మొదలుగాఁగల శ్లోకములయందుఁ జెప్పఁబడును. ఈలిఖిత భుక్తి సాక్షులనెడు మానుష ప్రమాణములలో నొకటియైనను లేకుండెనేని ౯౫ మొదలుగాఁగల శ్లోకములయందుఁ జెప్పఁబడెడు దివ్యప్రమాణములలో నొక ప్రమాణమును జాతిదేశకాలద్రవ్యాద్యనుగుణముగా గ్రహింపవలయుఁగాని మానుష ప్రమాణంబులైన లిఖితాదులుండునపుడు దివ్యప్రమాణంబును గ్ర

లిఖితాదులుండఁగా దివ్యప్రమాణము గ్రాహ్యంబుగాదు.

హింపఁగూడదు-కాఁబట్టి యేకకాలమందు ఇద్దరు వివాదపడుచు ధర్మాధికారియొద్దకు వచ్చి యొకఁడు నావాదమునకు లిఖితాది మానుష ప్రమాణములున్నవనియు మఱియొకఁడు దివ్యప్రమాణముఁజేసెదననియుఁ జెప్పుకొన్నయెడల ధర్మాధికారి మానుష ప్రమాణములగు లిఖితాదుల నే యంగీకరింపవలయుఁగాని దివ్యప్రమాణము నంగీకరింపఁగూడదు-ఒక వ్యవహారమునందే కొంతకు లిఖితాది ప్రమాణములుండి కొంతకు లేకున్నప్పటికిని దివ్యప్రమాణమావశ్యకము గాదు-అది యేమన్నను-రూ౧౦౦ఇంతవడ్డికిఁదీసుకొన్నాఁడనెడు వాదమందు ప్రతివాది నేను రూపాయలు దీసుకొనలేదని యుత్తరమిచ్చినయెడల నితఁడు రూపాయలు దీసుకొన్న దానికి సాక్షులున్నారు ఆరూపాయల సంఖ్యకును వడ్డికిని సాక్షులు లేరు గనుక దివ్య ప్రమాణము చేసెదనని వాది చెప్పెనేని అట్టి వ్యవహారమందును [౧౦౨] శ్లోకమందుఁ జెప్పియున్న ప్రకారముగా రూపాయలు దీసుకొన్నవిషయమును సాక్షులవల్ల స్థిరపఱచుకొని ఆవాద ద్రవ్యము వడ్డితోఁగూడ వాదికి ఇచ్చునట్లు తీరుమానించవచ్చునుగనుక దివ్య ప్రమాణంబునకిచ్చట నవకాశము లేదు- ఇట్లు కాత్యాయనులచేఁ జెప్పఁబడియున్నది ॥ వ్యాఖ్యానమందున్న నారదాదివచనములకును మానుష ప్రమాణము లేని వ్యవహారమును తోసివేయక దివ్య ప్రమాణము వల్ల పరిష్కరింపవలయునని తాత్పర్యము గనుక విరోధము లేదు ॥ అయితే విషము పెట్టుట నట్టుట కొట్టుట తిట్టుట మొదలుగాఁగల

దివ్యప్రమాణవివాదములు

వ్యవహారములయందును బలజనిత వ్యవహారములయందును మానుష ప్రమాణములున్నప్పటికిని దివ్యప్రమాణమే గ్రాహ్యంబగును ॥ ఇట్లు లిఖితాదులకును కొన్ని వివాదములయందు నియమము

లిఖితప్రమాణవివాదములు.

గలదు - అది యెట్లనిన-వర్తకులు శిల్పులు మొదలుగాఁగలవారు సమాజముగాఁజేరి యేర్పఱచుకొనెడు సంకేతమునకు లిఖిత ప్రమాణమే ముఖ్యముగాని దివ్యసాక్ష్యాది ప్రమాణములు ము

అనుభవప్రమాణవివాదములు.

ఖ్యములుగావు ॥ గృహాదిద్వారములు మార్గములు ఉత్సవాదికార్యములు నీటి కాలువలు-ఇత్యాదివిషయములైన వ్యవహారములయందు అనుభవమే ముఖ్యముగాని దివ్యసాక్ష్యాదులు ముఖ్యం

సాక్షిప్రమాణవివాదములు.

బులుగావు ॥ వేతనాదానవివాదమందును-స్వామిపాలవివాదమందును క్రయవిక్రయానుశయవివాదమందును ద్యూత ప్రాణిద్యూత వివాదములయందును సాక్షులే ముఖ్యులౌదురుగాని దివ్యప్రమాణ లిఖితాదులు ముఖ్యంబులు గావని తాత్పర్యము, ౨౨

మూ॥ సర్వేష్వర్థవివాదేషు బలవత్యుత్తరా క్రియా ॥ ౨౨ ॥

వ్యా ॥ ఉభయత్ర ప్రమాణసద్భావే ప్రమాణగతబలాబలవివేకే చాసతి పూర్వాపరయోః కార్యయోః కస్య బలీయస్త్వమిత్యత ఆహ ॥ సర్వేష్వితి ॥ ఋణాదికేషు సర్వేష్వర్థవివాదేషూత్తరా క్రియా - క్రియత ఇతి క్రియా కార్యం బలవతీ - ఉత్తరకార్యే సాధితే తద్వాదీ విజయీ భవేత్పూర్వకార్యే సిద్ధేపి తద్వాదీ పరాజీయతే - తద్యథా - కశ్చిద్గ్రహణేన ధారణం సాధయతి - కశ్చిత్ప్రతిదానేనాధారణం - తత్ర గ్రహణప్రతిదానయోః ప్రమాణసిద్ధయోః ప్రతిదానం బలవదితి ప్రతిదానవాదీ జయతి - తథా పూర్వం ద్వికశతం గృహీత్వా కాలాంతరే త్రికం శతమంగీకృతవాన్ తత్రోభయతః ప్రమాణసద్భావేపి త్రికశతగ్రహణం బలవత్పశ్చాద్భావిత్వాత్పూర్వబాధేనానుపపత్తేః - ఉక్తం చ । పూర్వాబాధేన నోత్పత్తిరుత్తరస్య హి సేత్స్యతీతి ॥ ౨౨

తా ॥ వాదిప్రతివాదులకిద్దఱికిని సాక్ష్యాదిసాధనములు సమానములై యుండెనేని అంత పూర్వోత్తరకార్యములలో నేది బలవత్తరంబగుననిన - ఋణాదికములైన అర్థవ్యవహారములయందు - ఉత్తరకార్యము - అనఁగా వెనుక జరిగిన కార్యము బలవత్తరంబగును గనుక ఆ యుత్తరకార్యవాదియే జయమును బొందుననియు పూర్వకార్యము ప్రమాణసిద్ధమై యున్నప్పటికిని ఆ వాది పరాజయమును బొందుననియును తాత్పర్యము ॥ ఉదాహరణము ॥ ఒకఁడు వీనికి అప్పిచ్చియున్నానని సాక్ష్యాదిసాధనముల చే సాధింపుచుండగా ఆ ప్రతివాది తిరుగా చెల్లించితినని సాధనముల చేత సాధించెనేని ఈ రెండు కార్యములలో తిరుగా చెల్లించుట బలవత్తరమైనదిగనుక ఆ ప్రతివాదికి జయము గలుగును గాని వాదికి జయము గలుగఁజాలదు ॥ ౨ ఉదాహరణము ॥ ఒకఁడు మొదట రూ ౧౦౦ తీసుకొన్నదానికి సాధనములున్నవి - పిమ్మట రూ ౩౦౦ తీసుకొన్నట్టుగా ఒప్పుకొన్నదానికిని సాధనములున్నవి - ఇట్లుండెనేని వెనుక ఒప్పుకొనఁబడిన మున్నూఱురూపాయల మొత్తమే స్థిరపడును గాని మొదటి యినూఱురూపాయల మొత్తము స్థిరపడదు. ౨౨

అర్థవివాదమందుత్తరకార్యము బలవత్తరంబగు.

అస్యాపవాదమాహ. మూ. ఆధౌ ప్రతిగ్రహే క్రీతే పూర్వా తు బలవత్తరా ॥ ౨౩ ॥

వ్యా ॥ ఆధావితి ॥ ఆధ్యాదిషు త్రిషు పూర్వమేవ కార్యం బలవత్ - తద్యథా - ఏకమేవ క్షేత్రమేకస్మాద్ధనం కృత్వా కస్మిచిదాధీకృత్య పునరన్యస్యాప్యాధాయ కిమపి గృహ్ణాతి - తత్ర పూర్వస్యైవ తద్భవతి నోత్తరస్య - ఏవం ప్రతిగ్రహే క్రయే చ - న హ్యాహితస్య తదానీమస్వత్వాత్పునరాధానమేవ న సంభవతి - ఏవం దత్తస్య క్రీతస్య చ దానక్రయావపి న యుజ్యేతే - తస్మాదిదం వచనమనర్థకం - ఉచ్యతే - అస్వత్వేపి యది మోహాత్కశ్చిల్లోభాద్వా పునరాధానాదికం కరోతి తత్ర పూర్వం బలవదితి న్యాయపూర్వకమేవేదం వచనమిత్యదోషః ॥ ౨౩

తా ॥ కుదవ - ప్రతిగ్రహము - కొనుగోలు - ఈ విషయములయందు మొదట జరిగింపఁబడిన కార్యమే బలవత్తరంబగును ॥ ఉదాహరణము ॥ ఒకఁడు తన భూమిగృహాదుల నొకనికి కుదవ యుంచి వానియొద్దనే మైనను దీసుకొని తిరుగా ఆ భూమిగృహాదుల నే లోభమోహాదుల వలననైన వేఱొకనికిఁ గుదవ యుంచిన పక్షమందు వారిలో మొదట కుదవ యుంచుకొన్న వానికి యెవ్వఁడీరెఱువటకు ఆ భూమిగృహాదుల యందు వానికే స్వాతంత్ర్యము గలిగియుండును గాని వెనుక కుదవ యుంచుకొన్న వానికి స్వాతంత్ర్యము గలిగి యుండదు - ఈ రీతిగానే ప్రతిగ్రహక్రయవిషయములయందు నూహించునది.

కుదవ మొదలైన కొన్ని వివాదములయందు పూర్వకార్యమే బలవత్తరంబగును.

మూ. {పశ్యతోఽబ్రువతో హానిర్భూమేర్వింశతివార్షికీ ।
పరేణ భుజ్యమానాయా ధనస్య దశవార్షికీ ॥ ౨౪ ॥}

వ్యా ॥ భుక్తేః కైశ్చిద్విశేషణైర్యుక్తాయాః ప్రామాణ్యం దర్శయిష్యన్ కస్యాశ్చిద్భుక్తేః కార్యాంతరమాహ ॥ పశ్యత ఇతి ॥ స్వత్వేనాసంబద్ధేన భుజ్యమానాం భువం ధనం వా - పశ్యతః - అబ్రువతః - ఇదం మదీయం భూమిస్త్వయా న భోక్తవ్యేత్యప్రతిషేధతస్స్వామినో భూమేర్వింశతివార్షికీ అప్రతిరవవింశతివర్షోపభోగనిమిత్తా హానిర్భవతి - ధనస్య తు హస్త్యశ్వాదేర్దశవార్షికీ హానిః - న స్వత్వేనోపభుక్తస్య తస్య హ్యప్రతిషేధాత్స్వత్వమపగచ్ఛతి - అప్రతిషేధస్య దానవిక్రయాదివత్స్వత్వనివృత్తిహేతుత్వస్య లోకశాస్త్రయోరప్రసిద్ధత్వాత్

సాపి వింశతివర్షోపభోగాత్స్వత్వం - ఉపభోగస్య స్వత్వే ఽప్రమాణత్వాత్ ప్రమాణస్య చ ప్రమేయం ప్రత్యనుత్పాదకత్వాత్ - రిక్థక్రయాదిషు స్వత్వకారకహేతుష్వపాఠాచ్చ. తథా హి - స్వామీ రిక్థక్రయసంవిభాగపరిగ్రహాధిగమేషు బ్రాహ్మణస్యాధికం లబ్ధం క్షత్రియస్య విజితం నిర్విష్టం వైశ్యశూద్రయోరిత్యష్టావేవ స్వత్వకారకహేతూన్ గౌతమః పఠతి - న భోగం - న చేదమేవ వచనం వింశతివర్షోపభోగస్య స్వత్వావాప్తిహేతుత్వం ప్రతిపాదయతీతి యుక్తం - స్వత్వస్య స్వత్వహేతూనాం చ లోకప్రసిద్ధత్వేన శాస్త్రైకసమధిగమ్యత్వాభావాత్ - ఏతచ్చ విభాగప్రకరణే నిపుణతరముపపాదయిష్యతే - గౌతమవచనం తు నియమార్థం॥ అనాగమం తు యో భుంక్తే బహూన్యబ్దశతాన్యపి। చోరదండేన తం పాపం దండయేత్పృథివీపతిరిత్యేతద్వ్యనాగమోపభోగస్య స్వత్వహేతుత్వే విరుధ్యతే - న చానాగమం తు యో భుంక్త ఇత్యేతత్పరోక్షభోగవిషయం - పశ్యతోఽబ్రువత ఇతి ప్రత్యక్షవిషయమితి యుక్తం వక్తుం - అనాగమం తు యో భుంక్త ఇత్యవిశేషాభిధానాత్ నోపభోగే బలం కార్యమాహర్తా తత్సుతేన వా। పశుస్త్రీపురుషాదీనామితి ధర్మ్యో వ్యవస్థిత ఇతి కాత్యాయనవచనాచ్చ - న చ భోగే సతి నిరాకరణాభావేన హానేరసంభవాత్ - న చైతన్మంతవ్యం - అధిప్రతిగ్రహక్రయేషు పూర్వస్యాః క్రియాయాః ప్రాబల్యాపవాదేన భూమివిషయే వింశతివర్షోపభోగయుక్తాయాః ధనవిషయే దశవర్షోపభోగయుక్తాయా ఉత్తరస్యాః క్రియాయాః ప్రాబల్యమనేనోచ్యత ఇతి యతస్తేషూత్తరైవ క్రియా తత్త్వతో నోపపద్యతే - స్వీయమేవ హ్యాధేయం దేయం విక్రేయం చ భవతి - న చాహితస్య దత్తస్య విక్రీతస్య వా స్వత్వమస్తి - అస్వస్య దానే ప్రతిగ్రహే చ దండః స్మర్యతే॥ అదేయం యశ్చ గృహ్ణాతి యశ్చాదేయం ప్రయచ్ఛతి। ఉభౌ తౌ చోరవచ్ఛాస్యౌ దాప్యౌ చోత్తమసాహసమితి। తథాధ్యాదీనాం త్రయాణామపవాదత్వే ఽస్య శ్లోకస్యాధిసీమాదీనాముత్తరశ్లోకే ఽపవాదో నోపపద్యతే - తస్మాద్వ్యాఖ్యాదీనాం హానిర్న సువచనైవ॥ నాపి వ్యవహారహానిః - యథా॥ ఉపేక్షాం కుర్వతస్తస్య తూష్ణీంభూతస్య తిష్ఠతః। కాలే విపన్నే పూర్వోక్తే వ్యవహారో న సిధ్యతీతి నారదేనోపేక్షాలింగాభావకృతా వ్యవహారహానిరుక్తా న తు వస్త్వభావకృతా - తథా మనునాపి॥ అజడశ్చేదపోగండో విషయే చాస్య భుజ్యతే। భగ్నం తద్వ్యవహారేణ భోక్తా తద్ద్రవ్యమర్హతీతి వ్యవహారతో భంగో దర్శితో న వస్తుతో వ్యవహారభంగశ్చైవం భోక్తా కిల వదతి - అజడో ఽపోగండో ఽబాలో ఽస్య సన్నిధౌ వింశతివర్షాణ్యప్రతిరవం మయా భుక్తం తత్ర బహవస్సాక్షిణస్సంతి - యద్యస్య స్వమన్యాయేన మయా భుజ్యతే తదాయం కిమిత్యేతావంతం కాలముదాస్త ఇతి తత్రాయం నిరుత్తరో భవతి - ఏవం నిరుత్తరస్యాపి వాస్తవో వ్యవహారో భవత్యేవ॥ ఫలం నిరస్యతే భోక్తుర్వ్యవహారాన్నయేన వా ఇతి నియమాత్। అథ మతం యద్యపి న వస్తుహానిర్నాపి వ్యవహారహానిస్తథాపి పశ్యతోఽప్రతిషేధతో వ్యవహారహానిశంకా భవతీతి తన్నివృత్తయే తూష్ణీం న స్థాతవ్యమిత్యుపదిశ్యత ఇతి - తచ్చ న - స్మార్తకాలాయాం భుక్తౌ హానిశంకాకారణత్వాభావాత్తూష్ణీం న స్థాతవ్యమిత్యేతావన్మాత్రాభిధిత్సాయాం వింశతిగ్రహణమవివక్షితం స్యాత్ - అథోచ్యతే వింశతిగ్రహణమూర్ధ్వం పత్రదోషోద్భావననిరాకరణార్థం - యథాహ కాత్యాయనః। శక్తస్య సన్నిధావర్థో యేన లేఖ్యేన భుజ్యతే। వింశద్వర్షాణ్యతిక్రాంతం తత్పత్రం దోషవర్జితమితి। తదపి న - ఆధ్యాదిష్వపి వింశతేరూర్ధ్వం పత్రదోషోద్భావననిరాకరణస్య సమత్వేనాపవాదాసంభవాత్ - యథాహ కాత్యాయనః॥ యేన వింశతివర్షాణి అధిర్భుక్తస్సునిశ్చితః। తేన లేఖ్యేన తత్సిద్ధిర్లేఖ్యం దోషవివర్జితం॥ తథా॥ సీమావివాదే నిర్ణీతే సీమాపత్రం విధీయతే। తస్య దోషాః ప్రవక్తవ్యా యావద్వర్షాణి వింశతిరితి - ఏతేన ధనస్య దశవార్షికీత్యేతదపి ప్రత్యుక్తం - తస్మాదస్య శ్లోకస్యాన్యోఽర్థో వక్తవ్యః - ఉచ్యతే - భూమేర్ధనస్య చ ఫలహానిరిహ వివక్షితా న వస్తుహానిర్నాపి వ్యవహారహానిః - తథా హి - నిరాక్రోశం వింశతివర్షోపభోగాదూర్ధ్వం యద్యపి స్వామ్యాన్యాయతః క్షేత్రం లభతే - తథాపి ఫలానుసరణం న లభతే - అప్రతిషేధలక్షణాత్స్వాపరాధాదస్మాచ్చ వచనాత్ - పరోక్షభోగే తు వింశతేరూర్ధ్వమపి ఫలానుసరణం లభత ఏవ - పశ్యత ఇతి వచనాత్ - ప్రత్యక్షభోగే చ సాక్రోశే అబ్రువత ఇతి వచనాత్ - వింశతేః ప్రాక్ప్రత్యక్షే నిరాక్రోశే చ లభతే వింశతిగ్రహణాత్ - నను తదుత్పన్నస్యాపి ఫలస్య స్వత్వాత్తద్ధానిరనుపపన్నైవ - బాఢం - తస్య స్వరూపాదినాశేన తద్వైవావస్థానాత్ - యథా తదుత్పన్నపూగపనసవృక్షాదీనాం యత్పునస్తదుత్పన్నముపభోగాన్నష్టం తత్ర స్వరూపనాశాదేవ స్వత్వనాశః॥ అనాగమం తు యో భుంక్తే బహూన్యబ్దశతాన్యపి। చోరదండేన తం పాపం దండయేత్పృథివీపతిరిత్యనేన వచనేన నిష్క్రయరూపేణ గణయిత్వా చోరవత్తస్య ప్రవృద్ధాశనం ప్రాప్తం హానిర్వింశతివార్షికీత్యనేనాపోద్యతే - రాజదండః పునరస్త్యేవ వింశతేరూర్ధ్వమపి - అనాగమోపభోగాదపవాదాభావాచ్చ - తస్మాత్స్వయముపేక్షాలక్షణస్వాపరాధాదస్మాచ్చ వచనాద్వింశతేరూర్ధ్వం నష్టం ఫలం న లభత ఇతి స్థితం - ఏతేన ధనస్య దశవార్షికీత్యేతదపి వ్యాఖ్యాతం॥ ౨౪

తా॥ కొన్ని విశేషణములతోఁ గూడిన అనుభవమునకు ప్రామాణ్యమును దెలియఁజేయఁదలంచి యొకానొక యనుభవమునకు ప్రయోజనాంతరమును జెప్పెడువిధం బెట్లనిన - ఒకని భూమి నిమఱియొకఁడనుభవించుచుండఁగా ఆభూమిగలవాఁడు సమీపమందుండియు ౨౦ సంవత్సరములవరకు నిషేధింపక చూచు

భుక్తిప్రామా

న్యాయిదేవనముం దుపూర్వపక్షార్థము.

చుండెనేని అట్టిభూమియందు ఆయజమానునికి స్వాతంత్ర్యహానిసంభవించుననియు - ధనమునేనం గాగజాశ్వపశ్వాదులను తదధిపతిసమక్షమందు నిరాపేక్షముగా పదిసంవత్సరములుపరుండనను భవించెనేని ఆగజాశ్వాదులయందును యజమానునికిస్వాతంత్ర్యహానిసంభవించుననియును తాత్పర్యము- అయితే యీతాత్పర్యము పూర్వపక్షముపుచున్నది - అదియెట్లనిన- తనసొమ్మును పఱియొకండనుభవింపుచుండంగాని షేధింపక చూచుచుండుట స్వత్వనివృత్తికి కారణంబుగాదు - గౌతమునిచేఁ జెప్పంబడియున్న క్రయవిభాగాద్యష్టవిధస్వత్వకారణములలో అనుభవంబొకకారణంబని చెప్పంబడియుండలేదు . ఇదియునుంగాక స్వత్వంబును స్వత్వకారణంబును లోకప్రసిద్ధంబులైనవి కానిశాస్త్రైకగమ్యంబులుగావుగనుక ఈయాజ్ఞవల్క్యవచనమే ౨౦ సంవత్సరములయనుభవమునకు స్వత్వకారణత్వమును ప్రతిపాదింపుచున్నదనియును జెప్పంగూడదు - గౌతమవచనమైతేనియమార్థము-మఱియును స్వత్వవిషయము విభాగప్రకరణమందు లెస్సగాఁ దెలియఁ

స్వత్వము లేనిసొమ్మునను భవించిచిన వానికి శిక్ష.

జేయఁబడును ॥ ఇదియునుంగాక స్వత్వహేతుభూతప్రతిగ్రహక్రయాదిసంబంధము లేనివస్తువునుఅనేకశతసంవత్సరములనుభవించినప్పటికిని అట్టిపరాగమద్రవ్యమునననుభవించినవాని చోరునిశిక్షించినట్లు ప్రభువుశిక్షింపవలయుననిస్మృత్యంతరమందుఁ జెప్పఁబడియుండుటవలన కేవలానుభవము స్వత్వమునకు కారణంబుగాదనినిశ్చయము ॥ ఓయి ఆధిప్రతిగ్రహక్రయములయందు పూర్వకార్యముబలవత్తరమైనదని పూర్వశ్లోకమందుఁ జెప్పఁబడియున్నదిగనుక ఆయర్థమునకు అపవాదముగానీశ్లోకమందు ఆధిప్రతిగ్రహక్రయములకును ౨౦ సంవత్సరములనుభవము జరిగెనేనిఉత్తరకార్యమే బలవత్తరంబగునని చెప్పంబడెననితలంచఁగూడదాయనిన- అట్లుతలంపఁగూడదు- ఆధియనఁగాకుదవ - ఈయాధి ప్రతిగ్రహక్రయములొకసారి జరిగించినప్పుడే వీనిస్వత్వముతప్పిపోవుచున్నదిగనుక తిరుగామఱియొకనికి జరిగించుటకధికారమే లేదు

అస్వాధీనవస్తుదాతకును తత్ప్రతిగ్రహీతకును శిక్ష.

అదియేలయనిన- తనకుస్వత్వము లేనివస్తువును మఱియొకనికిచ్చినవాఁడును అట్టివస్తువును దీసుకొన్నవాఁడును చోరులవలె రాజశిక్షార్హులగుదురనిస్మృత్యంతరమందుఁ జెప్పఁబడియున్నది- కాఁబట్టి ఆధిప్రతిగ్రహక్రయములవిషయమందొకప్పుడును ఉత్తరకార్యప్రాబల్యము సంభవించదు గనుక ౨౦ సంవత్సరములుపరుండనుభవించినమాత్రముననే ఆభూమియందు యజమానునికి స్వాతంత్ర్యహానిగలుగుననుట యుక్తముగాదు ॥ వ్యవహారహానిగలుగుననియును జెప్పఁగూడదు- అదియేమనిన

౨౦ పర్లుపరుండనుభవించినభూమియందుతత్స్వామికి వ్యవహారహానియు లేదనుట.

వ్యాఖ్యానమందున్నారదవచనమునకుడుపే త్రొలింగాభావకృతమైనవ్యవహారహానిగలుగునని తాత్పర్యముగానివస్త్వభావకృతమైనవ్యవహారహానిగలుగునని తాత్పర్యముగాదు- మనువచనమునకువ్యవహారమార్గంబువలన కార్యమునకుభంగముగలుగునని తాత్పర్యముగాని వ్యవహారమునకేభంగముగలుగునని తాత్పర్యముగాదుగనుక వ్యవహారహానియును లేదు- అదియెట్లనిన- జడుండును బాలుండును గాకయుండెడువీని ప్రత్యక్షమందు ఇరువదేండ్లనుంచి నిరాక్షేపముగానే నీభూమిననుభవింపుచున్నానని నటకుఅనేకులుసాక్షులున్నారు- నేనుఅన్యాయముగావీనిభూమిననుభవింపుచున్నయెడల ఇన్ని సంవత్సరములు వీఁడేలయూరకుండెనని ఆభూమిననుభవింపుచున్నవాఁడు చెప్పుచుండఁగా- ఆభూమిగలవాఁడు సరియైన యుత్తరము చెప్పఁజాలక నిరుత్తరుఁడైయున్నప్పటికిని ( ఫలంనవస్యభూతేన ) అనెడు వచనానుసారముగా ప్రభువు ఛలోక్తులఁగొట్టివేసి సామదానాద్యుపాయములచేత వాస్తవార్థము నెఱింగి వ్యవహారము నుజరిగింపవలయుగనుక వ్యవహారహాని లేదు ॥ ఈరీతిగా వ్యాఖ్యానమందు మఱికొన్ని పూర్వపక్షసిద్ధాంతోక్తులచేత ఇరువదిసంవత్సరములుపరుండనుభవించినమాత్రముననే ద్రవ్యస్వామికి ఆద్రవ్యహానియు

భూమిని ౨౦ పర్లును రథగజాదులను ౧౦ పర్లు

ఆద్రవ్యమును గురించినవ్యవహారహానియుఁగలుగదని నిర్ణయించి యీశ్లోకమునకు గతఫలహానిగలుగునని సిద్ధాంతార్థము దెలియఁజేయఁబడుచున్నది- అదియెట్లనిన - ఇరువదిసంవత్సరములు యజ

ల్లను తత్స్వామిసమక్షంబుననిరాక్షేపముగాపరుండనుభవించిన నన్యాయమార్గంబున నభూమ్యాదులు తత్స్వామికిఁజేరనుగా నిగతఫలంబులుచేరవ నసిద్ధాంతార్థము.

మానువిసమక్షమందునిరాక్షేపముగాపరుండనుభవించినభూమిని న్యాయమార్గంబున ఆభూమిగలవాఁడుపొందెనేని - పూర్వముతానుదగ్గిరనుండిఆక్షేపించకయుపేక్షించిపే క్షింపుచున్నదోషమువలనగతించిన ఫలములనుఆభూమిగలవాఁడుపొందఁజాలఁడు - వాఁడుదేశాంతరగతుండైయుండఁగావానిభూమినిరాక్షేపముగా ౨౦ సంవత్సరములుపరుండనుభవించినను-సమీపమందుండిఆక్షేపించుచుండగా-౨౦ సంవత్సరములుపరుండనుభవించినను-సమీపమందుండి ఆక్షేపించకయుపేక్షించియుండగా-౨౦ సంవత్సరములకుతక్కువగాపరుండనుభవించినను-గతఫలంబులునుఆభూమిగలవానికేచేరును॥అయితే-(అవాగ్మంతు రేవాభుక్తేః) అనెడువచన ప్రకారముగాప్రతిగ్రహక్రయాది స్వత్వహేతువులులేకఅనేకసంవత్సరములుపరుండనుభవించినఫలములకుక్రయంబేర్పరచిఆమొత్తమును చోరునివల్లరాఁబట్టినట్లురాఁబట్టిఆద్రవ్యస్వామికిభూపాలుండిప్పించవలయునని నెడునియమము(పోనిర్వింశతివార్షికీ)అనునీవచనమువల్లఅపవాదింపఁబడుచున్నదిగనుక - పరుండుతనభూమిననుభవింపుచుండఁగాసమీపమందుండియిరువదేండ్లవఱకుఆక్షేపించకయుపేక్షించియుండెననెడుదోషమువలనగతఫలములుయజమానునికిఁజేరవుగానిపరులసొమ్మునన్యాయముగాఅనుభవించినవానికిరాజదండనముగలుగకపోదనిముఖ్యతాత్పర్యము-ఈరీతిగానేరథగజాశ్వాదిధనవిషయమందు పదిసంవత్సరములుపరుండనుభవించుటవలనతత్స్వామికిగతఫలహానిసంభవించుననునిత్యాదివిషయములూహింపఁదగినవి

మూ॥ ఆధిః సీమోపనిక్షేపజడబాలధనైర్వినా । తథో<br>పనిధిరాజస్త్రీశ్రోత్రియాణాంధనైరపి॥౨౫॥

వ్యా॥ అస్యాపవాదమాహ॥ఆధీతి॥ఆధిశ్చ సీమాచోపనిక్షేపశ్చాధిసీమోపనిక్షేపాః-జడశ్చబాలశ్చజడబాలౌ- తయోర్ధనే-జడబాలధనే-ఆధిసీమోపనిక్షేపాశ్చజడబాలధనేచ ఆధిసీమోపనిక్షేపజడబాలధనాని-తైర్వినా- ఉపనిక్షేపోనామ రూపసంఖ్యాప్రదర్శనేనరక్షణార్థంపరస్యహస్తేనిహితంద్రవ్యం- యథాహనారదః॥స్వద్రవ్యంయత్రవిస్రంభాన్నిక్షిపత్యవిశంకితః॥నిక్షేపోనామ తత్ప్రోక్తంవ్యవహారపదంబుధైరితి॥ ఉపనిధానముపనిధిః-ఆధ్యాదిషువక్ష్యతే॥బ్రువతోపిభూమేర్విoశతేర్ధనస్యచదశభ్యాపక్షేభ్యఊర్ధ్వమపుపచయహానిర్నభవతి-పురుషాపరాధస్యతథావిధస్యాభావాదుపేక్షాకారణస్యతత్రతత్రసంభవాత్ - తథాహి - ఆధేరాధిత్వోపాధికఏవభోగఇత్యుపేక్షాయామపినపురుషాపరాధః-సీమ్నశ్చిరకృతైస్తుషాంగారాదిచిహ్నైస్సుసాధనత్వాదుపేక్షాసంభవతి - ఉపనిక్షేపోపనిధ్యోర్భుక్తేఃప్రతిషిద్ధత్వాత్ప్రతిషేధాతిక్రమేణభోగేచసోదయఫలాభావాదుపేక్షోపపత్తిః-జడబాలయోర్జడత్వాద్బాలత్వాదుపేక్షయుక్తైవ - రాజ్ఞోబహుకార్యవ్యాకులత్వాత్ - స్త్రీణామజ్ఞానాదప్రాగల్భ్యాచ్చ- శ్రోత్రియస్యాధ్యయనాధ్యాపనతదర్థవిచారానుష్ఠానవ్యాకులత్వాదుపేక్షయుక్తైవ-తస్మాదాధ్యాదిషుసర్వత్రోపేక్షాకారణసంభవాత్ - నమత్కభోగేనితాక్రోశేచనకదాచిదపిఫలహానిః॥ ౨౫

కొన్ని విషయముల యందు ౧౦-౨౦ సం ల్లకంటె అధికముగా పరునికి అనుభవము గలిగియున్నను గతఫలముతోఁగూడ ఆద్రవ్యము ద్రవ్యస్వామికే చేరుననుట.

తా॥కుదవయుంచినభూమిగృహాదులును-పొలిమెరభూమియు-ఉపనిక్షేపమనఁగా రూపసంఖ్యలఁదెలిపిదాచఁబెట్టినద్రవ్యంబును-ఉపనిధియనఁగా రూపసంఖ్యలఁదెలుపక దాచఁబెట్టినద్రవ్యంబును-జడుఁడు-బాలుఁడు-నరపాలుఁడు-స్త్రీలు-ఛాందసులు - వీరిస్థావరజంగమద్రవ్యములును-వీటినితత్స్వామిసమక్షమందునిరాక్షేపముగా పది యిరువది సంవత్సరములకంటెనధికముగాపరుండనుభవించినప్పటికిని అట్టిస్థావరజంగమద్రవ్యంబులుగతఫలంబులతోఁగూడఆద్రవ్యస్వామికేచేరునని తాత్పర్యము - అదియేలయనిన-ఈచెప్పఁబడినవిషయములయందుయజమానుండుపేక్షించియుండుటకు కారణములుగలిగియున్నవి-అదియెట్లనిన- కుదవయుంచినద్రవ్యవిషయమైఆకుదవవిడిపించుకొనువరకుఆద్రవ్యస్వామికిస్వాతంత్ర్యము లేదుగనుక-ఉపేక్ష సేయఁబడును- పొలిమెరవిషయమైపొట్టుచెట్టుమొదలైనగుర్తులున్నవిగదాయనిఉపేక్ష సేయఁబడును - ఉపనిక్షేపోపనిధులననుభవింపఁగూడదనిశా

స్త్రమంమని షేధించియుండుటవలనఅట్టినిషేధమునతిక్రమించియనుభవించినను ఆయనుభోక్తకు అభ్యుదయఫలముగలుగదుగనుక అట్టివిషయమైఉపేక్ష సేయుటయుక్తము - జడులకును బాలురకును స్త్రీలకునుజ్ఞాన సామర్థ్యములుండవుగనుక వారునుఉపేక్షింతురు - ప్రభువునకు రాజ్యకార్యవ్యగ్రతచేతనుఛాందసునకు అధ్యయనాధ్యాపనాదివ్యాసంగముచేతనుఉపేక్షగలిగియుండుటయుక్తంబేయని తాత్పర్యము॥ ౨౫

మూ. { ఆధ్యాదీనాంవిహర్తారం ధనినేదాపయేద్ధనమ్।
దండంచతత్సమంరాజ్ఞేశక్త్యపేక్షమథాపివా }

వ్యా॥ ఆధ్యాదిషుదండవిశేషప్రతిపాదనార్థమాహ॥ఆధీతి॥ఆధ్యాదీనాం శ్రోత్రియద్రవ్యపర్యంతానాం చిరకాలోపభోగబలేనాపహర్తారంవివాదాస్పదీభూతంద్రవ్యంస్వామినేదాపయేదిత్యనువాదః - దండంచతత్సమం వివాదాస్పదీభూతద్రవ్యసమంరాజ్ఞేదాపయేదితివిధిః - యద్యపిగృహక్షేత్రాదిషుతత్సమోదండోనసంభవతి - తథాపిమర్యాదాయాఃప్రభేదేచసీమాతిక్రమణేతథేత్యాదినావక్ష్యమాణోదండోద్రష్టవ్యః - అథతత్సమదండేనాపహర్తుర్దమనంనభవతి-బహుధనత్వేన-తదాశక్త్యపేక్షంధనందాపయేత్ - యావతాతస్యదర్పోపశమోభవతితావద్దాపయేత్-దండోదమనాదిత్యాహుస్తేనాదాంతాన్దమయేదితిదండగ్రహణస్యదమనార్థత్వాత్ - యస్యతుతత్సమమపిద్రవ్యంనాస్తిసోపియావతాపీడ్యతే- తావద్దాప్యః - యస్యపునఃకిమపిధనంనాస్తి అసౌధిగ్దండాదినాదమనీయః - తథాచమనుః॥ధిగ్దండంప్రథమంకుర్యాద్వాగ్దండంతదనంతరం।తృతీయంధనదండంచవధదండమతఃపరమితి॥ఏషదండోపిశారీరోబ్రాహ్మణవ్యతిరిక్తానాందశధాదర్శితః - యథాహమనుః॥దశస్థానానిదండస్యమనుస్స్వాయంభువోబ్రవీత్।త్రిషువర్ణేషుయానిస్యురక్షతోబ్రాహ్మణోవ్రజేత్॥ఉపస్థముదరంజిహ్వాహస్తౌపాదౌచపంచమం।చక్షుర్నాసాచకర్ణౌచధనందేహస్తథైవచేతి॥ఏతేషాంయన్నిమిత్తోపరాధస్తత్తద్వోపస్థాదానిగ్రాహ్యఃకార్యఇతిద్రష్టవ్యం-ధనదానాశక్తౌకర్మకారయితవ్యో బంధనాగారంవాప్రవేశయితవ్యః - యథోక్తంకాత్యాయనేన॥ధనదానాసహంబుద్ధ్వాస్వాధీనంకర్మకారయేత్। అశక్తౌబంధనాగారంప్రవేశ్యోబ్రాహ్మణాదృతఇతి॥ బ్రాహ్మణస్యపునర్ధనాభావేకర్మనియోగాదినిప్రయోజ్యాని- యథాహగౌతమః। కర్మవియోగవిఖ్యాపననివాసనాంకకరణాదిస్వవృత్తావితి।నారదేనాపి॥వధస్సర్వస్వహరణంపురాన్నిర్వాసనాంకనే।తదంగచ్ఛేదఇత్యుక్తోదండఉత్తమసాహసః॥అవిశేషేణసర్వాసామేషదండవిధిస్మృతఇత్యుక్త్వోక్తం-వధాదృతేబ్రాహ్మణస్యనవధంబ్రాహ్మణోర్హతి॥శిరసోముండనందండస్తస్యనిర్వాసనంపురాత్।లలాటేచాభిశస్తాంకఃప్రయాణంగర్దభేనచేతి- అంకనేచపక్షస్థాదర్శితా॥గురుతల్పేభగఃకార్యస్సురాపానేసురాధ్వజః।స్తేయేతుశ్వపదంకుర్యాద్బ్రహ్మహణ్యశిరాఃపుమానితి। యత్తుచక్షుర్నిరోధో బ్రాహ్మణస్యేత్యాపస్తంబవచనంబ్రాహ్మణస్యపురాన్నిర్వాసనసమయేవస్త్రాదినాచక్షుర్నిరోధఃకర్తవ్యఇతితస్యార్థః - నచక్షుషోరుద్ధరణం - అవధ్యోబ్రాహ్మణోవ్రజేన్నశారీరోబ్రాహ్మణేదండఇత్యాదిమనుగౌతమాదివచనవిరోధాదిత్యలమతిప్రసంగేన॥ ౨౬

పూర్వశ్లోకోక్త ద్రవ్యములను అనుభవ బలంబుననపహరించినవానికి దండనము.

తా॥కుదవయుంచుకొనినభూమిగృహాదులు-పొలిమెరభూమి-నిక్షేపము- మొదలుగాఁగలపూర్వశ్లోకోక్తద్రవ్యములనుబహుకాలానుభవబలమువలన నెవ్వఁడైననపహరించెనేని అట్టివానివలన ప్రభువు ఆవివాదద్రవ్యమును రాఁబట్టిద్రవ్యస్వామికిప్పించి ఆవివాదద్రవ్యమునకుసమమైనద్రవ్యమునుదండనార్థమైతానుదీసుకొనవలయు - అయితే భూమిగృహాద్యపహారవిషయమందు వివాదద్రవ్యసమద్రవ్యమునుదండనార్థమైదీసుకొనుటయుక్తముగాదు కాఁబట్టిఅట్టివిషయమైవక్ష్యమాణంబగు ( మర్యాదానాంప్రభేదేచ ) అనుశ్లోకమందుఁ జెప్పఁబడుశిక్షవిధింపఁదగినది- ఆపరద్రవ్యాపహారిఅధికధనవంతుఁడై యుండెనేనివివాదద్రవ్యసమానద్రవ్యదండనముచేతనేవానిమదమణఁగదుగనుకఎంత ద్రవ్యమువలన వానిమదమణఁగునో అంత ద్రవ్యమపరాధార్థమైవిధింపఁదగినది - వాఁడువివాదద్రవ్యసమద్రవ్యమునైననియ్యఁజాలనివాఁడైయుండెనేని వానిశక్త్యనుసారముగా వానిమదమణఁగునట్లుధనదండనవిధింపఁదగినది - శుద్ధదరిద్రుఁడైయుండెనేని వానికి మనూక్తప్రకారముగా ధిగ్దండవాగ్దండవధదండాములువిధింపఁదగినవి॥ బ్రాహ్మణవ్యతిరిక్తులవిషయమై దండనస్థానములు పదివిధములుగామనుస్మృతియందుఁ జెప్పఁబడియున్నవి - అదిఏట్లనిన - గుహ్యస్థానము- కడుపు- నాలుక - చేతులు - కాళ్లు - కన్నులు - ముక్కు - చెవులు ధనము - దేహము - ఈపదిస్థానములు.

దండనస్థానములు ౧౦.

లోపస్థానము వానిచేతఁ జేయఁబడిన యపరాధమునకు కారణంబగునో ఆస్థానమందు దండనము విధింపఁ దగినది ॥ ధన దండన విషయమందు ఆధనము నియ్యఁజాలని వాని చేత కాత్యాయన వచనానుసారముగా పనులు సేయింప వలయు - ఆపనులు సేయ నశక్తుండై యుండెనేని వాని కారాగృహమందుంచ వలయు ॥ బ్రాహ్మణుండు దండనధనము నియ్యఁజాలనియెడల వానికి గౌతమవచనానుసారముగా- కర్మహీనునిఁ జేయుట - అకృత్యమును ప్రకటించుట-ఊరు వెళ్లఁగొట్టుట-పచ్చవొడుచుట- మొదలైనశిక్ష సేయవలయుఁగాని శారీరశిక్ష సేయఁ గూడదు ॥ మఱియు బ్రాహ్మణుండు మిక్కిలి గొప్పతప్పు చేసెనేని నారదాపస్తంబవచనానుసారముగా వానితల గొఱిగించి వానితప్పునకుఁ దగినట్లు ముఖమున పచ్చపొడిపించి వస్త్రాదుల చేకన్నులు గప్పి గాడిదె నెక్కిరించి పట్టణము వెళ్లఁగొట్టవలయు- పచ్చపొడిపించువిధం బెట్లనిన - గురుభార్యను బొందినవాని ముఖమందు భగాకారంబు గాను-సురాపానము చేసినవాని ముఖమందు సురాధ్వజాకారంబు గాను - స్వర్ణస్తేయము చేసినవాని ముఖమందు శునకపాదాకృతి గాను బ్రహ్మహత్య చేసినవాని ముఖమందు శిరోహీననరాకారంబు గాను-పచ్చఁబొడిపించి వెళ్లఁగొట్టవలయుఁగాని యొకప్పుడును బ్రాహ్మణునికి శరీరదండనముఁ జేయఁ గూడదనుట

బ్రాహ్మణునికి శిక్షవిధించుక్రమము.

మూ. ఆగమోఽభ్యధికో భోగాద్వినా పూర్వక్రమాగతాత్ ॥౨౭॥

వ్యా ॥ స్వత్వావ్యభిచారిత్వేన భోగస్య స్వత్వే ప్రమాణత్వముక్తం భోగమాత్రస్య స్వత్వవ్యభిచారిత్వాత్ కీదృశో భోగః ప్రమాణమిత్యత ఆహ ॥ ఆగమ ఇతి ॥ స్వత్వహేతుః ప్రతిగ్రహక్రయాదిరాగమః-స భోగాదభ్యధికో బలీయాన్ స్వత్వస్య బోధనే భోగస్యాగమసాపేక్షత్వాత్ - తథాహ నారదః ॥ ఆగమేన విశుద్ధేన భోగో యాతి ప్రమాణతాం । అవిశుద్ధాగమో భోగః ప్రామాణ్యం నైవ గచ్ఛతీతి । న చ భోగమాత్రాత్ స్వత్వావగమః - పరకీయస్యాపి వ్యవహారాదినోపభోగసంభవాత్ - అత ఏవ ॥ భోగం కేవలతో యస్తు కీర్తయేన్నాగమం క్వచిత్ । భోగచ్ఛలాపదేశేన విజ్ఞేయస్స తు తస్కర ఇతి స్మర్యతే । అతశ్చ-సాగమో దీర్ఘకాలో నిరంతరో నిరాక్రోశః ప్రత్యర్థిప్రత్యక్షశ్చేతి పంచవిశేషణయుక్తో భోగః ప్రమాణమిత్యుక్తం భవతి-తథా చ స్మర్యతే ॥ సాగమో దీర్ఘకాలశ్చ నిరాక్రోశో నిరంతరః ॥ ప్రత్యర్థిసన్నిధానశ్చ పరిభోగోఽపి పంచధేతి ॥ క్వచిచ్చాగమనిరపేక్షస్యాపి భోగస్య ప్రామాణ్యమిత్యాహ-వినా పూర్వక్రమాగతాదితి । పూర్వేషాం పిత్రాదీనాం త్రయాణాం క్రమః పూర్వక్రమస్తేనాగతో యో భోగస్తస్మాద్వినా ఆగమోఽభ్యధిక ఇతి సంబంధః । స పునరాగమాదభ్యధికః - ఆగమనిరపేక్షః ప్రమాణమిత్యర్థః ॥ తత్రాప్యాగమజ్ఞాననిరపేక్షో న సత్తానిరపేక్షః-సత్తా తు తేనైవావగమ్యత ఇతి బోధ్యం-వినా పూర్వక్రమాగతాదిత్యేతచ్చాస్మార్తకాలప్రదర్శనార్థం । ఆగమోఽభ్యధికో భోగాదితి చ స్మార్తకాలవిషయం- అతశ్చ స్మరణయోగ్యే కాలే యోగ్యానుపలబ్ధ్యాగమాభావనిశ్చయసంభవాదాగమజ్ఞానసాపేక్ష ఏవ భోగస్య ప్రామాణ్యం । అస్మార్తే కాలే యోగ్యానుపలబ్ధ్యభావేనాగమాభావనిశ్చయాసంభవాదాగమజ్ఞాననిరపేక్ష ఏవ సంతతో భోగః ప్రమాణం । ఏతదేవ స్పష్టీకృతం కాత్యాయనేన । స్మార్తే కాలే క్రియాభూమేస్సాగమా భుక్తిరిష్యతే । అస్మార్తేఽనుగమాభావాత్ క్రమాత్త్రిపురుషాగతేతి- స్మార్తశ్చ కాలో వర్షశతపర్యంతః శతాయుర్వై పురుష ఇతి శ్రుతేః - అనుగమాభావాదితి యోగ్యానుపలబ్ధ్యభావేనాగమాభావనిశ్చయాభావాదిత్యర్థః-అతశ్చ వర్షశతాధికో భోగస్సంతతో ప్రతిరవః ప్రత్యర్థిప్రత్యక్షశ్చాగమాభావే చానిశ్చితే అవ్యభిచారాదాక్షిప్తాగమస్స్వత్వం గమయతి । అస్మార్తేపి కాలే అనాగమస్స్మృతిపరంపరాయాం సత్యాం న భోగః ప్రమాణం - అత ఏవ ॥ అనాగమం తు యో భుంక్తే బహూన్యబ్దశతాన్యపి । చోరదండేన తం పాపం దండయేత్పృథివీపతిరిత్యుక్తం । న చానాగమం తు యో భుంక్త ఇత్యేకవచననిర్దేశాద్బహూన్యబ్దశతాన్యపీత్యపిశబ్దప్రయోగాత్ప్రథమస్యైవ పురుషస్య నిరాగమే చిరకాలోపభోగేపి దండవిధానమితి మంతవ్యం । ద్వితీయే తృతీయే వా పురుషే నిరాగమస్య భోగస్య ప్రామాణ్యప్రసంగాన్నైతదిష్యతే । ఆదౌ తు కారణం దానం మధ్యే భుక్తిస్తు సాగమేతి నారదస్మరణాత్ -తస్మాత్సర్వత్ర నిరాగమోపభోగే అనాగమం తు యో భుంక్త ఇత్యేతద్ద్రష్టవ్యం ॥ అన్యాయేనాపి యద్భుక్తం పిత్రా పూర్వతరైస్త్రిభిః । న తచ్ఛక్యమపాకర్తుం క్రమాత్త్రిపురుషాగతమితి । పిత్రా సహ పూర్వతరైస్త్రిభిరితి యోజ్యం । తత్రాపి క్రమాత్త్రిపురుషాగతమిత్యస్మార్తకాలోపలక్షణం । త్రిపురుషవివక్షాయామేకవర్షాభ్యంతరేపి పురుషత్రయాతిక్రమసంభవాద్ద్వితీయవర్షే నిరాగమస్య భోగస్య ప్రామాణ్యప్రసంగస్స్యాత్ స్మార్తే కాలే క్రియాభూమేస్సాగమా భుక్తిరిష్యత ఇతి స్మృతివిరోధః ॥ అన్యాయేనాపి యద్భుక్తమిత్యేతచ్చాన్యాయేనాపి భుక్తమపహర్తుం న శక్యం కింపునరన్యాయానిశ్చయ ఇతి వ్యాఖ్యేయం అపిశబ్దశ్రవణాత్ । యచ్చోక్తం- యద్వినాగమమత్యంతం భుక్తం పూర్వైస్త్రిభిర్భవేత్ । న తచ్ఛక్యమపాకర్తుం క్రమాత్త్రిపురుషాగతమితి । తత్రాప్యత్యంతమాగమం వినేత్యత్యంతమనుపలభ్యమానాగమం

వినేతి వ్యాఖ్యేయం - న పునరాగమస్వరూపం వినేతి - ఆగమస్వరూపాభావే భోగశతేనాపి న స్వత్వం భవతీత్యుక్తం - క్రమాత్ త్రిపురుషాగతమిత్యేతదుక్తాభావాత్ ॥ ననుస్మరణయోగ్యకాలే భోగస్యాగమసాపేక్షస్య ప్రామాణ్యమనువర్ణ్యం - తథాహి - యద్యాగమః ప్రమాణాంతరేణావగతస్తదా తేనైవ స్వత్వావగమాన్న భోగస్య స్వత్వే ఆగమే వా ప్రామాణ్యం - అథ ప్రమాణాంతరేణాగమో నావగతః కథం తద్విశిష్టో భోగః ప్రమాణముచ్యతే - ప్రమాణాంతరేణావగతాగమసహితఏవ నిరంతరో భోగః కాలాంతరే స్వత్వం గమయతి - అవగతోప్యాగమో భోగరహితో న కాలాంతరే స్వత్వం గమయితుమలం - మధ్యే దానవిక్రయాదినా స్వత్వాపగమసంభవాదితి సర్వమనవద్యం ॥౨౬॥

తా ॥ ఆగమ మనఁగా ప్రతిగ్రహక్రయాదికమైన స్వత్వకారణము - అట్టి ఆగమము అనుభవమునకంటె ప్రబలమై యున్నది - నారదవచనమందు నిర్దోషమైన ప్రతిగ్రహక్రయాది స్వత్వకారణములతోఁ గూడిన అనుభవమే ప్రమాణమౌను గాని కేవలానుభవము ప్రమాణము గాదని చెప్పఁబడియున్నది - స్మృత్యంతరమందు - ఎవ్వఁడైనను స్వత్వకారణమును జెప్పక కేవలానుభవమును జెప్పెనేని వాఁడు దొంగయని తెలియవలయునని చెప్పఁబడియున్నది - మఱియొక స్మృతియందు అనుభవము - ప్రతిగ్రహక్రయాది స్వత్వకారణయుక్తంబై - దీర్ఘకాలవ్యాపియై - నిరంతరంబై - నిరాక్షేపంబై - ప్రత్యర్థిసన్నిధానంబై - ఇట్లు అయిదు విశేషణములతోఁ గూడియుండవలయునని చెప్పఁబడియున్నది - కాఁబట్టి యిట్టి విశేషణములు లేని కేవలానుభవము ప్రమాణము గాదని తెలియఁదగినది ॥ అయితే - ముత్తాత - తాత - తండ్రి - ఈ మూఁడు తరముల వారికి (అనఁగా) నూఱేండ్లకు మించిన యనుభవము గలిగియుండి ఆయనుభవము నిరంతరమై నిరాక్షేపమై ప్రత్యర్థిప్రత్యక్షమై యుండి స్వత్వహేతువు లేని యన్యాయ్యానుభవమని దెలియుటకాస్పదంబు లేకయుండెనేని అట్టి విషయమందు స్వత్వహేతువు దెలియకున్నను ఆయనుభవము ప్రమాణమౌను —— అనేకశతసంవత్సరముల నుభవము గలిగియున్నను - అది అన్యాయ్యానుభవమే కాని స్వత్వకారణయుక్తంబు గాదని తత్పరిజ్ఞాతృజనపరంపరవలన దెలిసెనేని ప్రభువు అట్టి అనుభోక్తకు చోరదండనము విధించి ఆద్రవ్యమును ద్రవ్యస్వామికిప్పించవలయు ॥ మూఁడు తరముల యనుభవమనఁగా నూఱు సంవత్సరముల యనుభవమని తాత్పర్యము చేయవలయు - అట్లు చేయనియెడల - ఒక సంవత్సరములోపలనే మూఁడు తరముల వారికి అనుభవము సిద్ధించి రెండవసంవత్సరమందు కేవలానుభవమునకు ప్రామాణ్యప్రసక్తి గలుగును - అట్లు గలుగుట శాస్త్రవిరుద్ధము కాఁబట్టి పూర్వోక్త తాత్పర్యము యుక్తమని తెలియవలయు ॥ స్వత్వకారణములైన ప్రతిగ్రహక్రయాదులు లిఖితాదిసాధనాంతరములచేఁ దెలియఁబడినను నిరంతరానుభవము లేకుండెనేని కాలాంతరమందు స్వత్వనిర్ధారణసమర్థములుగా నేరవు - అది యేలయనిన - మధ్యకాలమందు దానవిక్రయాదులవలన స్వత్వహాని సంభవింపవచ్చును గనుక - అనుభవప్రమాణమునకు ప్రయోజనము లేదని శంకింపఁగూడదు ॥

స్వత్వహేతువు లేని కేవలానుభవము ప్రమాణము గాదు అనుభవము నూఱేండ్లకు మించియుండెనేని స్వత్వహేతువు దెలియంబడ లేదు ఎన్నేండ్లకైనను స్వత్వహేతువు లేదని తెలిసెనేని అనుభోక్త శిక్షార్హుండగును.

మూ ॥ ఆగమేపి బలం నైవ భుక్తిః స్తోకాపి యత్ర నో ॥౨౭॥

వ్యా॥ ఆగమసాపేక్షో భోగః ప్రమాణమిత్యుక్తం - ఆగమస్తర్హి భోగనిరపేక్ష ఏవ ప్రమాణమిత్యత ఆహ ॥ ఆగమేపీతి ॥ యస్మిన్నాగమే స్వల్పాపి భుక్తిర్నాస్తి - తస్మిన్నాగమే బలం సంపూర్ణతా నైవాస్తి - అయమభిసంధిః - స్వస్వత్వనివృత్తిపూర్వకః పరస్వత్వాపాదనం దానం - పరస్వత్వాపాదనం చ పరో యది స్వీకరోతి తదా సంపద్యతే - నాన్యథా - స్వీకారశ్చ త్రివిధో మానసో వాచికః కాయికశ్చేతి - తత్ర మానసో మమేదమితి సంకల్పరూపః - వాచికస్తు మమేదమిత్యాద్యభివ్యాహారోల్లేఖీ సవికల్పకః ప్రత్యయః - కాయికః పునరుపాదానాభిమర్శనాదిరూపోఽనేకవిధః స తత్ర తత్ర నియమ్యతే ॥ దద్యాత్ కృష్ణాజినం పుచ్ఛే గాం పుచ్ఛే కరిణం కరే। కేసరేషు తథైవాశ్వం దాసీం శిరసి దాపయేదితి। ఆశ్వలాయనోప్యాహ। అనుమంత్రయేత్ ప్రాణ్యభిమృశేత ప్రాణికన్యాం చేత్ తత్ర హిరణ్యవస్త్రాదౌ పునర్దానానంతరమేవోపాదానాదిసంభవాత్ త్రివిధోపి స్వీకారస్సంపద్యతే - క్షేత్రాదౌ పునః ఫలోపభోగవ్యతిరేకేణ కాయికస్వీకారాసంభవాత్। స్వల్పేనాప్యుపభోగేన భవితవ్యం। అన్యథా దానక్రియాదేస్సంపూర్ణతా న భవతీతి ఫలోపభోగలక్షణకాయికస్వీకారరహిత ఆగమో దుర్బలో భవతి - తత్సహితాదాగమాత్ - ఏతచ్చ ద్వయోః పూర్వాపరకాలాపరిజ్ఞానే - పూర్వాపరకాలపరిజ్ఞానే [illegible] పూర్వకాలా

గమ ఏవ బలీయానితి - అథవా-లిఖితం సాక్షిణో భుక్తిః ప్రమాణం త్రివిధం స్మృతమిత్యుక్తం-ఏషాం సమవాయే కస్య ప్రాబల్యమిత్యత్రేదముపతిష్ఠతే। ఆగమోఽభ్యధికో భోగాద్వినా పూర్వక్రమాగతాత్ ।ఆగమేఽపి బలం నైవ భుక్తిస్స్తోకాపి యత్ర నో ఇతి। అయమర్థః - ఆద్యే పురుషే సాక్షిభిర్భావిత ఆగమో భోగాదభ్యధికో బలవాన్ పూర్వక్రమాగతాద్భోగాద్వినా। సపునః పూర్వక్రమాగతో భోగశ్చతుర్థే పురుషే లిఖితేన భావితాదాగమాద్బలవాన్ - మధ్యమే తు భోగరహితాదాగమాత్ స్తోకభోగసహితో ప్యాగమో బలవానితి- ఏతదేవ నారదేన స్పష్టీకృతం ॥ ఆదౌ తు కారణం దానం మధ్యే భుక్తిస్తు సాగమా। కారణం భుక్తిరేవైకా సంతతా యా చిరంతనీతి॥ ౨౬

తా ॥ ఆగమమనఁగా ప్రతిగ్రహక్రయాదిరూపమైన స్వత్వకారణము-అది గలిగియున్నను-కొంచెమైనను అనుభవము లేకుండెనేని అట్టి ఆగమము బలయుక్తముగా నేరదు-అదియేలయన్నని- ఒకవస్తువునందు తనకుఁగల స్వాతంత్ర్యమును వదులుకొని పరునికి స్వాతంత్ర్యము గలుగఁజేయుట దానమనంబడును- పరునికి స్వాతంత్ర్యము వాఁడు స్వీకరింపక కలుగదు-ఆ స్వీకారము మానసికము-వాచికము - కాయికము-అని మూఁడు విధములై యుండును - అందు దాత దానము సేయఁగా నే ప్రతిగ్రహీతయీవస్తువు నాది యని మనంబున సంకల్పించుకొనుట మానసిక స్వీకారము- ఈవస్తువును నేను ప్రతిగ్రహించితినని వాక్కుచేతఁ జెప్పుట వాచిక స్వీకారము- దానమిచ్చిన వస్తువును దాఁకి తీసుకొనుట కాయిక స్వీకారము - మఱియు నీ స్వీకారంబనేక ప్రకారంబుగా స్మృతులయందుఁ జెప్పఁబడియున్నది- అది యెట్లన్నన-కృష్ణాజినమును గోవును దానము సేయునపుడు ప్రతిగ్రహించువాఁడు తోఁక దాఁకి ప్రతిగ్రహింపవలయు ననియు- గజదానము సేయునపుడు తొండము దాఁకి ప్రతిగ్రహింపవలయు ననియు - అశ్వమును జూలుపట్టుకొని ప్రతిగ్రహింపవలయు ననియు- దాసిని తల దాఁకి ప్రతిగ్రహింపవలయు ననియు- ఈరీతిగాఁ జెప్పఁబడియున్నది-అయితే ఉదక దానపూర్వకముగాఁ జేయఁదగిన హిరణ్యవస్త్రాది దానములయందు ఈ మూఁడు స్వీకారంబులును సంభవించును- భూమ్యాదులయందైతే ఫలానుభవము లేక కాయిక స్వీకారము సంభవించదు కాఁబట్టి కొంచెమైనను ఫలానుభవము గలిగియుండవలయు-అట్లు లేనియెడల దానవిక్రయాదులకు సంపూర్ణత గలుగదు కాఁబట్టి ఫలానుభవరూపమైన కాయిక స్వీకారము లేని ఆగమము అట్టి ఫలానుభవముతోఁ గూడిన ఆగమమునకంటె బలహీనంబగునని తెలియవలయు ॥ అనఁగా వాది ప్రతివాదులకిద్దఱికిని ఆగమములనఁగా స్వత్వకారణములైన ప్రతిగ్రహక్రయాదులు గలిగియుండి అందు పూర్వోత్తరములు దెలియకుండెనేని అనుభవయుక్తమయిన ఆగమమునకంటె అనుభవహీనమైన ఆగమము బలహీనంబగుననియు - పూర్వోత్తరములు దెలిసియుండెనేని గుణవిహీనంబయినను పూర్వకాలాగమమే బలయుక్తమగుననియును తాత్పర్యము ॥ అట్లుగాని పక్షమందు నారదవచనము ననుసరించి (ఆగమోఽభ్యధికో భోగాత్ ) అను నీ శ్లోకమునకు మఱియొక విధముగా అర్థము చెప్పవచ్చును- అది యెట్లన్నన-ఒక భూవివాదమందు వాదిప్రతివాదులకు లిఖిత భుక్తి సాక్షులనెడు మూఁడు సాధనములు గలిగియుండెనేని ఆ భూమిని సంపాదించిన ప్రథమ పురుషుని విషయమై త్రిపురుష క్రమాగత వ్యతిరిక్తానుభవముకంటె సాక్షి భావితమైన ఆగమము బలవత్తరంబగుననియు - భూమిని సంపాదించిన పురుషునికి నాలవపురుషుని విషయమై లిఖిత సాధనసిద్ధమైన ఆగమము నకంటె త్రిపురుషక్రమాగతమైన అనుభవము బలవత్తరంబగుననియు - మధ్యమపురుషుల విషయమై అనుభవహీనమైన ఆగమము నకంటె స్వల్పానుభవ సహితమైన ఆగమము బలయుక్తమగుననియును ఈరీతిగాఁ దెలియఁదగినది॥ ౨౭

అనుభవ హీనమైన ఆగమము సబలంబు గాదు దానప్రతిగ్రహ లక్షణము.

మఱియొక అర్థము.

మూ: ఆగమస్తు కృతో యేన సోఽభియుక్తస్తముద్ధరేత్ ।న తత్సుతస్తత్సుతో వా భుక్తిస్తత్ర గరీయసీ॥........ ౨౮॥

వా ॥ పశ్యతోఽబ్రువత ఇత్యత్ర వింశతివర్షోపభోగాదూర్ధ్వం భూమేర్దశవర్షోపభోగాదూర్ధ్వం ఫలానుసరణం న భవతీత్యుక్తం-తత్ర ఫలానుసరణవద్దండానుసరణమపి న భవిష్యతీత్యాశంక్య పురుషవ్యవస్థయా ప్రమాణవ్యవస్థయా చ దండవ్యవస్థాం దర్శయితుమాహ ॥ ఆగమ స్త్వితి ॥ యేన పురుషేణ భూమ్యాదేరాగమస్స్వీకారః కృతస్స పురుషః కుతస్తే క్షేత్రాదికమిత్యభియుక్తస్తమాగమం ప్రతిగ్రహాదికం లిఖితాద్యైరుద్ధరేద్భావయేత్ - అనేనాద్యపురుషస్యాగమమనుద్ధరతో దండ ఇత్యుక్తం భవతి- తత్సుతో ద్వితీ

యోఽభియుక్తో నాగమముద్ధరేత్ - కింత్వవిచ్ఛిన్నప్రత్యర్థిరహితభోగం అనేనాగమమనుద్ధరతో ద్వితీయస్య నదణ్డోఽపి తు విశిష్టభోగమనుద్ధరతో దండ ఇతి ప్రతిపాదితం - తత్సుత స్తృతీయో నాగమం నాపి విశిష్టభోగముద్ధరేదపి తు క్రమాయాతం భోగమాత్రం - అనేనాపి తృతీయస్య క్రమాయాతభోగానుద్ధరణే దణ్డో నాగమానుద్ధరణేన విశిష్టభోగానుద్ధరణే వేత్యభిహితం - తత్ర తయోర్ద్వితీయతృతీయయోర్భుక్తిశ్శేషగరీయసీ - తత్రాపి ద్వితీయే గురుర్వృత్తీయే గరీయసీతి విచేత్తవ్యం - త్రయాణామప్యాగమానుద్ధరణే అర్థహానిస్సమానైవ - దండే తు విశేష ఇతి తాత్పర్యార్థః - ఉక్తంచ - ఆగమస్తు కృతో యేన సదణ్డ్యస్తమనుద్ధరన్ । న తత్సుతస్తత్సుతో వా భోగ్యహానిస్తయోరపి ॥ ౨౭

తా॥ ౧౮ వ-శ్లోకమందు భూమివి ౨౦ ఏండ్లును గజాశ్వాదిధనములను పదేండ్లును తత్స్వామిసమక్షంబున నిరాక్షేపముగా పరుండనుభవించుటవలన తత్స్వామికి గతఫలహానిసంభవించునని చెప్పియున్నదిగదా - అట్టివిషయమందు పరుని సొమ్ము ను ౨౦-౧౦-సంవత్సరములనుభవించినవానికి శిక్షగలదా లేదాయనిశంక రాఁగా - పురుషవ్యవస్థచేతను లిఖితాది సాధనవ్యవస్థచేతను శిక్షావ్యవస్థ దెలియఁజేయఁబడుచున్నది॥ ఏపురుషుఁడు భూమ్యాదులను స్వాధీనపఱచుకొనియుండునో వాఁడు మఱియొకనిచేత ఈభూమ్యాదులు నీకెక్కడివని వివాదింపఁబడినవాఁడై తనకుఁగల ఆగమమును అనఁగా ప్రతిగ్రహక్రయాదిస్వత్వనిమిత్తమును లిఖితాదులచేత నుద్ధరించుకొనవలయు అట్లుద్ధరించుకొనఁజాలనియెడల ఆపురుషునికి శిక్షగలుగును॥ వానికొమారుఁడైన రెండవపురుషుఁడు ఆగమమునుద్ధరింపఁజాలకపోయినను తనతండ్రినాటనుండి తత్కాలమువరకు ప్రత్యర్థి సమక్షమందు నిరాక్షేపముగాజరుగుచున్న అవిచ్ఛిన్నానుభవమును సంపూర్ణముగా స్థిరపఱచవలయు - అట్టియనుభవమును స్థిరపఱచలేనియెడల రెండవపురుషునికి శిక్షగలుగును॥ వానికొమారుఁడైన మూఁడవపురుషుఁడు తనతాతదినములనుండి క్రమముగా అనుభవముగలిగియున్నదని మాత్రము స్థిరపఱచవలయు - అట్లుస్థిరపఱచలేనియెడల మూఁడవపురుషునికి శిక్షగలుగునుగాని ఆగమమునుద్ధరింపఁజాలకపోయినను మొదటినుండి జరిగినయావదనుభవమును సంపూర్ణముగా స్థిరపఱచలేకపోయినను శిక్షలేదు. అయితే (ఆగమమును) అనఁగా స్వత్వహేతువులైన ప్రతిగ్రహక్రయాదులను ఉద్ధరింపఁజాలనియెడల ఈముగ్గురికిని అర్థహానిగలుగుటయందు భేదములేదుగాని శిక్షయందుమాత్రము ఈచెప్పఁబడిన భేదముగలదని తెలియవలయు॥ ౨౭

స్వత్వనిమిత్తాదుల స్థిరపఱచలేని పరద్రవ్యానుభోక్తలకుదండవ్యవస్థాపనము.

మూ. యోఽభియుక్తః పరేతస్స్యాత్తస్య రిక్థీ తముద్ధరేత్ ।
న తత్ర కారణం భుక్తిరాగమేన వినా కృతా ॥ ౨౮

వ్యా॥ అస్మాత్ కాలాత్ భోగస్యాగమజ్ఞాననిరపేక్షస్య ప్రామాణ్యముక్తం వినాపూర్వక్రమాగతాదిత్యత్ర తస్యాపవాదమాహ - యోఽభియుక్త ఇతి ॥ యదా పునరాహర్త్రాదిరభియుక్తః కృతవ్యవహారనిర్ణయ ఏవ పరేతస్స్యాత్పరలోకగతో భవేత్తదా తస్య రిక్థీ పుత్రాదిస్తమాగమముద్ధరేత్ - యస్మాత్తత్ర తస్మిన్వ్యవహారే భుక్తిరాగమరహితా సాక్ష్యాదిభిస్సాధితాపి న ప్రమాణం - పూర్వాభియోగేన భోగస్య సావద్యత్వాత్ - నారదేనాప్యుక్తం । తథారూఢవివాదస్య ప్రేతస్య వ్యవహారిణః । పుత్రేణ సోఽర్థస్సంశోధ్యో న తం భోగో నివర్తయేదితి - అనిర్ణీతవ్యవహారే వ్యవహర్తరి ప్రేతే వ్యవహారో న నివర్తత ఇతి స్థితం - నిర్ణీతేపి వ్యవహారే స్థితే వ్యవహర్తరి వ్యవహారస్య ఛిత్త్వా నివర్తితే కస్యచిన్న ప్రవర్తత ఇతి ॥ ౨౮

తా॥ అనుభవము నూఱేండ్లకుమించియున్నను ఆనూఱేండ్లకులోపల అనుభవించుచున్న వానినీ దనీకెక్కడివి భూమ్యాదులని వివాదము వచ్చి ఆవివాదము పరిష్కరింపఁబడక యుండఁగానే వాఁడు మృతిఁబొందెనేని అప్పటికి నూఱేండ్లకుమించిన యనుభవముగలిగియున్నను వానిపుత్రాదులు తమకుఁగలిగియున్న ఆగమమును అనఁగా ప్రతిగ్రహక్రయాదిస్వత్వకారణమును స్థిరపఱచినయెడల ఆభూమ్యాదిస్వాతంత్ర్యమును బొందుదురుగాని మూఁడుతరములనుండి గలిగియున్న అనుభవమును మాత్రము సాక్ష్యములవల్ల దృఢపఱచినను స్వాతంత్ర్యమును బొందఁజాలరని యు ఆభూమ్యాదులననుభవించుచున్న వాఁడు తనమీఁద వచ్చిన వివాదము తీరుమానమైనపిమ్మట తన

అనుభవము నూఱేండ్లకు మించియుండెనేని స్వత్వహేతువును విచారింపఁబని లేదన్నందుకు

మినహాయింపు

జీవుండై యుండెనేనిపునర్వ్యవహారముకొన్నివిషయములయందుప్రవర్తించుననియుకొన్నివిషయములయందుప్రవర్తించదనియును తాత్పర్యము।ఇట్లునారదస్మృతియందును జెప్పియున్నది॥

మూ. { నృపేణాధికృతాః పూగాః శ్రేణయోథకులానిచ।పూర్వం
పూర్వంగురుజ్ఞేయంవ్యవహారవిధౌనృణామ్॥......౩౦॥ }

వ్యా॥ వ్యవహారసిద్ధయేవ్యవహారదర్శినాంబలాబలమాహ॥ నృపేణేతి॥ నృపేణరాజ్ఞాధికృతావ్యవహారదర్శనేనియుక్తాః-రాజ్ఞాసభాసదఃకార్యాఇత్యాదినోక్తాః- పూగాస్సమూహాఃభిన్నజాతీనాంభిన్నవృత్తీనామేకస్థాననివాసినామ్।యథాగ్రామనగరాదయః- శ్రేణయోనానాజాతీనామేకజాతీనాంచైకజాతీయకర్మోపజీవినాంసంఘాతాః-యథాపూగికతాంబూలికకువిందచర్మకారాదీనాంచ-కులానిజ్ఞాతిసంబంధిబంధూనాంసమూహాః-ఏతేషాంనృపాధికృతాదీనాంచతుర్ణాంపూర్వంపూర్వంయద్విచారితంతత్తద్గురుబలవద్వేదితవ్యం - నృణాంవ్యవహర్తౄణాంవ్యవహారవిధౌవ్యవహారదర్శనకార్యే-ఏతదుక్తంభవతి-నృపాధికృతైర్నిర్ణీతేవ్యవహారేపరాజితస్యయద్యప్యసంతోషఃదుష్టబుద్ధ్యాప్యపిభవతి-తథాపిపూగాదిషుపునర్వ్యవహారోనభవత్యేవ- ఏవంపూగైర్నిర్ణీతేపిశ్రేణ్యాదిగమనంతథాశ్రేణినిర్ణీతేకులగమనంనభవతి-కులనిర్ణీతేతుశ్రేణ్యాదిగమనంభవతి- శ్రేణినిర్ణీతేతుపూగాదిగమనంపూగనిర్ణీతేనృపాధికృతగమనంభవతీతి- నారదేనపునర్నృపాధికృతైర్నిర్ణీతేపివ్యవహారేనృపగమనంభవతీత్యుక్తం॥కులానిశ్రేణయశ్చైవపూగాశ్చాధికృతానృపః। ప్రతిష్ఠావ్యవహారాణాంగుర్వేషాముత్తరోత్తరమితి।తత్రచనృపగమనేసోత్తరసభ్యైనరాజ్ఞాపూర్వైస్సభ్యైస్సహపునర్వ్యవహారేనిర్ణీయమానేయద్యసౌదుష్టవాదీపరాజితస్తదాసౌదండ్యః-యదాసౌజయతితదాధికృతాస్సభ్యాదండ్యాః॥౩౦

తా॥ రాజసభికులు-గ్రామనగరాద్యధ్యక్షులు-ఏకజాతీయవృత్తిచేజీవనముసేయువణిక్సమూహము-కులస్థులు-వీరువ్యవహారములవిచారించుటయందధికారముగలవారైయుందురు-వీరిలోవెనుకఁజెప్పఁబడినవారికంటెముందరఁజెప్పఁబడినవారుప్రబలులుగనుకముందరఁజెప్పఁబడినవారుతీరుమానించినవ్యవహారమునువెనుకఁజెప్పఁబడినవారుతిరుగావిచారింపఁగూడదుగానివెనుకఁజెప్పఁబడినవారుతీరుమానించినవ్యవహారమునుముందరఁజెప్పఁబడినవారువిచారింపవచ్చును॥అదియెట్లనిన- రాజసభికులుతీరుమానించినవ్యవహారమునుగ్రామనగరాధ్యక్షులైనను-వణిక్సమూహమువారైననుకులస్థులైనను-తిరుగావిచారింపఁగూడదు।గ్రామనగరాధ్యక్షులుతీరుమానించినవ్యవహారమును వణిక్సమూహమువారైననుకులస్థులైననుమరలవిచారింపఁగూడదు - వణిక్సమూహమువారుతీరుమానించినవ్యవహారమును కులస్థులువెండియువిచారింపఁగూడదు - కులస్థులుతీరుమానించినవ్యవహారమునువణిక్సమూహమువారునుగ్రామనగరాద్యధ్యక్షులునురాజసభికులునుతిరుగావిచారింపవచ్చును-వణిక్సమూహముతీరుమానించినవ్యవహారమునుగ్రామనగరాద్యధ్యక్షులునురాజసభికులునుమరలవిచారింపవచ్చును-గ్రామనగరాద్యధ్యక్షులుతీరుమానించినవ్యవహారమును రాజసభికులు తిరుగావిచారింపవచ్చును-రాజసభికులుతీరుమానించినవ్యవహారమునుభూపాలుండువిచారింపవచ్చునని నారదులచేఁజెప్పఁబడియున్నది అట్లుసభికులుతీరుమానించినవ్యవహారమును రాజవర్యుండు ఉత్తమసభికులతోఁగూడుకొనివిచారించునెడలసభికులుచేసినతీరుమానమేన్యాయ్యమైయుండెనాఆవ్యవహారమునుదెచ్చినవాఁడుశిక్షార్హుండగును - సభికులుచేసినతీరుమానముఅన్యాయ్యమైయుండెనాసభికులుదండనార్హులగుదురు॥ ౩౦

వ్యవహారవిచారణాధికారులబలాబలనిర్ణయము

మూ. { బలోపధివినిర్వృత్తాన్వ్యవహారాన్నివర్తయేత్। స్త్రీ
నక్తమంతరాగారబహిశ్శత్రుకృతాంస్తథా॥ ౩౧॥ }

వ్యా॥ దుర్బలైర్వ్యవహారదర్శిభిర్దృష్టోవ్యవహారఃపరావర్తతే-ప్రబలదృష్టస్తుననివర్తతఇత్యుక్తం- ఇదానీంప్రబలదృష్టోపివ్యవహారఃకశ్చిన్నివర్తతఇత్యాహ॥ బలేనబలాత్కారేణ-ఉపధినాభయేనవంచనేనవినిర్వృత్తాన్నిష్పన్నాన్వ్యవహారాన్నివర్తయేత్।తథాస్త్రీభిర్నక్తంరాత్రావస్త్రీభిరపి- అంతరాగారేగృహాభ్యంతరేబహిర్గ్రామాదిభ్యశ్శత్రుభిశ్చకృతాన్వ్యవహారాన్నివర్తయేదితిసంబంధః।అపిచ।మత్తోన్మత్తార్తవ్యసనిబాలభీతాదియోజితః।అసంబంధకృతశ్చైవవ్యవహారోనసిద్ధ్యతీతి। మత్తో

మదనీయద్రవ్యేణ - ఉన్మత్తఉన్మాదేన పంచవిధేనవాతపిత్తశ్లేష్మసన్నిపాతగ్రహసంభవేనోపసృష్టః-ఆర్తోవ్యాధితః-వ్యసనమిష్టవియోగానిష్టప్రాప్తిజనితదుఃఖంతద్వాన్వ్యసనీ - బాలోవ్యవహారాయోగ్యః-భీతోఽరాతిభ్యః-అదిగ్రహకాత్పురరాష్ట్రాదివిరుద్ధః-పురరాష్ట్రవిరుద్ధశ్చయశ్చరాజ్ఞావిసర్జితః। అనాదేయోభవేద్వాదోధర్మవిద్భిరుదాహృతఇతిస్మరణాత్। ఏతైర్యోజితఃకృతోవ్యవహారోన సిద్ధ్యతి - అనియుక్తాసంబంధకృతోపివ్యవహారోనసిద్ధ్యతీతిసంబంధః।యత్తుమనుస్మరణం। గురోశ్శిష్యేపితుఃపుత్రేదంపత్యోస్స్వామిభృత్యయోః। విరోధేతుమిథస్తేషాంవ్యవహారోనసిద్ధ్యతీతి తదపిగురుశిష్యాదీనామాత్యంతికవ్యవహారప్రతిషేధపరంనభవతి - తేషామపికథంచిద్వ్యవహారస్యేష్టత్వాత్।తథాహి।శిష్యశిష్టిరవధేనాశక్తౌరజ్జువేణువిదళాభ్యాంతనుభ్యామన్యేనఘ్నన్రాజ్ఞాశాస్యఇతిగౌతమస్మరణాత్ - నోత్తమాంగేకథంచనేతిమనుస్మరణాచ్చ-యదిగురుఃకోపావేశేనమహతాదండేనోత్తమాంగేతాడయతి-తదాస్మృతివ్యపేతేనమార్గేణాధర్షితశ్శిష్యోయదిరాజ్ఞేనివేదయతి - తదాభవత్యేవవ్యవహారపదం॥భూర్యాపితామహోపాత్తేత్యాదివచనాత్పితామహోపాత్తేభూమ్యాదౌపితాపుత్రయోస్స్వామ్యసమానేయదిపితావిక్రయాదినాపితామహోపాత్తంభూమ్యాదినాశయతితదాపుత్రోయదిధర్మాధికారిణంప్రవిశతితదాపితాపుత్రయోరపిభవత్యేవవ్యవహారః॥తథా-దుర్భిక్షేధర్మకార్యేచవ్యాధౌసంప్రతిరోధకే। గృహీతంస్త్రీధనంభర్తానకామాద్దాతుమర్హతీతిస్మరణాత్। దుర్భిక్షాదివ్యతిరేకేణ యదిస్త్రీధనంభర్తావ్యయీకృత్యవిద్యమానధనోపియాచ్యమానోనదదాతితదాదంపత్యోరపీష్యతఏవవ్యవహారః।తథా-భక్తదాసస్యస్వామినాసహవ్యవహారాన్వృష్ట్యతి-గర్భదాసస్యాపి-గర్భదాసాదీనధికృత్య॥ యస్త్వేషాంస్వామినంకశ్చిన్మోచయేత్ప్రాణసంశయాత్। దాసత్వాత్సవిముచ్యేతపుత్రభాగంలభేతచేతినారదేనోక్తత్వాత్ - తదమోచనేపుత్రభాగాదానేచస్వామినాసహవ్యవహారఃకేనవార్యతే- తస్మాద్దృష్టాదృష్టయోశ్శ్రేయస్కరోనభవతి గుర్వాదిభిర్వ్యవహారఇతి ప్రథమంశిష్యాదయోనివారణీయారాజ్ఞానసభ్యేనేతిగురోశ్శిష్యఇత్యాదిశ్లోకస్యతాత్పర్యార్థః। అత్యంతనిర్బంధేతుశిష్యాదీనామపూర్వోక్తరీత్యాప్రవర్తనీయోవ్యవహారః- యదపి॥ఏకస్యబహుభిస్సార్ధంస్త్రీణాంప్రేష్యజనస్యచ। అనాదేయోభవేద్వాదోధర్మవిద్భిరుదాహృతఇతినారదవచనం-తత్రైకస్యాపి। గణద్రవ్యంహరేద్యస్తుసంవిదంలంఘయేచ్చయః। సర్వస్వహరణంకృత్వాతంరాష్ట్రాద్విప్రవాసయేత్। తథైకంఘ్నంతంబహూనాంచేత్యాదిస్మరణాత్।ఏకాద్యైర్బహుభిస్సార్ధంవ్యవహారఇష్యతఏవేతిభిన్నార్థైర్బహుభిరేకస్యయుగపద్వ్యవహారోనభవతీతిద్రష్టవ్యం। స్త్రీణామిత్యపిగోపశౌండికాదిస్త్రీణాంస్వాతంత్ర్యాద్వ్యవహారోభవత్యేవేతితదన్యాసాంకులస్త్రీణాంపతిపుత్రజీవత్సుతత్వాత్పారతంత్ర్యాదనాదేయోవ్యవహారఇతివ్యాఖ్యేయం। ప్రేష్యజనస్యచేత్యేతదపిప్రేష్యజనస్యస్వామిపారతంత్ర్యాత్స్వాస్థ్యాభావాద్వ్యవహారేఽస్వాతంత్ర్యాత్స్వామ్యనుజ్ఞయైవవ్యవహారోనాన్యథేతియోజనీయమ్॥ ౩౧

తా॥ పూర్వశ్లోకమందు బలహీనులైనవిచారణకర్తలు తీరుమానించినవ్యవహారమును ప్రబలురు త్రిప్పవచ్చునుగాని ప్రబలుడుతీరుమానించినవ్యవహారమును బలహీనులు త్రిప్పఁగూడదని చెప్పఁబడెనుగదా - ఇప్పటకొన్నివ్యవహారములను ప్రబలులుతీరుమానించియున్నను త్రిప్పివేయవచ్చునని చెప్పఁబడుచున్నది॥ బలాత్కారముచేతనైనను భయముచేతనైనను వంచనచేతనైనను విమర్శింపఁబడినవ్యవహారంబులును - స్త్రీలచేఁజేయఁబడినవ్యవహారంబును - రాత్రియందుజరిగింపఁబడినవ్యవహారంబులును - ఇంటిలోపలనైనను - ఊరిబైటనైననుజరిగింపఁబడినవ్యవహారంబులును - మైకముగలుగఁజేయుకల్లుసారాయి మొదలైనద్రవ్యములచేతమత్తుఁడైయుండువాఁడు- వాతపిత్తశ్లేష్మసన్నిపాతగ్రహావేశములనెడునైదుదోషములలోనొకదోషముచేత ఒడలెఱుంగకయుండువాఁడు-వ్యాధిపీడితుఁడు - దుఃఖితుండు-శత్రుభీతుండు-వీరలచేతఁజేయఁబడినవ్యవహారములును- పురరాష్ట్రాదివిరుద్ధవ్యవహారములును - రాజుత్రోసివేసినవ్యవహారములును-సంబంధములేనివాఁడుజరిగించినవ్యవహారంబును- ఇట్టివ్యవహారములనుప్రబలాధికారితీరుమానించియున్నను త్రిప్పివేయవచ్చును-మనుస్మృతియందుగురుశిష్యులకునుపితాపుత్రులకును భార్యాభర్తలకును స్వామిభృత్యులకునువ్యవహారముసిద్ధించదని చెప్పఁబడియున్నది-అయితే ఈమనువచనమునకు గురుపితృప్రభృతులతోశిష్యపుత్రాదులువివాదపడుటఐహికాముష్మికశ్రేయోహానికరంబుగావున ప్రభువుగుర్వాదులతోడ వ్యవహారమాడుటమీకు శ్రేయస్కరంబుగాదనిశిష్యాదులనునివారింపవలయునని తాత్పర్యముగాని ఆశిష్యాదులుఎట్టయి

ప్రబలాధికారి తీరుమానించియున్నను తిరిగి పొయ్యేడి వ్యవహారములు.

ననువిచారింపవలయునని కోరినయెడల అట్టివ్యవహారమును విచారింపనే కూడదని తాత్పర్యముగాదు - అదియేలయనిన- గుర్వాదులతోడ శిష్యాదులకు వివాదము గలుగుటకు శాస్త్రసిద్ధములైన కారణములున్నవి ॥ అదియెట్లనిన- గౌతమసూత్రమందు గురువు శిష్యుని సన్నపుత్రాఁటి చేతనైనను చిన్న బెత్తము చేతనైనను గాయము దగలకుండునట్లు కొట్టవచ్చును గాని యితరమైన దాని చేతఁ గొట్టఁగూడదు అట్లు కొట్టినగురువును రాజు విచారింపవలయునని చెప్పియున్నది - మనుస్మృతియందు శిష్యుని తలమీఁదఁ గొట్టఁగూడదని చెప్పియున్నది- ఈశాస్త్రమునకువ్యతిరిక్తముగా కోపాతిశయంబున గురువు శిష్యునిఁ గొట్టినయెడల ఆశిష్యుఁడు నన్ను ధర్మశాస్త్రవిరుద్ధముగా గురువు గొట్టెనని ధర్మాధికారికిఁ దెలియఁజేసెనేని అపుడా ధర్మాధికారి గురుశిష్యుల వివాదమును విచారింపవలసియున్నది ॥ తాత మొదలగువారు సంపాదించిన భూమిగృహాదులయందు తండ్రికొడుకులకు స్వాతంత్ర్యము సమానమైయుండఁగా తండ్రియైనవాఁడు ఆభూమిగృహాదులను విక్రయాదులచేత పోఁగొట్టఁదలంచినయెడల పుత్త్రుఁడు ధర్మాధికారికి దెలియఁజేసెనేని అపుడు ధర్మాధికారి పితాపుత్త్రుల వివాదమును విచారింపకతీరదు ॥ దుర్భిక్షాదివ్యతిరిక్తకాలమందు రోగాదులు లేనివాఁడై యుండి ధర్మకార్యనిమిత్తముగాక యితరవిషయమై స్త్రీధనరూపముగానున్న తనభార్యధనమును వ్యయముగావించినవాఁడు ధనవంతుఁడై యుండియు తిరుగా తనభార్య యడిగినప్పుడియ్యకుండెనేని భార్యాభర్తలకు వివాదము గలుగునని స్మృత్యంతరమందు దెలియఁజేయఁబడియున్నది ॥ నారదవచనమందు గర్భదాసాదులలో నెవ్వఁడైనను తనయజమానునికి చోరవ్యాఘ్రాదులవలన ప్రాణసందేహము గలిగినప్పుడు ఆచోరవ్యాఘ్రాదులఁ గొట్టియజమానుని కాపాడెనేని వానికి భృత్యత్వమును బాపి వానికి పుత్రభాగమునియ్యవలయునని చెప్పియున్నది- యజమానుఁడట్లు చేయని యెడల ఆభృత్యునికి తనయజమానునితోఁ గలుగు వాదము నెవఁడును విచారించును ॥ ఒకవంశమందుఁ బుట్టినవారు ఒకవంశమందుఁ బుట్టినవారికి పారంపర్యముగా భృత్యులై యుండిరేని వారు గర్భదాసులనంబడుదురు ॥ మఱియు( ఏకస్యబహుభిస్సార్ధం )అనెడు నారదవచనమునకు ఒకనికి అనేకులతోఁ గలిగియున్న అనేకవ్యవహారములను ఏకకాలంబున నంగీకరింపఁగూడదనియు అనేకులతోఁ గలిగియున్న యొకవ్యవహారము నంగీకరింపవచ్చుననియు- గొల్లచేడియలు- ఈండ్రపడఁతులు దప్పతక్కిన స్త్రీలు పెనిమిటి బ్రతికియుండఁగా నతనియనుమతి లేక తెచ్చినవ్యవహారముల నంగీకరింపఁగూడదనియు- భృత్యజనులు తమయజమానుని యనుమతి లేక స్వతంత్రులై తెచ్చినవ్యవహారముల నంగీకరింపఁగూడదనియును తాత్పర్యముగనుక - ఈలాటిపట్టఁగూడనివ్యవహారములను ప్రబలాధికారిపట్టి తీరుమానించినను ఆతీర్పు తిరిగిపోవుననియభిప్రాయము॥ ౩౧

మూ. { ప్రణష్టాధిగతం దేయం నృపేణ ధనినే ధనం। విభా-
వయేన్న చేల్లింగైస్తత్సమం దండమర్హతి॥ ౩౨॥ }

వ్యా॥ పరావర్త్యవ్యవహారముక్త్వేదానీం పరావర్త్యద్రవ్యమాహ ॥ ప్రణష్టేతి॥ ప్రణష్టం హిరణ్యాది శౌల్కికస్థానపాలాదిభిరధిగతం రాజ్ఞే సమర్పితం- యత్తద్రాజ్ఞా ధనినే దాతవ్యం- యది ధనీ రూపసంఖ్యాదిభిర్లింగైస్స్వకీయత్వం భావయతి తదా తత్సమం దండ్యః అసత్యవాదిత్వాత్ - అధిగమస్య స్వత్వనిమిత్తత్వాత్స్వత్వే ప్రాప్తే తత్పరావృత్తిరనేనోక్తా। అత్ర చ కాలావధిం వక్ష్యతి। శౌల్కికైః స్థానపాలైర్వా నష్టాపహృతమాహృతం। అర్వాక్సంవత్సరాత్స్వామీ హరేత పరతో నృప ఇతి। మనునా పునస్సంవత్సరత్రయమవధిత్వేన నిర్దిష్టం ప్రణష్టస్వామికం రిక్థం రాజా త్ర్యబ్దం నిధాపయేత్। అర్వాక్త్ర్యబ్దాద్ధరేత్స్వామీ పరతో నృపతిర్హరేదితి। తత్ర వర్షత్రయపర్యంతమవశ్యం రక్షణీయం। తత్ర యది సంవత్సరాదర్వాక్స్వామ్యాగచ్ఛేత్తదా కృత్స్నమేవ దద్యాత్ యదా పునస్సంవత్సరాదూర్ధ్వమాగచ్ఛతి తదా కించిద్భాగం రక్షణమూల్యం గృహీత్వా శేషం స్వామినే దద్యాత్॥ యథాహ- ఆదదీతాథ షడ్భాగం ప్రణష్టాధిగతాన్నృపః। దశమం ద్వాదశం వాపి సతాం ధర్మమనుస్మరన్నితి ॥ తత్ర ప్రథమే వర్షే కృత్స్నమేవ దద్యాద్ద్వితీయే ద్వాదశం భాగం తృతీయే దశమం భాగం చతుర్థాదిషు షష్ఠం భాగం గృహీత్వా శేషం దద్యాత్। రాజభాగస్య చతుర్థాంశమధిగంత్రే దద్యాత్। స్వామ్యనాగమే తు కృత్స్నం స్వధన

గురువు తండ్రి మొదలైనవారితో శిష్యుఁడు పుత్త్రుఁడు మొదలైనవారికి వివాదము గలుగుటకు హేతువులు,

స్యచతుర్థాంశమధిగంత్రే దత్వా శేషం రాజా గృహ్ణీయాత్ । తథాహ గౌతమః। ప్రణష్టస్వామికమధిగమ్య రాజ్ఞే ప్రబ్రూయుర్విఖ్యాప్య సంవత్సరం రాజ్ఞా రక్ష్యమూర్ధ్వమధిగంతుశ్చతుర్థాంశో రాజ్ఞశ్శేష ఇతి। అత్ర సంవత్సరమిత్యేకవచనమవివక్షితం- రాజా త్ర్యబ్దం నిధాపయేదితి స్మరణాత్ । హారయేత్త్ర్యవరతో నృప ఇత్యేతదపి స్వామిన్యనాగతే త్ర్యబ్దాదూర్ధ్వం వ్యయీకరణాభ్యనుజ్ఞాపరం- ఆగతే తు స్వామిని వ్యయీభూతే తు ద్రవ్యే రాజా స్వాంశమపహాయ తత్సమం దద్యాత్ - ఏతచ్చ హిరణ్యాదివిషయం । గవాదివిషయే తు వక్ష్యతి- పణానేకశఫే దద్యాదిత్యాదినా ॥ ౩౩

ఎవఁడైనను పోఁగొట్టుకొన్న ద్రవ్యమును జూచినవారు రాజసముఖమునకుఁ దెచ్చిన యెడల చేయఁదగిన క్రమము.

తా ॥ ఎవ్వఁడైనను పోఁగొట్టుకొన్న సువర్ణరజతాది ద్రవ్యమును సుంకరులు తలవరులు మొదలైనవారు లెవ్వరైనను జూచి రాజసమ్ముఖమునకుఁ దెచ్చియిచ్చిరేని- ఆ రాజశేఖరుండును గౌతమాద్యుక్తప్రకారము- సకలమైన వారికిఁ దెలియునట్లు చాటింపఁ జేయఁగా ఆ ద్రవ్యస్వామి యొకసంవత్సరములోపల వచ్చి ఆ ద్రవ్యము యొక్క రూపసంఖ్యాదులను సమముగాఁ జెప్పెనేని ఆ ద్రవ్యమంతయు వానికిప్పింపవలయు ॥ ఎవఁడైనను ఆ ద్రవ్యము నాదని యబద్ధమాడి ఆ ద్రవ్యము యొక్క రూపసంఖ్యాదులను వ్యస్తముగాఁ జెప్పెనేని ఆ ద్రవ్యమునకు సమానమైన దండనము వానికి విధింపఁదగినది ॥ ద్రవ్యస్వామి రెండవసంవత్సరమందు వచ్చెనేని తద్ద్రవ్యరక్షణార్థమై పండ్రెండవపాలు ప్రభువు దీసుకొని తక్కిన ద్రవ్యము ద్రవ్యస్వామికిప్పింపవలయు ॥ మూఁడవసంవత్సరమందు వచ్చెనేని పదింటనొకపాలు ప్రభువు దీసుకొని తక్కిన ద్రవ్యము ద్రవ్యస్వామికిప్పింపవలయు ॥ ద్రవ్యస్వామి మూఁడేండ్లకు పైనెప్పుడు వచ్చినను భూవల్లభుండు ఆఱవపాలు పట్టుకొని తక్కిన ద్రవ్యము నిప్పింపవలయు ॥ ప్రభువు తనకు వచ్చిన భాగమందు నాలవపాలు ఆ ద్రవ్యమును బట్టి తెచ్చిన వానికిప్పింపవలయు ॥ ద్రవ్యస్వామి యనేకసంవత్సరములు రాకుండెనేని ఆ ద్రవ్యమును పట్టి తెచ్చిన వానికి నాలవపాలిప్పించి తక్కిన యావద్ద్రవ్యము ప్రభువు దీసుకొనవచ్చును ॥ మూఁడేండ్లకు పైన ద్రవ్యస్వామి రాకపోయిన యెడల ప్రభువా ద్రవ్యమును వ్యయము సేయవచ్చునని చెప్పియుండుటవలన అట్లు వ్యయము చేసిన వెనుక ద్రవ్యస్వామి వచ్చెనేని ప్రభువు తన భాగము గాక తక్కిన ద్రవ్యమును బొక్కసమునుండి యొత్తియిప్పింపవలయును ॥ ఈ శ్లోకమందుఁ జెప్పినది నష్టమైన సువర్ణరజతాది విషయము ॥ గవాశ్వాదివిషయమై- పణానేకశఫే దద్యాదిత్యాదివక్ష్యమాణగ్రంథమందుఁ జెప్పఁబడునని తాత్పర్యము ॥ ౩౩

మూ. రాజా లబ్ధ్వా నిధిం దద్యాద్ద్విజేభ్యోర్ధం ద్విజః పునః । విద్వానశేషమాదద్యాత్స సర్వస్య ప్రభుర్యతః ॥ ఇతరేణ నిధౌ లబ్ధే రాజా షష్ఠాంశమాహరేత్ । అనివేదితవిజ్ఞాతో దాప్యస్తం దండమేవ చ ॥ ౩౪ ॥

వ్యా ॥ రథ్యాశుల్కశాలాదినిపతితస్య సువర్ణాదేర్నష్టస్యాధిగమే విధిముక్త్వాధునా భూమౌ చిరనిఖాతస్య సువర్ణాదేర్నిధిశబ్దవాచ్యస్యాధిగమే విధిమాహ ॥ రాజేత్యాది ॥ ఉక్తలక్షణం నిధిం రాజా లబ్ధ్వార్ధం బ్రాహ్మణేభ్యో దత్వా శేషం కోశే నివేశయేత్ - బ్రాహ్మణస్తు విద్వాంశ్రుతాధ్యయనసంపన్నస్సదాచారో యది నిధిం లభేత తదా సర్వమేవ గృహ్ణీయాత్ - యస్మాదసౌ సర్వస్య జగతః ప్రభుః - ఇతరేణ తు రాజవిద్వద్బ్రాహ్మణవ్యతిరిక్తేన అవిద్వద్బ్రాహ్మణక్షత్రియాదినా నిధౌ లబ్ధే రాజా షష్ఠాంశమధిగంత్రే దత్వా శేషం నిధిం స్వయమాహరేత్ - యథాహ వసిష్ఠః- అప్రజ్ఞాయమానం విత్తం యోధిగచ్ఛేద్రాజా తద్ధరేదధిగంత్రే షష్ఠమంశం ప్రదద్యాదితి- గౌతమోపి - నిధ్యధిగమో రాజధనం న బ్రాహ్మణస్యాభిరూపస్య బ్రాహ్మణోపి వ్యాఖ్యాతా షష్ఠమంశం లభేతేత్యేక ఇతి - అనివేదిత ఇతి కర్తరి నిష్ఠా - అనివేదితశ్చాసౌ విజ్ఞాతశ్చ రాజ్ఞేత్యనివేదితవిజ్ఞాతః- యః కశ్చిన్నిధిం లబ్ధ్వా రాజ్ఞే న నివేదితవాన్ విజ్ఞాతశ్చ రాజ్ఞా స సర్వం నిధిం దాప్యో దండ్యశ్చ శక్త్యపేక్షయా - అథ నిధేరపి స్వామ్యాగత్య రూపసంఖ్యాదిభిస్స్వత్వం భావయతి తదా తస్మై రాజా నిధిం దత్వా షష్ఠం ద్వాదశం వాంశం స్వయమాహరేత్ - యథాహ మనుః- మమాయమితి యో బ్రూయాన్నిధిం సత్యేన మానవః । తస్యాదదీత షడ్భాగం రాజా ద్వాదశమేవ వేతి - అంశవికల్పస్తు వర్ణకాలాద్యపేక్షయా వేదితవ్యః ॥ ౩౪

తా ॥ భూమియందు పాతిపెట్టిన నిక్షేపము ప్రభువునకు దొరికినయెడల అందు సగము బ్రాహ్మణులకిచ్చి తక్కిన సగమును తాను బొక్కసమునఁ జేర్చుకొనవలయు ॥ వేదశాస్త్రాధ్యయనసంపన్నుండును సదాచారనిష్ఠుండును నైన బ్రాహ్మణునకి

నిధి దొరికినయెడలఅంతయునా బ్రాహ్మణునికే యిప్పింపవలయును గాని ప్రభువు భాగము దీసుకొనఁగూడదు॥ ఇతరులకు అనఁగా విద్వాంసులు గాని బ్రాహ్మణులకైనను క్షత్రియవైశ్యాదులలో నెవరికైనను నిధి దొరికిన యెడల ఆఱవపాలు నిధిగనుఁగొని తెచ్చినవారికిప్పించి తక్కిన ద్రవ్యమును ప్రభువు బొక్కసమునఁ జేర్చుకొనవలయు॥ ఈరీతిగా నే వసిష్ఠగౌతమాదులచేతను జెప్పఁబడియున్నది॥ ఎవఁడైనను తనకు దొరికిననిక్షేపమును దాఁచి ప్రభువునకుఁ దెలుపకుండఁగా ప్రకారాంతరంబున ప్రభువునకుఁ దెలిసెనేని ఆనిక్షేపమంతయు ప్రభువు దీసుకొని దాఁచుకొన్న వానికి వానిశక్తికిఁదగినట్లు దండనము విధింపఁదగినది॥ ఒకవేళ భూమియందు ద్రవ్యమును పాతిపెట్టినవాఁడు వచ్చి ఆద్రవ్యము యొక్క రూపసంఖ్యాదులఁ దెలిపి ఆనిక్షేపము తనదని దృఢపఱచినయెడల మనూక్తప్రకారముగా ఆనిక్షేపమును వానికిప్పించి జాతికాలాద్యనుసారముగా ౬ వ పాలైనను ౧౨ వ పాలైనను ప్రభువు దీసుకొనవలయు॥

భూమియందు పాతిపెట్టిననిధి దొరికినయెడల చేయఁదగినక్రమము.

మూ. { దేయం చోరహృతం ద్రవ్యం రాజ్ఞా జానపదాయ తు।
అదదద్ధి సమాప్నోతి కిల్బిషం యస్య తస్య తత్॥ ౩౫ }

వ్యా॥ చోరహృతం ప్రత్యాహ॥ దేయమితి॥ చోరైర్హృతం ద్రవ్యం చోరేభ్యో విజిత్య జానపదాయ స్వదేశనివాసినే యస్య తత్తస్మై రాజ్ఞా దాతవ్యం - హి యస్మాదదదత్ యస్య తదపహృతం ద్రవ్యం తస్య కిల్బిషమాప్నోతి తస్య చోరస్య చ - యథాహ మనుః - దాతవ్యం సర్వవర్ణేభ్యో రాజ్ఞా చోరహృతం ధనం। రాజా తదుపభుంజానశ్చోరస్యాప్నోతి కిల్బిషమితి - యది చోరహస్తాదాదాయ స్వయముపభుఙ్క్తే తదా చోరస్య కిల్బిషమాప్నోతి - అథ చోరహృతముపేక్షతే తదా జానపదస్య కిల్బిషం - అథ చోరహృతాహరణాయ యతమానోపి న శక్నుయాత్తదా హర్తుర్యావత్తదాత్తావద్ధనం స్వకోశాద్దద్యాత్ - యథాహ గౌతమః - చోరహృతమపజిత్య యథాస్థానం గమయేత్ కోశాద్వా దద్యాదితి - కృష్ణద్వైపాయనోపి॥ ప్రత్యాహర్తుమశక్తస్తు ధనం చోరహృతం యది। స్వకోశాత్తద్ధి దేయం స్యాదశక్తేన మహీక్షితేతి॥ ౩౫

తా॥ ప్రభువు తనరాజ్యమందెవని ద్రవ్యమునైనను చోరుండు దొంగిలించినయెడల అట్టిచోరునిఁ బట్టి తెప్పించి ఆద్రవ్యమును ద్రవ్యస్వామికిప్పింపవలయు॥ అట్లుచేయక చోరునివలన ఆద్రవ్యమును రాఁబట్టి తానుదీసుకొన్నయెడల ఆచోరుఁడు చేసియున్న పాపమును ప్రభువు పొందును॥ అట్టి దొంగతనమును విచారింపక యుపేక్షించినయెడల ఆద్రవ్యస్వామియొక్క పాపమును ప్రభువు పొందును॥ చోరునిఁ బట్టుటకు ప్రభువు సాధ్యమైన ప్రయత్నము చేసినప్పటికిని ఆచోరుఁడు దొరకకపోయినను చోరుఁడు దొరికి వానివలన ద్రవ్యము రాకపోయినను ఆద్రవ్యమును ప్రభువు తనబొక్కసమునుండి యొత్తి ద్రవ్యస్వామికిప్పింపవలయునని తాత్పర్యము॥

చోరహృతద్రవ్యవిషయము.

❋ఇతి సాధారణాసాధారణరూపవ్యవహారమాతృకాసమాప్తా.❋

## ❋అథ ఋణాదానప్రకరణం.❋

మూ. { అశీతిభాగో వృద్ధిస్స్యాన్మాసి మాసి సబన్ధకే।
వర్ణక్రమాచ్ఛతం ద్వి త్రి చతుష్పఞ్చకమన్యథా॥ ౩౬ }

వ్యా॥ సాధారణాసాధారణరూపాం వ్యవహారమాతృకామభిధాయాధునాష్టాదశానాం వ్యవహారపదానామాద్యమృణాదానపదం దర్శయతి - అశీతిభాగో వృద్ధిస్స్యాదిత్యాదినా - మోచ్యఆధిస్తదుత్పన్నే ప్రవిష్టే ద్విగుణే ధన ఇత్యేవమంతేన॥ తచ్చ ఋణాదానం సప్తవిధం - ఈదృశమృణం దేయమీదృశమృణమదేయమనేనాధికారిణా దేయమస్మింత్సమయే దేయమనేన ప్రకారేణ దేయమిత్యర్థమర్ణే పఞ్చవిధముత్తమర్ణే దానవిధిరాదానవిధిశ్చేతి ద్వివిధమితి - ఏతచ్చ నారదేన స్పష్టీకృతం - ఋణం దేయమదేయంచ యేన యత్ర యథా చ యత్ - దానగ్రహణధర్మాశ్చ ఋణాదానమితి స్మృతమితి - తత్ర ప్రథమముత్తమర్ణస్య దానవిధిమాహ - తత్పూర్వకత్వాదితరేషాం॥ మాసి మాసి ప్రతిమాసం బన్ధకం విశ్వాసార్థమాధీయతే తద్బన్ధకమాధిరితి యావత్ - బన్ధకేన సహ వర్తత ఇతి సబన్ధకః ప్రయోగః తస్మింత్సబన్ధకే ప్రయోగే ప్రయుక్తస్య ద్రవ్యస్యాశీతితమో భాగో వృద్ధిర్ధర్మ్యా భవతి - అన్యథా బన్ధకరహితే ప్రయోగే వర్ణానాం బ్రాహ్మణాదీనాం క్రమేణ ద్వి త్రి చతుః పఞ్చకం శతం ధర్మ్యం భవతి - బ్రాహ్మణే ధమర్ణే ద్వికం క్షత్రియే త్రికం వైశ్యే చతుష్కం శూద్రే పఞ్చకం మాసి మాసీత్యేవ - ద్వౌవాత్రయోవాచత్వారోవాపఞ్చవా ద్వి త్రి చతుః పఞ్చాః - ద్వి త్రి చతుః పఞ్చా అస్మింఛతే వృద్ధిర్దీయ

త ఇతిద్వి త్రి చతుఃపంచకంశతం - తదస్మిన్మాసే వృద్ధ్యా ...యల్లాభః... యథాదీయత ఇతి కన్. ఇయంవృద్ధిర్మాసిమాసిగృహ్యమాణా కాలికా - ఇయమేవవృద్ధిర్దివసగణనయావిభజ్యప్రతిదివసంగృహ్యమాణా కాయికాభవతి-తథాచనారదేన-కాయికా కాలికా చైవ కారితా చ తథాపరా। చక్రవృద్ధిశ్చశాస్త్రేషుతస్యవృద్ధిశ్చతుర్విధేత్యుక్త్వోక్తం ॥కాయావిరోధినీశశ్వత్పణపాదాదికాయికా। ప్రతిమాసం స్రవంతీయావృద్ధిస్సాకాలికామతా ॥ వృద్ధిస్సాకారితానామయర్ణికేనస్వయంకృతా। వృద్ధేరపిపునర్వృద్ధిశ్చక్రవృద్ధిరుదాహృతేతి॥

తా ॥ ఈశ్లోకము మొదలుకొని ౬౩ వ-శ్లోకమువఱకుఋణాదానవ్యవహారము చెప్పఁబడుచున్నది॥ఆఋణాదానముఏడువిధములుగలదై యుండును । అదియెట్లనిన-ఈలాటియప్పుదీర్పవలయుననియు-ఈలాటియప్పుదీర్పనక్కఱలేదనియు - ఇట్టివాఁడప్పుదీర్పవలయుననియు-ఇట్టిసమయంబునఋణముదీర్పవలయుననియు- ఇవ్విధంబునఋణముదీర్పవలయుననియు-ఈరీతిగా * అధమర్ణవిషయమైఅయిదువిధంబులును । ఇవ్విధంబునఅప్పియ్యవలయుననియు. ఇవ్విధంబునమఱలఁదీసుకొనవలయుననియు-ఈరీతిగా § ఉత్తమర్ణవిషయమై రెండువిధంబులును గలవనినారదులచేఁ జెప్పఁబడియున్నది॥అందు-ఉత్తమర్ణుండప్పిచ్చువిధానము మొదటఁ జెప్పఁబడుచున్నది ॥ కుదవయుంచుకొనియప్పిచ్చినవాఁడు ప్రతిమాసంబును ౮౦ కి ౧ లెక్కనువడ్డీదీసుకొనుటధర్మ్యంబగును ॥ కుదవలేకయప్పిచ్చినవాఁడు ప్రతిమాసంబును బ్రాహ్మణునివలననూటికి రెండు లెక్కను - క్షత్రియునివలననూటికిమూఁడు లెక్కను- వైశ్యునివలననూటికినాలుగు లెక్కను - శూద్రునివలననూటికయిదు లెక్కను- వడ్డీదీసుకొనుటధర్మ్యంబగును॥ మఱియుదీనికి- కాయికవృద్ధి-కాలికవృద్ధి-కారితవృద్ధి-చక్రవృద్ధి-అనినాలుగుభేదములుగలవు-అందు-ఏదినమువడ్డియాదినమందుఁదీసుకొనఁబడెనేనిఅదికాయికవృద్ధి యనఁబడును - ప్రతిమాసమందునుదీసుకొనెడువడ్డికాలికవృద్ధియనఁబడును § ఉత్తమర్ణులు అధమర్ణులు తమయిష్టానుసారముగా నిర్ణయించుకొనెడువడ్డికారితవృద్ధియనఁబడును - వడ్డికి మఱల వడ్డిగట్టఁబడెనేని-అదిచక్రవృద్ధి యనఁబడును-ఇట్లునారదులచేఁ జెప్పఁబడియున్నది॥ ౩౭

మూ॰ కాంతారగాస్తుదశకంసాముద్రావింశకంశతమ్॥౩౮॥

వ్యా ॥ గృహీతృవిశేషేణవృద్ధేఃప్రకారాంతరమాహ ॥ కాంతారగాఇతి॥కాంతారమరణ్యంతత్రగచ్ఛంతీతికాంతారగాః - యే వృద్ధ్యాధనంగృహీత్వాధికలాభార్థమతిగహనం ప్రాణధనవినాశశంకాస్థానం ప్రవిశంతి తేదశకంశతందద్యుః-యేచసముద్రగాస్తే వింశకంశతం- మాసిమాసీత్యేవ-ఏతదుక్తంభవతి-కాంతారగేభ్యోదశకంశతంసాముద్రేభ్యశ్చవింశకంశతముత్తమర్ణఆదద్యాన్మూలవినాశస్యాపిశంకితత్వాదితి॥ ౩౮

తా ॥ అధికలాభార్థమై ప్రాణధనహానిశంకాస్పదమైన మహారణ్యమునకుఁబోయ్యెడివర్తకులు మొదలైనవారికిఅప్పిచ్చినయెడల ప్రతిమాసమునూటికిపదిలెక్కనువడ్డిదీసుకొనవచ్చును ॥ సముద్రమందు ఓడనెక్కిపోవుచుండెడువారికిఅప్పిచ్చినయెడల ప్రతిమాసమునూటికిఇరువదిలెక్కనువడ్డిదీసుకొనవచ్చును ॥ ఇట్టివారికిచ్చినమూలద్రవ్యముమఱలవచ్చుననినిశ్చయములేమిగనుక కొండొకవేళ రాకపోయినను - ఆయుత్తమర్ణునికినష్టముసంభవింపకుండవలయుఁగనుక ఈవిషయమై అధికముగావడ్డినీయవచ్చుననియభిప్రాయము॥ ౩౮

నూటికి౧౦-౨౦ వడ్డీదీసుకొనుట

మూ॰ దద్యుర్వాస్వకృతాంవృద్ధింసర్వేసర్వాసుజాతిషు॥౩౯॥

వ్యా ॥ ఇదానీంకారితాంవృద్ధిమాహ॥ దద్యురితి॥సర్వేబ్రాహ్మణాదయోఽధమర్ణాఅబంధకేసబంధకేవాస్వకృతాంస్వాభ్యుపగతాంవృద్ధింసర్వాసుజాతిషుదద్యుః - క్వచిదకృతాపివృద్ధిర్భవతి॥ యథాహనారదః॥నవృద్ధిఃప్రీతిదత్తానాం స్యాదనాకారితాక్వచిత్ । అనాకారితమప్యూర్ధ్వంవత్సరార్ధాద్వివర్ధతఇతి-యస్తుయాచితకంగృహీత్వా దేశాంతరంగతస్తంప్రతి కాత్యాయనేనో

* అధమర్ణుఁడనఁగాఅప్పు దీసుకొనువాఁడు ; ; § ఉత్తమర్ణుఁడనఁగాఅప్పిచ్చువాఁడు.

క్తం ॥ యాచితకమాదాయతమదత్వాదిశం ప్రజేత్ । ఊర్ధ్వంసంవత్సరాత్తస్య తద్ధనం వృద్ధిమాప్నుయాదితి । యశ్చయాచితకమాదాయ యాచితోఽప్యదత్వాదేశాంతరం యాతి తం ప్రతి తేనైవోక్తం । కృతోద్ధారమదత్వాయోయాచితస్తుదిశం ప్రజేత్ - ఊర్ధ్వం మాసత్రయాత్తస్య తద్ధనం వృద్ధిమాప్నుయాదితి - యః పునస్స్వదేశే స్థిత ఏవ యాచితో యాచితకం నదదాతి తం యాచనకాలాదారభ్య వృద్ధిం దాపయేద్రాజా-యథాహ ॥ స్వదేశేపిస్థితోయస్తునదద్యాద్యాచితః క్వచిత్ । తంతతోఽకారితాం వృద్ధిమనిచ్ఛంతం చ దాపయేదితి - అనాకారితవృద్ధేరపవాదో నారదేనోక్తః ॥ పణ్యమూల్యం భృతిర్న్యాసోదండో యశ్చ ప్రకల్పితః । వృథాదానాక్షికపణా వర్ధంతే నావివక్షితా ఇతి ;- అవివక్షితా అనాకారితా ఇతి ॥ ౩౭

స్వేచ్ఛగా వడ్డి నిర్ణయించుకొనుట.

తా ॥ బ్రాహ్మణాది సకలకులస్థులలో నెవరి యొద్దనైన వరప్పు దీసుకొన్నను - ఆయప్పునకు ఋదవయున్నను లేకున్నను - పూర్వోక్తనియమము లేక నేవారి వారియిష్టానుసారముగా వడ్డినిర్ణయించుకొనవచ్చును ॥ ఇది కారితవృద్ధి యనంబడును ॥ ——వడ్డినిర్ణయించుకొనక ప్రీతిపూర్వకముగా నియ్యంబడిన ద్రవ్యమునకు వడ్డిగట్ట గూడదనియు - మొదట వడ్డినిర్ణయించుకొనక యిచ్చి పిమ్మట వడ్డినపేక్షించినయెడల ఆఱు నెలల పిమ్మట ఆద్రవ్యమునకు వడ్డి గట్టవచ్చుననియును నారదస్మృతియందుఁ జెప్పఁబడియున్నది ॥ ఎరువు దీసుకొన్న సొమ్మునైనను-బదులు దీసుకొన్న ద్రవ్యమునైనను తిరుగా నియ్యక ఆతీసుకొన్నవాఁడు దేశాంతరము వెళ్లినయెడల - ఒకసంవత్సరమునకు పిమ్మట దానికి వడ్డిగట్టవచ్చుననియు - ఇచ్చినవాఁడడుగుచుండగా నేతీసుకొన్నవాఁడియ్యక దేశాంతరము వెళ్లినయెడల మూఁడు నెలల పిమ్మట దానికి వడ్డిగట్టవచ్చుననియు - తీసుకొన్నవాఁడు స్వదేశమందే యున్నయెడల ఇచ్చినవాఁడడిగిన దినము మొదలుకొని వడ్డిగట్టవచ్చుననియును కాత్యాయనస్మృతియందుఁ జెప్పఁబడియున్నది ॥ విక్రయింపఁదగిన వస్తువు యొక్క క్రయమునకును - జీతమునకును దాఁచఁబెట్టిన ద్రవ్యమునకును - అధికారి చే నిర్ణయింపఁబడిన దండనద్రవ్యమునకును - వ్యర్థముగా నిచ్చెదనని యొప్పుకొన్న ద్రవ్యమునకును-జూదమందు పందెమాడిన ద్రవ్యమునకును వీటికి మొదట వడ్డినిర్ణయించక యున్నయెడల నెప్పటికిని వడ్డి గలుగదని నారదులచేఁ జెప్పఁబడియున్నది ॥ ౩౮

ప్రీతిదత్తద్రవ్యవృద్ధి విషయము

ఎరువుగానైన బదులుగానైననిచ్చినదానికి వడ్డి గట్టుట.

వడ్డి లేనివి.

మూ. సంతతిస్తు పశుస్త్రీణాం ॥ ౩౯ ॥

వ్యా ॥ అధునా ద్రవ్యవిశేషే వృద్ధివిశేషమాహ ॥ సంతతిరితి ॥ పశూనాం స్త్రీణాం చ సంతతిరేవ వృద్ధిః ॥ పశూనాం స్త్రీణాం చ పోషణాసమర్థస్య తత్పుష్టిసంతతికామస్య ప్రయోగస్సంభవతి- గ్రహణం చ క్షీరపరిచర్యాద్యర్థినః ॥ ౩౯ ॥

తా ॥ కొన్ని ద్రవ్యముల వడ్డి ప్రకారాంతరముగాఁ జెప్పఁబడుచున్నది ॥ లోకమందెవరైనను తమ పశువులను స్త్రీలను పోషించుకొనఁజాలక మరియొకనికి అప్పుగా నిచ్చినయెడల - ఆ పశువులకును స్త్రీలకును గలిగెడు సంతానమే వడ్డి యౌనని తెలియవలయు ॥ అనఁగా పశువులనప్పు దీసుకొన్నవాఁడా పశువులఁ బోషించుచు తత్క్షీరము ననుభవించుచుండి యా పశుస్వామికి వలయునప్పుడున్న దూడలతోఁ గూడనా పశువులఁ దోలిపెట్టవలయుననియు - స్త్రీలనప్పు దీసుకొన్నవాఁడు-ఆ స్త్రీల వల్ల పనులు సేయించుకొనుచు వారినిఁ బోషించుచు - వారితో తాను క్రీడింపక-వారు రాత్రులయందు తమ తమ పతులతోడ క్రీడించుటకు విరోధము సేయకయుండి వారిపతులడిగినప్పుడు వారికిఁ గలిగియున్న సంతానముతోఁ గూడ నంపించవలయుననియును తాత్పర్యము

పశువులకును స్త్రీలకును వడ్డి

మూ. రసస్యాష్టగుణా పరా । వస్త్రధాన్యహిరణ్యానాం చతుస్త్రిద్విగుణా పరా ॥ ౪౦ ॥

వ్యా ॥ అధునా ప్రయుక్తస్య ద్రవ్యస్య వృద్ధిగ్రహణమంతరేణ చిరకాలావస్థితస్యైకస్య ద్రవ్యస్య కియతీ పరా వృద్ధిరిత్యపేక్షిత ఆహ ॥ రసస్య తైలఘృతాదేర్వృద్ధిగ్రహణమంతరేణ చిరకాలావస్థితస్య స్వకృతయా వృద్ధ్యా వర్ధమానస్యాష్టగుణా వృద్ధిః పరా- నాతః పరం వర్ధతే - తథా వస్త్రధాన్యహిరణ్యానాం యథాసంఖ్యం చతుర్గుణా త్రిగుణా ద్విగుణా చ వృద్ధిః పరా - వసిష్ఠేన తు రసస్య త్రై

గుణ్యముక్తం॥ ద్విగుణంహిరణ్యంత్రిగుణంధాన్యం-ధాన్యేనైవరసావ్యాఖ్యాతాఃపుష్పమూలఫలానిచతులాధృతమష్టగుణమితి- మనునాతుధాన్యస్యపుష్పమూలఫలాదీనాంచపంచగుణత్వముక్తం- ధాన్యేశదేలవవాహ్యానాతిక్రామతివంచతామితి-ధాన్యంక్షేత్రఫలంశదఃపుష్పమూలఫలాదిః- లవ్యామేషాణాచమరీకేశాదిః- వాహ్యాబలీవర్దతురగాదిః- ధాన్యశదలవవాహ్యవిషయావృద్ధిఃపంచగుణత్వంనాతిక్రామతీతి-తత్రాధమర్ణారోగ్యతావశేనదుర్భిక్షాదికాలవశేనవ్యవస్థాద్రష్టవ్యా.ఏతచ్చసకృత్ప్రయోగేసకృదాహరణేచవేదితవ్యం- పురుషాంతరసంక్రమణేనప్రయోగాంతరకరణే- తస్మిన్నేవవాపురుషేఅనేకశఃప్రయోగాంతరకరణేసువర్ణాదికంద్వైగుణ్యాద్యతిక్రమ్యపూర్వవద్వర్ధతే-సకృత్ప్రయోగేపిప్రతిదివసంప్రతిమాసంప్రతిసంవత్సరంవావృద్ధ్యాహరణేఅధమర్ణాదేయస్యద్వైగుణ్యాసంభవాత్-పూర్వాహృతవృద్ధ్యాసహద్వైగుణ్యమతిక్రమ్యవర్ధతఏవ- యథాహమనుః॥కుసీదవృద్ధిర్ద్వైగుణ్యంనాత్యేతిసకృదాహితేతి-సకృదాహృతేత్యపిపాఠోస్తి- ఉపచయార్థంప్రయుక్తంద్రవ్యంకుసీదంతస్యవృద్ధిఃకుసీదవృద్ధిర్ద్వైగుణ్యంనాత్యేతినాతిక్రామతియదిసకృదాహితాసకృత్ప్రయుక్తాపురుషాంతరసంక్రమణాదినాప్రయోగాంతరకరణేద్వైగుణ్యమత్యేతి-సకృదాహృతేతిపాఠేతుశనైశ్శనైఃప్రతిదినంప్రతిమాసంప్రతిసంవత్సరంవాఅధమర్ణాదాహృతాద్వైగుణ్యమత్యేతీతివ్యాఖ్యేయం-తథాగౌతమేనాప్యుక్తం-చిరస్థానేద్వైగుణ్యంప్రయోగస్యేతి- ప్రయోగస్యైకవచననిర్దేశాత్ప్రయోగాంతరకరణేద్వైగుణ్యాతిక్రమోభిప్రేతః-చిరస్థానఇతినిర్దేశాచ్ఛనైశ్శనైర్వృద్ధిగ్రహణేద్వైగుణ్యాతిక్రమోదర్శితః॥ ౩౯

తా॥ అప్పిచ్చినద్రవ్యమునకునిర్ణయించుకొన్నవడ్డీయివ్వడవ్వడుచెల్లకబహుకాలముజరిగినపక్షమందుపద్రవ్యమునకెంతమట్టుకువడ్డీపెరుగుననిన-చెప్పఁబడుచున్నది॥ మానెనెయ్యిమొదలుగాఁగలరసవస్తువులకుఎనిమిదంతలవఱకును-వస్త్రములకునాలుగంతలవఱకును-ధాన్యములకుమూఁడంతలవఱకునుధనమునకురెండంతలవఱకునువడ్డీపెరుగునుగానిపిమ్మటనెంతకాలముజరిగినను వడ్డీపెరుగదు॥వసిష్ఠులచేత- రసవస్తువులకుపుష్పమూలఫలాదులకుమూఁడంతలవఱకేవడ్డీపెరుగుననియు- తూఁచఁదగినయితరవస్తువులకుఎనిమిదంతలవఱకువడ్డీపెరుగుననియును జెప్పఁబడియున్నది॥ మనుస్మృతియందు- ధాన్యము- పుష్పమూలఫలాదులు- చిత్రకంబళచామరాద్యుపయుక్తములైనమేషరోమచమరీకేశాదులు- వృషభాశ్వాదులు-వీనికి-అయిదంతలవఱకువడ్డీపెరుగుననిచెప్పఁబడియున్నది॥ ఇట్లుపరస్పరభిన్నాభిప్రాయంబులైయున్నస్మృతులకుఅప్పుదీసుకొన్నవాఁడియారోగ్యమననుసరించియుదుర్భిక్షాదికాలములననుసరించియు- వ్యవస్థచేయఁదగినది అదియెట్లనిన- అప్పుదీసుకొన్నవాఁడుత్కృష్టవర్ణుండునుసదాచారసంపన్నుండునునైయుండికాలముదుర్భిక్షమైయున్నయెడలనేని ఎంతకాలమతిక్రమించినను వసిష్ఠోక్తప్రకారముగారసవస్తువులకు మూఁడంతలకుపైనవడ్డీదీసుకోఁగూడదు- అప్పుదీసుకొన్నవాఁడునికృష్టవర్ణుండునుదురాచారుండునునైయుండికాలమును సుభిక్షమైయుండెనేని యాజ్ఞవల్క్యోక్తప్రకారముగారసవస్తువులకుఅష్టగుణవృద్ధిదీసుకొనవచ్చును- అప్పుదీసుకొన్నవాఁడుశ్రేష్ఠుఁడైయుండికాలముసుభిక్షమైయున్నను అప్పుదీసుకొన్నవాఁడునికృష్టుఁడైయుండికాలముదుర్భిక్షమైయున్నను వసిష్ఠోక్తమైనవడ్డికిహెచ్చుగా యాజ్ఞవల్క్యోక్తమైనవడ్డికితక్కువగావడ్డీదీసుకోవలసినది॥ ఈరీతిగానే ధాన్యపుష్పమూలఫలాదివిషయమై మనువసిష్ఠులచేఁజెప్పఁబడినవృద్ధిభేదంబునకువ్యవస్థయూహింపఁదగినది॥ ఈనియమముఒకసారియిచ్చినయప్పునకొకసారిగావడ్డితోఁగూడఁదీసుకొనెడుఋణమునకేకాని యితరఋణమునకులేదు॥ ఒకఁడిచ్చినద్రవ్యంబొకఁడునైనమరియొకనికిచెల్లించునట్టులేర్పడినను- ఒకఁడుదీసుకొన్నద్రవ్యమునుమరియొకఁడుచెల్లించునట్టులేర్పడినను- ఒకపురుషుఁడేయనేకావర్తులిచ్చుచుఁబుచ్చుకొనుచున్నట్లేర్పడినను- ఒకఁడుదీసుకొనుచున్నను-ధనాదులకుపూర్వోక్తమైనద్విగుణాదివృద్ధికంటెనధికముగావడ్డీపెరుగుచుండును॥ ఒకసారియిచ్చినద్రవ్యమునకైననుప్రతిదినముగానిప్రతిమాసముగానిప్రతిసంవత్సరముగానివడ్డీదీసుకొనుచున్నపక్షమందు-ఈచెప్పఁబడిననియతిలేకయెంతయైననువడ్డీపెరుగుచుండును-మనుగౌతమవచనములయందును ఈయభిప్రాయమే తెలుపఁబడియున్నది॥ ౩౮

ఈద్రవ్యమునకెంత వడ్డీ పెరుగుననుట.

ఈచెప్పిననియతినతిక్రమించివడ్డీపెరుగుట.

మూ. { ప్రపన్నం సాధయన్నర్థం న వాచ్యో నృపతేర్భవేత్ ।
సాధ్యమానో నృపం గచ్ఛన్దండ్యో దాప్యశ్చ తద్ధనమ్ ॥* }

వ్యా॥ ఋణప్రసంగాద్ధర్మా ఉక్తాః సాంప్రతం ప్రయుక్తస్య ధనస్య గ్రహణధర్మ ఉచ్యతే ॥ ప్రపన్నమితి ॥ ప్రపన్నమభ్యుపగతమధమర్ణేన ధనం సాక్ష్యాదిభిర్భావితం వా సాధయన్ప్రత్యాహరన్ధర్మాదిభిరుపాయైరుత్తమర్ణో నృపతేర్న వాచ్యో నివారణీయో న భవతి - ధర్మాదయశ్చోపాయా మనునా దర్శితాః ॥ ధర్మేణ వ్యవహారేణ ఛలేనాచరితేన చ । ప్రయుక్తం సాధయేదర్థం పంచమేన బలేన చేతి ॥ ధర్మేణ ప్రీతియుక్తేన సత్యవచనేన - వ్యవహారేణ సాక్షిలేఖ్యాద్యుపన్యాసేన - ఛలేనోత్సవాదివ్యాజేన భూషణాదేర్గ్రహణేన - ఆచరితేనాభోజనేన - పంచమేనోపాయేన బలేన నిగళబంధనాదినా - ఉపచయార్థం ప్రయుక్తం ద్రవ్యమేతైరుపాయైరాత్మసాత్కుర్యాదితి - ప్రపన్నం సాధయన్నర్థం న వాచ్య ఇతి వదన్నప్రతిపన్నం సాధయన్రాజ్ఞా నివారణీయ ఇతి దర్శయతి - ఏతదేవ స్పష్టీకృతం కాత్యాయనేన ॥ పీడయేద్యో ధనీ కశ్చిదృణికం న్యాయవాదినం । తస్మాదర్థాత్స హీయేత తత్సమం చాప్నుయాద్దమమితి ॥ యస్తు ధర్మాదిభిరుపాయైః ప్రపన్నమర్థం సాధ్యమానో యాచ్యమానో నృపం గచ్ఛేత్ - రాజానమభిగమ్య సాధయంతమభియుంక్తే స దండ్యో భవతి శక్త్యనుసారేణ ధనినే తద్ధనం దాప్యశ్చ రాజ్ఞా - దాపనే చ ప్రకారా దర్శితాః ॥ రాజా తు స్వామినే విప్రం సాంత్వేనైవ ప్రదాపయేత్ । దేశాచారేణ చాన్యాంస్తు దుష్టాన్సంపీడ్య దాపయేత్ ॥ రిక్థినం సుహృదం వాపి ఛలేనైవ ప్రదాపయేదితి ॥ సాధ్యమానో నృపం గచ్ఛన్నిత్యేతత్ స్మృత్యాచారవ్యపేతేనేత్యస్య ప్రత్యుదాహరణం బోద్ధవ్యమ్ ॥ ౩౯

అప్పిచ్చినద్రవ్యమును మఱలఁదీసుకొను క్రమము.

ధర్మాద్యుపాయములు.

తా॥ అప్పిచ్చిన ద్రవ్యమును మఱలఁదీసుకొను క్రమం బెట్లనిన ॥ అధమర్ణుండు తనంతటఁ గాని సాక్షిలిఖితాది సాధనములచేతఁ దప్పించుకొనఁజాలక గాని యియ్యవలసినది సత్యమని యొప్పుకొనియున్న ధనమును మనూక్తములైన ధర్మాద్యుపాయములచేత నుత్తమర్ణుండు సాధించుకొనుచుండఁగా ప్రభువు వానిని వారింపఁగూడదు ॥ ఆయుపాయములెవ్వియనిన ॥ ౧-ధర్మము - అనఁగా ప్రీతియుక్తములయిన సత్యవచనములు పలుకుట ॥ ౨ వ్యవహారము- అనఁగా పత్రమున్నది సాక్షులున్నారు అనునిత్యాది వచనములు పలుకుట ॥ ౩ ఛలము-అనఁగా అప్పు దీర్చుమని యడుగక యుత్సవాదుల పేరు సెప్పి భూషణాదులు దీసుకొనుట ॥ ౪ అభోజనము-అనఁగా నా ద్రవ్యము నిచ్చువఱకు నేను భుజింపనని వానియింట గూర్చుండుట ॥ ౫ బలము-అనఁగా నిగళబంధనాదులచే నిర్బంధించుట ॥ ఈయుపాయములచే నుత్తమర్ణుండు తన ద్రవ్యము రాఁబట్టుకొనవచ్చును ॥ ఇట్లు చెప్పుటవలన అధమర్ణుండు తనంతటఁ గాని సాక్షిలిఖితాదులవల్లఁ గాని ఒప్పుకొనకయున్న ధనమును ఉత్తమర్ణుండు ధర్మాద్యుపాయములచేత సాధింపం బూనినయెడల ప్రభువు నివారింపవలయునని యర్థమగుచున్నది ॥ ఈయర్థమున కనుకూలముగా నే కాత్యాయనస్మృతియందు న్యాయవాదియైన యధమర్ణుని బాధించినయుత్తమర్ణునికి ప్రకృతార్థహానియు తత్సమానదండనంబును జెప్పఁబడియున్నది ॥ అధమర్ణుం డెట్టులయినను ఒప్పుకొనియున్న ధనమును ఉత్తమర్ణుండు పూర్వోక్తములైన యుపాయములచే సాధించునపుడు ఆయధమర్ణుండు ఉత్తమర్ణునిమీఁద వివాదము దెచ్చినపక్షమందు ప్రభువా యధమర్ణునికి దండనము విధించి యుత్తమర్ణునికి ఋణద్రవ్యము నిప్పింపవలసినది ॥ ఆయిప్పించువిధం బెట్లనిన-అధమర్ణుఁడు బ్రాహ్మణుఁడై యున్నపక్షమందు మంచిమాటలచేత నిప్పింపవలసినది ॥ ఇతరవర్ణుండై యున్నపక్షమందు దేశాచారప్రకారముగా నిప్పింపవలసినది దుష్టుఁడై యున్నపక్షమందు బాధించి యిప్పింపవలసినది- దాయాదుఁడై కాని స్నేహితుఁడై కాని యున్నపక్షమందు కపటముచేత నిప్పింపవలసినది ॥ ౩౯

ఉత్తమర్ణునిమీఁద వివాదము దెచ్చినవానికి దండనము.

మూ. { గృహీతానుక్రమాద్దాప్యో ధనినామధమర్ణికః । ద
త్త్వా తు బ్రాహ్మణాయైవ నృపతేస్తదనంతరమ్ ॥౪౦ }

వ్యా॥ బహుషూత్తమర్ణికేషు యుగపత్ప్రాప్తేష్వేకోఽధమర్ణికః కేన క్రమేణ దాప్య ఇత్యాకాంక్షిత ఆహ ॥ గృహీతేతి ॥ సమానజాతీయేషు ధనిషు యేనైవ క్రమేణ ధనం గృహీతం తేనైవ క్రమేణాధమర్ణికో దాప్యో రాజ్ఞా - భిన్నజాతీయేషు తు బ్రాహ్మణాదిక్రమేణ ॥

ఉత్తమర్ణులు పెక్కండ్రు గూడిరేని అప్పునీచుక్రమము,

తా॥ పెక్కండ్రుత్తమర్ణులొకనివల్ల ద్రవ్యము రావలెనని యనేక కాలంబున వివాదము దెచ్చినపక్షమందు భూపాలుడట్టి యధమర్ణునివల్ల ద్రవ్యమునిప్పించవలసినక్రమము॥ ఆయుత్తమర్ణులు సమానజాతీయులై యుండిరేని వారిలో నెవనివల్లముందర అప్పుదీసుకొనఁబడియుండునో వానికిముందిప్పించి వెనుకటి వారికి వెనుకవరుసఁగానిప్పించవలసినది వారుభిన్నజాతీయులై యుండిరేని బ్రాహ్మణాదివర్ణక్రమముగా నిప్పించవలసినది

మూ. { రాజ్ఞాధమర్ణికో దాప్యస్సాధితాద్దశకం శతమ్ । పంచ
కంచ శతం దాప్యః ప్రాప్తార్థో హ్యుత్తమర్ణికః ॥౪౧॥ }

వ్యా॥ యదా పునరుత్తమర్ణోధమర్ణేన ప్రతిపన్నమర్థం ధర్మాదిభిరుపాయైస్సాధయితుమశక్తశ్చేద్రాజ్ఞా సాధితార్థో ధమర్ణిక... దాధమర్ణస్య దండముత్తమర్ణస్య చ భృతిదానమాహ॥ రాజ్ఞేతి॥ అధమర్ణికో రాజ్ఞా ప్రతిపన్నార్థాత్సాధితాద్దశకం శతం దాప్యః। ప్రతిపన్నస్య సాధితస్యార్థస్య దశమమంశం రాజ్ఞాధమర్ణికాద్దండరూపేణ గృహ్ణీయాదిత్యర్థః। ఉత్తమర్ణికస్తు ప్రాప్తార్థః పంచకం శతం భృతిరూపేణ దాప్యః। సాధితస్యార్థస్య వింశతితమం భాగముత్తమర్ణాద్రాజా భృత్యర్థం గృహ్ణీయాదిత్యర్థః। అప్రతిపన్నే సాధనే తు షండవిభాగో దర్శితో నిహ్నవే భావితో దద్యాదిత్యాదినా॥ ౪౧

అధమర్ణుండొప్పుకొనియున్న యప్పునిప్పించినరాజు నను వాదిప్రతివాదులీవలసినద్రవ్యము.

తా॥ అధమర్ణుండెట్టులైననియ్యవలసినది వాస్తవమని యొప్పుకొనియున్న ద్రవ్యమును ఉత్తమర్ణుండుపూర్వోక్తములైన ధర్మాద్యుపాయములచేత రాఁబట్టుకొనఁజాలనివాఁడై వ్యవహారము తెచ్చెనేని భూవల్లభుండాఋణద్రవ్యమునుత్తమర్ణునికిప్పించి అధమర్ణునివలన దండనరూపముగా నూటికిపది లెక్కను ఉత్తమర్ణునివలన భృతిరూపముగా నూటికైదు లెక్కను ద్రవ్యముఁదీసుకొనవలసినది॥ అధమర్ణుఁడొప్పుకొనకయున్న యప్పునిప్పించువిషయమై రాజు చేనిర్ణయింపఁదగిన ధనదండనము (౧౧వ) శ్లోకమందుఁజెప్పఁబడియున్నది॥ ౪౧

మూ. { హీనజాతిం పరిక్షీణమృణార్థం కర్మ కారయేత్ । బ్రా
హ్మణస్తు పరిక్షీణశ్శనైర్దాప్యో యథోదయమ్॥౪౨॥ }

వ్యా॥ సధనమధమర్ణికం ప్రత్యుక్తమధునా నిర్ధనమధమర్ణికం ప్రత్యాహ॥ హీనజాతిమితి॥ బ్రాహ్మణాదిజాతిరుత్తమర్ణో హీనజాతిం క్షత్రియాదిం పరిక్షీణం నిర్ధనమృణార్థమృణనిష్కృత్యర్థం కర్మ స్వజాత్యనురూపం కారయేత్తత్కుటుంబావిరోధేన। బ్రాహ్మణః పునః పరిక్షీణో నిర్ధనశ్శనైశ్శనైర్యథోదయం యథాసంభవమృణం దాప్యః। అత్ర హీనజాతిగ్రహణం సమజాతేరప్యుపలక్షణం। అతశ్చ సమజాతిమపి పరిక్షీణం యథోచితం కర్మ కారయేత్। బ్రాహ్మణగ్రహణం శ్రేయోజాతేరుపలక్షణం। అతశ్చ క్షత్రియాదిరపి పరిక్షీణో వైశ్యాదేశ్శనైశ్శనైర్దాప్యో యథోదయం। ఏతదేవ స్పష్టీకృతం మనునా॥ కర్మణాపి సమం కుర్యాద్ధనికేనాధమర్ణికః। సమోపకృష్టజాతిశ్చ దద్యాచ్ఛ్రేయాంస్తు తచ్ఛనైరితి। ఉత్తమర్ణేన సమం నివృత్తోత్తమర్ణాధమర్ణవ్యవదేశమాత్రాన్న ధమర్ణః కర్మ కారయితవ్య ఇత్యర్థః॥ ౪౨

నిర్ధనుండైన అధమర్ణునివల్లపనులు సేయించుట. తనకంటెనధికవర్ణునివల్లపనులు సేయింపఁగూడదు

తా॥ అధమర్ణుఁడు నిర్ధనుండై యుండెనేని వాఁడుఉత్తమర్ణునికంటె హీనజాతీయుఁడై కాని సమానజాతీయుఁడై కాని యున్నపక్షమందు వానివల్ల జాత్యుచితములైన పనులు సేయించుకొనుచు వానికిచ్చు వేతనమందు వానికుటుంబజీవనాంశముపోఁగామిగిలిన ద్రవ్యమువల్ల తనయప్పుదీర్చుకొనవలయు॥ అధమర్ణుండుత్తమర్ణునికంటెనుత్తమవర్ణుండై యున్నపక్షమందు మెల్లమెల్లగా వానికిఁగలిగినప్పుడు దీసుకొనవలెనుగాని వానివల్ల పనులు సేయింపఁగూడదు॥ ఈయర్థమే మనువచనమందును జెప్పఁబడియున్నది॥ ౪౨

మూ. { దీయమానం న గృహ్ణాతి ప్రయుక్తం యః స్వకం ధనమ్ । మధ్య
స్థాపితం తత్స్యాద్వర్ధతే న తతః పరమ్॥ ౪౩॥ }

వ్యా॥ కించ - దీయమానమితి॥ ఉపచయార్థం ప్రయుక్తం ధనమధమర్ణేన దీయమానముత్తమర్ణో వృద్ధిలోభాద్యది న గృహ్ణాతి - తదా అధమర్ణేన మధ్యస్థహస్తే స్థాపితం యది స్యాత్తదా తతః స్థాపనాదూర్ధ్వం న వర్ధతే. అథ స్థాపితమపి యాచ్యమానో న దదాతి తతః పూర్వవద్వర్ధత ఏవ॥ ౪౩

అప్పుదీర్చ వచ్చినపుడు దీసుకొనని వాని విషయము.

తా॥ అధమర్ణుండు వడ్డికిం దీసుకొనియున్న ద్రవ్యమునియ్యవచ్చినపుడు ఉత్తమర్ణుండు వృద్ధ్యాశచేత ఆద్రవ్యమును దీసుకొనక పోయినపక్షమందు అధమర్ణుండా ద్రవ్యమును మధ్యస్థునియొద్దనుంచె నేని పిమ్మట వడ్డి పెరుగదు॥ అయితే మధ్యస్థునియొద్దనుంచిన వెనుక ఉత్తమర్ణుండడిగినపుడియ్యనిపక్షమందు మరల నెప్పటివలె వడ్డి పెరుగుచుండును॥ ౪౩॥

మూ. { అవిభక్తైః కుటుంబార్థే యదృణం తు కృతం భవేత్ । దద్యు
స్తద్రిక్థినః ప్రేతే ప్రోషితే వా కుటుంబిని॥ ౪౪॥ }

వ్యా॥ ఇదానీం దేయమృణం యద్దాయేన చ దేయం తదాహ॥ అవిభక్తైరితి॥ అవిభక్తైర్బహుభిః కుటుంబభరణార్థమేకేన యదృణం కృతం భవేత్తదృణం కుటుంబీ దద్యాత్ - తస్మిన్ ప్రేతే ప్రోషితే వా తద్రిక్థినస్సర్వే దద్యుః॥ ౪౪

అప్పుదీర్చవలసివారు.

తా॥ అవిభక్తులై యున్న యనేకులలోఁ గొందఱిచేతఁగాని యొకనిచేతఁగాని కుటుంబరక్షణార్థమై చేయఁబడిన ఋణమును ఆకుటుంబనిర్వాహకుఁడు దీర్చవలసినది॥ అట్లు తీర్చకయా కుటుంబనిర్వాహకుఁడు లోకాంతరగతుండైనను దేశాంతరగతుండైనను తద్దాయాహర్హులై యున్నవారందఱు ఋణమును దీర్చవలసినది॥ ౪౪

మూ. { న యోషిత్పతిపుత్రాభ్యాం న పుత్రేణ కృతం పితా । ద
ద్యాదృతే కుటుంబార్థాన్న పతిః స్త్రీకృతం తథా॥ ౪౫॥ }

వ్యా॥ యేన దేయమిత్యత్ర ప్రత్యుదాహరణమాహ॥ నేతి॥ పత్యా కృతమృణం యోషిద్భార్యా నైవ దద్యాత్ - పుత్రేణ కృతం యోషిన్మాతా న దద్యాత్ - తథా పుత్రేణ కృతం పితా న దద్యాత్ - తథా భార్యాకృతం పతిర్న దద్యాత్ - కుటుంబార్థాదృతే ఇతి సర్వత్ర శేషః - అతశ్చ కుటుంబార్థం యేనకేనాపి కృతం తత్కుటుంబినా దేయం - తదభావే తద్దాయహరైర్దేయమిత్యుక్తమేవ॥ ౪౫

కుటుంబార్థముగాని యప్పును కుటుంబము వారు దీర్చనక్కఱలేదు

తా॥ కుటుంబార్థముగాక కార్యాంతరమును గురించి భర్త చేసిన ఋణమును భార్యగాని కొమారుఁడు చేసిన ఋణమును తల్లిదండ్రులుగాని - భార్య చేసిన ఋణమును భర్తగాని తీర్చవలసినది లేదు॥ కుటుంబార్థమై ఆకుటుంబము వారిలో నెవరు ఋణము చేసినను పూర్వశ్లోకోక్త ప్రకారముగా ఆకుటుంబద్రవ్యమును బొందువారందఱు తీర్చవలసినవారయ్యెయుందురు॥ ౪౫

మూ. { సురాకామద్యూతకృతం దండశుల్కావశిష్టకమ్ । వృథా
దానం తథైవేహ పుత్రో దద్యాన్న పైతృకమ్॥ ౪౬॥ }

వ్యా॥ పుత్రపౌత్రైరృణం దేయమితి వక్ష్యతి - తస్య పురస్తాదపవాదమాహ॥ సురేతి॥ సురాపానే యత్కృతమృణం కామకృతం స్త్రీవ్యసనేన కృతం - ద్యూతేన పరాజయనిమిత్తం దండశుల్కయోరవశిష్టం - వృథాదానం ధూర్తబందిమల్లాదిభ్యో యత్ప్రతిజ్ఞాతం - ధూర్తే బందిని మల్లే చ కువైద్యే కితవే శఠే । చాటుచారణచోరేభ్యో దత్తం భవతి నిష్ఫలమితి స్మరణాత్. ఏతదృణం పిత్రా కృతం పుత్రాదిభిః శౌండికాదిభ్యో న దద్యాత్ - అత్ర దండశుల్కావశిష్టకమిత్యవశిష్టగ్రహణాత్సర్వం దాతవ్యమితి న మంతవ్యం॥ దండం వా దండశేషం వా శుల్కం తచ్ఛేషమేవ వా । న దాతవ్యం తు పుత్రేణ యచ్చ న వ్యావహారికమిత్యౌశనసస్మరణాత్ - గౌతమేనాప్యుక్తం - మద్యశుల్కద్యూత

గండానపుత్రాన్ తథ్యావహేయురితి-నపుత్రపౌత్రైరపరిహార్యమిత్యర్థః- అనేనాదేయమృణముక్తం॥ ౪౭

తా॥ పుత్రపౌత్రులు పితృపితామహులఋణమును దీర్చవలయునని (౪౫వ) శ్లోకమందుఁ జెప్పఁబడెను గనుక అందుకొన్ని ఋణములను పుత్రపౌత్రాదులు దీర్చనక్కఱలేదని యిచ్చటఁ జెప్పఁబడుచున్నది॥ సురాపానము-కామము-జూదము-రాజదండనము-సుంకము-వృథాదానము-వీనినిమిత్తమై తండ్రి చేసియున్న ఋణమును పుత్రుఁడు దీర్చనక్కఱలేదు॥ ఈయర్థము గౌతమాదులచేతను జెప్పఁబడియున్నది॥ వంచకుఁడు, స్తుతిపాఠకుఁడు, జెట్టి, కుత్సితవైద్యుఁడు, జూదరి, మూర్ఖుఁడు, హాస్యకాఁడు, బట్టువాఁడు, చోరుఁడు, ఇట్టివారికి చేసిన దానము నిష్ఫలంబగునని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియున్నది, ౪౮

పుత్రపౌత్రులకక్కఱలేని ఋణములు.

వృథాదానము.

మూ॥ గోపశౌండికశైలూషరజకవ్యాధయోషితామ్। ఋణం దద్యాత్పతిస్తాసాం యస్మాద్వృత్తిస్తదాశ్రయా॥

వ్యా॥ పతిః స్త్రీకృతం తథేత్యస్యాపవాదమాహ॥ గోపేతి॥ గోపో గోపాలకః-శౌండికస్సురాకారః-శైలూషో నటః-రజకో వస్త్రనిర్ణేజకః-వ్యాధో మృగయుః-ఏతేషాం యోషిద్భిర్యదృణం కృతం తత్పతిభిర్దేయం-యస్మాత్తేషాం వృత్తిర్జీవనం తదాశ్రయా యోషిదధీనా-యస్మాద్వృత్తిస్తదాశ్రయేతి హేతువ్యపదేశాదన్యేపి యే యోషిదధీనజీవనాస్తేపి యోషిత్కృతమృణం దద్యురితి గమ్యతే॥

తా॥ గొల్ల, యీడిగ, నట్టువ, చాకలి, బోయ, కొలములయందును ఈలాగే స్త్రీయాధీనజీవనములై యున్న యితరకులములయందును భార్య చేసిన ఋణమును భర్త దీర్చవలసినది.

కొన్నికులములయందు భార్య చేసినయప్పును భర్త దీర్చవలె

మూ॥ ప్రతిపన్నం స్త్రియా దేయం పత్యా వా సహ యత్కృతమ్। స్వయం కృతం వా యదృణం నాన్యత్ స్త్రీ దాతుమర్హతి॥౪౯॥ ❁❁❁❁

వ్యా॥ పతికృతం భార్యా న దద్యాదిత్యస్యాపవాదమాహ॥ ముమూర్షుణా ప్రవత్స్యతా వా పత్యా నియుక్తయా ఋణదానే యత్ప్రతిపన్నం తత్ప్రతికృతమృణం దేయం-యచ్చ పత్యా సహ భార్యయా ఋణం కృతం తదపి భర్తురభావే భార్యయా అపుత్రయా దేయం యచ్చ స్వయమేవ కృతమృణం తదపి దేయం-నను ప్రతిపన్నాదిత్రయం స్త్రియా దేయమితి న చ వక్తవ్యం నిర్ధనత్వాభావాత్-ఉచ్యతే। భార్యా పుత్రశ్చ దాసశ్చ త్రయ ఏవాధనాస్స్మృతాః। యత్తే సమధిగచ్ఛంతి యస్య తే తస్య తద్ధనమితి స్మరణాన్నిర్ధనత్వేన ప్రతిపన్నాదిష్వదానాశంకాయామిదముచ్యతే-ప్రతిపన్నం స్త్రియా దేయమిత్యాది-న చానేన వచనేన స్త్ర్యాదీనాం నిర్ధనత్వమభిధీయతే। పారతంత్ర్యమాత్రప్రతిపాదకత్వాత్। ఏతచ్చ విభాగప్రకరణే స్పష్టీకరిష్యతే। నాన్యత్ స్త్రీ దాతుమర్హతీత్యేతదపి న వక్తవ్యం-ఏకత్ర విధానే నాన్యత్ర ప్రతిషేధసిద్ధేః। ఉచ్యతే। ప్రతిపన్నం స్త్రియా దేయం పత్యా వా సహ యత్కృతమిత్యస్య నియమార్థముచ్యతే। అన్యత్సురాకామనిమిత్తం ప్రతిపన్నమపి పత్యా సహకృతమపి న దేయమితి॥ ౪౯

తా॥ ౪౬వ-శ్లోకమందు భర్త చేసిన ఋణము భార్యకక్కఱలేదని చెప్పఁబడెను గనుక యిచ్చట దానికపవాదము చెప్పఁబడుచున్నది॥ భర్త లోకాంతరమునకుఁగాని దేశాంతరమునకుఁగాని పోవునపుడు నీవీయప్పు దీర్చవలయునని యాజ్ఞాపించఁగా భార్య తీర్చెదనని యొప్పుకొన్న పక్షమందు-అట్టియప్పును భార్య తీర్చవలసినది - భర్తతోఁగలసి తాను తీసిన యప్పును భర్తృపుత్రాదులు లేనిపక్షమందు స్త్రీ తీర్చవలసినది- తాను స్వతంత్రించి తీసిన యప్పును స్త్రీ తీర్చవలసినది-తక్కిన యప్పులను స్త్రీ తీర్చనక్కఱలేదు॥ ఈ యప్పులను స్త్రీ తీర్చవలయునని చెప్పుటవల్లనే తక్కిన యప్పులను దీర్చనక్కఱలేదని యర్థమౌనుగదా మరల (నాన్యత్ స్త్రీ దాతుమర్హతి) అని చెప్పుటవలన ౪౬వ శ్లోకమందు నిషిద్ధమైయున్న సురాపానాదినిమిత్తమైన పతిఋణమును పతియెదుట నొప్పుకొనియున్నను పతితోఁగలసి తీసియున్నను భార్య తీర్చనక్కఱలేదని యర్థమౌచున్నది॥

స్త్రీ తీర్చవలసిన యప్పులు

మూ. {పితరి ప్రోషితే ప్రేతే వ్యసనాభిప్లుతేపి వా। పుత్రపౌత్రైః
ర్ఋణం దేయం నిహ్నవే సాక్షిభావితమ్॥౪౯॥}

వ్యా॥ పునరపి యదృణం దాతవ్యం యేన చ దాతవ్యం యత్ర చ కాలే దాతవ్యం తత్త్రితయమాహ। పితరీతి॥ పితా యది దాతవ్యమృణమదత్త్వా ప్రోషితో దూరదేశం గతః - ప్రేతో మృతః - అచికిత్సనీయవ్యాధ్యాద్యభిభూతో వా - తదా తత్కృతమృణమవశ్యం దేయం పుత్రేణ పౌత్రేణ వా - పితృధనాభావేపి పుత్రత్వేన పౌత్రత్వేన చ - తత్ర క్రమోప్యయమేవ। పిత్రభావే పుత్రః పుత్రాభావే పౌత్ర ఇతి - పుత్రేణ పౌత్రేణ వా నిహ్నవే కృతే అర్థినా సాక్ష్యాదిభిర్భావితమృణం దేయం పుత్రపౌత్రైరిత్యన్వయః। అత్ర పితరి ప్రోషిత ఇత్యేతావదుక్తం కాలవిశేషస్తు నారదేనోక్తో ద్రష్టవ్యః॥ నార్వాక్సంవత్సరాద్వింశాత్పితరి ప్రోషితే సుతః। ఋణం దద్యాత్పితృవ్యే వా జ్యేష్ఠే భ్రాతర్యథాపి వేతి - ప్రేతే వ్యప్రాప్తవ్యవహారకాలో న దద్యాత్ - ప్రాప్తవ్యవహారకాలస్తు దద్యాత్ - స చ కాలస్తేనైవ దర్శితః॥ గర్భస్థైస్సదృశో జ్ఞేయ ఆష్టమాద్వత్సరాచ్ఛిశుః। బాల ఆషోడశాద్వర్షాత్పౌగండశ్చేతి శబ్ద్యతే। పరతో వ్యవహారజ్ఞస్స్వతంత్రః పితరావృత ఇతి। యద్యపి పితృమరణాదూర్ధ్వం బాలోపి స్వతంత్రో జాతస్తథాపి నర్ణభాగ్భవతి। యథాహ। అప్రాప్తవ్యవహారశ్చేత్స్వతంత్రోపి హి నర్ణభాక్। స్వాతంత్ర్యం హి స్మృతం జ్యేష్ఠే జ్యైష్ఠ్యం గుణవయః కృతమితి। తథాసేధాహ్వాననిషేధశ్చ దృశ్యతే। అప్రాప్తవ్యవహారశ్చ మత్తోన్మత్తార్తవ్యసనినాం రాజ్యాదుచ్చాస్త్విషా? దానోన్మత్తో వ్రతీ। విషమస్థశ్చ నాసేధ్యో న చైతానాహ్వయేన్నృప ఇతి - తస్మాత్। తతః పుత్రేణ జాతేన స్వార్థముత్సృజ్య యత్నతః। ఋణాత్పితా మోచనీయో యథా నో నరకం వ్రజేదితి - పుత్రేణ వ్యవహారజ్ఞతయా జాతేన నిష్పన్నేనేతి వ్యాఖ్యేయం। శ్రాద్ధే తు బాలస్యాప్యధికారః - న బ్రహ్మాభివ్యాహారయేదన్యత్ర స్వధానినయనాదితి గౌతమస్మరణాత్ - పుత్రపౌత్రైరితి బహువచననిర్దేశాద్బహవః పుత్రా యది విభక్తాస్తదా స్వాంశానురూపేణ ఋణం దద్యుః - అవిభక్తాశ్చేత్సంభూయ సముత్థానేన గుణప్రధానభావేన వా వర్తమానానాం ప్రధానభూత ఏవ దద్యాదితి గమ్యతే - యథాహ నారదః॥ అత ఊర్ధ్వం పితుః పుత్రా ఋణం దద్యుర్యథాంశతః। విభక్తా వా ఽవిభక్తా వా యస్తాం చోద్వహతే ధురమితి - అత్ర చ యద్యపి పుత్రపౌత్రైర్ఋణం దేయమిత్యవిశేషేణోక్తం - తథాపి యథా పితా సవృద్ధికం దదాతి - తథైవ పుత్రేణ ఋణం దేయం పౌత్రేణ మూలమేవ దాతవ్యం న వృద్ధిరితి విశేషోవగంతవ్యః - ఋణమాత్మీయవత్పిత్ర్యం పుత్రైర్దేయం విభావితం। పైతామహం సమం దేయమదేయం తత్సుతస్య తు ఇతి బృహస్పతివచనాత్। తత్ర విభావితమిత్యవిశేషేణోపాదానాత్సాక్షిభావితమిత్యత్ర సాక్షిగ్రహణం ప్రమాణోపలక్షణం - సమం యావద్గృహీతం తావద్దేయం న వృద్ధిస్తత్సుతస్య ప్రపౌత్రస్యాదేయమగృహీతధనస్య - ఏతచ్చోత్తరశ్లోకే స్పష్టీకరిష్యతే॥ ౪౯

తా॥ తండ్రి. తాను జేసిన ఋణము దీర్చక దేశాంతరగతుండైనను లోకాంతరగతుండైనను చికిత్సనర్హవ్యాధిపీడితుండైయున్నను వాని ఋణమును పుత్రుండు దీర్చవలసినది॥ పుత్రుండును తండ్రివలెనయిన పక్షమందు పౌత్రుండా ఋణము దీర్చవలసినది - వీరు పితృపితామహద్రవ్యమును పొందనివారైయున్నను ఋణమును మాత్రము తీర్చకయుండఁగూడదు - పితృఋణమును పుత్రుండుగాని పితామహఋణమును పౌత్రుండుగాని లేదన్నపక్షమందు ఉత్తమర్ణుండు సాక్ష్యాదిసాధనముల వల్ల ఆ ఋణము వాస్తవమని స్థిరపఱచెనేని ఆ పుత్రుండుగాని పౌత్రుండుగాని చెల్లించి తీరవలసినది॥ తండ్రియైనను పినతండ్రి పెత్తండ్రులయినను అన్నయైనను - దేశాంతరగతులైనపక్షమందు ఇరువది సంవత్సరముల వఱకు వారియప్పును పుత్రాదులు దీర్చనక్కఱ లేదని నారదస్మృతియందుఁ జెప్పఁబడియున్నది॥ తండ్రి మృతిఁబొందిన పక్షమందు పుత్రుండు వ్యవహారజ్ఞత లేని బాలుండైయుండెనేని వాఁడు తనకు పదియాఱు సంవత్సరముల వయసు వచ్చిన తర్వాత పితృఋణము దీర్చవలయును గాని తత్పూర్వము తీర్చనక్కఱ లేదు॥ అది యేమన్నను - ఎనిమి దేడులకు లోఁబడినవాఁడు గర్భగతమైన భ్రూణముతో సమానమైన శిశువనంబడుననియు - పదియాఱేడులకు లోఁబడినవాఁడు బాలుండని పౌగండుఁడని చెప్పఁబడుననియు - తరువాత వ్యవహారజ్ఞుండును స్వతంత్రుండు నగుననియు నారదస్మృతియందుఁ జెప్పఁబడియున్నది॥ అయితే పితృమరణానంతరము పుత్రుండు బాలుండైయున్నను స్వతంత్రుఁడే యవుచున్నాఁడు - అయినను వ్యవహారజ్ఞత లేమింజేసి ఋణముదీర్పనర్హుండు గాఁడని స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియున్నది॥ మఱియు-వ్యవహారజ్ఞత లేని బాలుఁడు-మత్త-దానోన్ముఖుఁడు-వ్రత

అప్పుదీర్చుకాలము.

పుత్రపౌత్రులు ఋణము దీర్చవలయు.

ష్ఠుఁడు - విషమస్థుఁడు - వీరికి ఋణము రాయి పెట్టఁగూడదనియు వీరిని సమనుచేసి రాజసభకు రప్పింపఁగూడదనియు స్మృత్యంతరమందుఁ జెప్పఁబడియున్నది - కాఁబట్టి (తతః పుత్రేణ జాతేన) అను వచనమునకు పుత్రుఁడు వ్యవహారజ్ఞుఁడు కాఁగానే యొట్టయి ననుతండ్రి ఋణమును దీర్చి యా ఋణమువల్ల తండ్రికిఁ గలుగు నరకమును నివర్తింపఁ జేయవలయుననియభిప్రాయము గాని పుట్టఁగానే తండ్రి ఋణము దీర్చవలయుననియభిప్రాయము గాదు ॥ ప్రాప్తాధికారము మాత్రము బాలుఁడై యున్నను పుత్రుని కేకలిగియుండునని గౌతమసూత్రమువల్ల తెలియవచ్చుచున్నది ॥ పుత్రపౌత్రైః - అను బహువచనమువల్ల - పుత్రులుగాని పౌత్రులుగాని యనేకులుండిరేని వారు విభక్తులై యున్నపక్షమందు వారివారి భాగప్రకారముగా ఋణము దీర్చవలయుననియు - అవిభక్తులై యున్నపక్షమందు వారిలో కుటుంబనిర్వాహకుఁడై యున్నవాఁడు ఋణము దీర్చవలయుననియు నారదవచనానుసారముగా తాత్పర్యం బూహింపఁదగినది ॥ ఇచ్చట పుత్రపౌత్రులు ఋణము దీర్చవలయునని సామాన్యముగాఁ జెప్పియున్నను బృహస్పతివచనానుసారముగా పుత్రుఁడు వడ్డితోడఁ దీర్చవలసినదనియు - పౌత్రుఁడు మొదలు మాత్రము తీర్చవలసినదనియు గ్రహింపవలసినది ॥ ప్రపౌత్రుఁడు ఋణము దీర్చనక్కఱలేదని బృహస్పతివచనమునఁ జెప్పఁబడియున్నది గాని యది తన ప్రపితామహద్రవ్యమును బొందని వానివిషయము ననుకత ద్రవ్యమును బొందియున్నపక్షమందు ప్రపౌత్రుఁడు ఋణము దీర్చవలసినదేయని తెలియవలయు ॥ మతియు నీవిషయము నుత్తరశ్లోకమందు స్పష్టముగాఁ జెప్పంబడును ॥ ౪౯

అప్పు దీర్చుటయందు పుత్రాదులకుఁ గల భేదములు

మూ. { రిక్థగ్రాహ ఋణం దాప్యో యోషిద్గ్రాహస్తథైవ చ । పు
త్రో నన్యాశ్రితద్రవ్యః పుత్రహీనస్య రిక్థినః ॥ ౫౦ }

వ్యా ॥ ఋణాపకరణే ఋణీ తత్పుత్రః పౌత్ర ఇతి త్రయః కర్తారో దర్శితాస్తేషాం చ సమవాయే క్రమో దర్శితః ఇదానీం కర్త్రంతరసమవాయే చ క్రమమాహ ॥ రిక్థగ్రాహ ఇతి ॥ అన్యదీయం ద్రవ్యం స్వస్వత్వాపాదకవ్యతిరేకేణ యత్స్వం భవతి తద్రిక్థం - విభాగద్వారేణ రిక్థం గృహ్ణాతీతి రిక్థగ్రాహః । స ఋణం దాప్యః ఏతదుక్తం భవతి యో యదీయం ద్రవ్యం రిక్థరూపేణ గృహ్ణాతి స తత్కృతమృణం దాప్యః - నపార్వ్యదినేతి - యోషితం భార్యాం గృహ్ణాతీతి యోషిద్గ్రాహస్తథైవ ఋణం దాప్యః । యో యదీయాం యోషితం గృహ్ణాతి స తత్కృతమృణం దాప్యః । యోషితోఽభాజ్యద్రవ్యత్వేన రిక్థవ్యపదేశానర్హత్వాత్పృథగుపాదానం - పుత్రశ్చానన్యాశ్రితద్రవ్యో దాప్యః । అన్యమాశ్రితమన్యాశ్రితం మాతాపితృసంబంధి ద్రవ్యం యస్యాసావన్యాశ్రితద్రవ్యః - న అన్యాశ్రితద్రవ్యోఽనన్యాశ్రితద్రవ్యః - పుత్రహీనస్య రిక్థిన ఋణం దాప్య ఇతి సంబంధః । ఏతేషాం సమవాయే క్రమశ్చ పాఠక్రమ ఏవ - రిక్థగ్రాహ ఋణం దాప్యస్తదభావే యోషిద్గ్రాహః తదభావే పుత్ర ఇతి - నన్వేతేషాం సమవాయ ఏవ నోపపద్యతే - న భ్రాతరో న పితరః పుత్రా రిక్థహరాః పితురితి - పుత్రే సత్యన్యస్య రిక్థగ్రహణాసంభవాత్ - యోషిద్గ్రాహోఽపి నోపపద్యతే । న ద్వితీయశ్చ సాధ్వీనాం క్వచిద్భర్తోపదిశ్యత ఇతి స్మరణాత్ । తదృణం పుత్రో దాప్య ఇత్యప్యయుక్తం । పుత్రపౌత్రైర్ఋణం దేయమిత్యుక్తత్వాత్ - అనన్యాశ్రితద్రవ్య ఇతి విశేషణమప్యనర్థకం పుత్రే సతి ద్రవ్యస్యాన్యాశ్రయణాసంభవాత్ - సంభవే చ రిక్థగ్రాహ ఇత్యనేనైవ గతార్థత్వాత్ - పుత్రహీనస్య రిక్థిన ఇత్యేతదపి న వక్తవ్యం - పుత్రే సత్యపి రిక్థగ్రాహ ఋణం దాప్య ఇతి స్థితమసతి పుత్రే రిక్థగ్రాహస్సుతరాం దాప్య ఇతి సిద్ధమేవేతి - అత్రోచ్యతే । పుత్రే సత్యప్యన్యో రిక్థగ్రాహస్సంభవతి - క్లీబాంధబధిరాదీనాం పుత్రత్వేఽపి రిక్థహరత్వాసంభవాత్ । తథా చ క్లీబాదీననుక్రమ్య అతీతానాగతాస్త్వనిరంశకా ఇతి వక్ష్యతి । తథాన్యజాపుత్రోఽప్యన్యాయవృత్తోంఽశం న లభేతైకేషామితి గౌతమవచనాత్ । అతశ్చ క్లీబాదిషు పుత్రేషు సత్స్వన్యాయవృత్తే చ సవర్ణాపుత్రే సతి రిక్థగ్రాహి పితృవ్యతత్పుత్రాదిః । యోషిద్గ్రాహోఽపి యద్యపి శాస్త్రవిరోధేన న సంభవతి । తథాప్యతిక్రాంతనిషేధః పూర్వవత్కృతదాపకరణాధికారీ భవత్యేవ - యోషిద్గ్రాహో యశ్చతసృణాం స్వైరిణీనామంతిమాం గృహ్ణాతి యశ్చ పునర్భువాం తిసృణాం ప్రథమాం - యథాహ నారదః ॥ పరపూర్వాః స్త్రియస్త్వన్యాస్సప్త ప్రోక్తా యథాక్రమమ్ । పునర్భూస్త్రివిధా తాసాం స్వైరిణీ తు చతుర్విధా । కన్యైవాక్షతయోనిర్యా పాణిగ్రహణదూషితా । పునర్భూః ప్రథమా ప్రోక్తా పునస్సంస్కారకర్మణా । దేశధర్మానవేక్ష్య స్త్రీ గురుభిర్యా ప్రదీయతే ఉత్పన్నసాహసాన్యస్మై సా ద్వితీయా ప్రకీర్తితా ॥ ఉత్పన్నసాహసా ఉత్పన్నవ్యభిచారా - అసత్సు దేవరేషు స్త్రీ బాంధవైర్యా ప్రదీయ

తే - సవర్ణాయ సపిండాయ సా తృతీయా ప్రకీర్తితా ॥ స్త్రీ ప్రసూతా ప్రసూతా వా పత్యావేవ తు జీవతి। కామాత్సమాశ్రయేదన్యం ప్రథమా స్వైరిణీ తు సా ॥ కౌమారం పతిముత్సృజ్య యా త్వన్యం పురుషం శ్రితా। పునః పత్యుర్గృహం యాయాత్సా ద్వితీయా ప్రకీర్తితా ॥ మృతే భర్తరి తు ప్రాప్తాన్ దేవరాదీనపాస్య యా। ఉపగచ్ఛేత్పరం కామాత్సా తృతీయా ప్రకీర్తితా ॥ ప్రాప్తా దేశాద్ధనక్రీతా క్షుత్పిపాసాతురా తు యా। తవాహమిత్యుపగతా సా చతుర్థీ ప్రకీర్తితా ॥ అంతిమా స్వైరిణీనాం యా ప్రథమా చ పునర్భువాం। ఋణం తయోః పతికృతం దద్యాద్యస్తే ఉపాశ్రిత ఇతి ॥ తథాన్యోపి యోపి గ్రాహ ఋణాపకరణాధికారీ తేనైవ దర్శితః - యా తు న ప్రథమైవ స్త్రీ సాపత్యా వాన్యమాశ్రయేత్। సోస్యా దద్యాదృణం భర్తురుత్సృజేద్వా తథైవ తామితి - ప్రకృష్టేన ధనేన సహ వర్తత ఇతి సప్రధనా - బహుధనేతి యావత్ - తథా ॥ అధనస్య హ్యపుత్రస్య మృతస్యోపైతి యః స్త్రియం। ఋణం వోఢుః స భజతే సైవ చాస్య ధనం స్మృతమితి - పుత్రస్య పునర్వచనం క్రమార్థం - అనన్యాశ్రితద్రవ్య ఇతి బహుపుత్రేషు సత్సు రిక్థాభావే ప్యంశగ్రహణయోగ్యస్యైవ ఋణాపకరణాధికారో నాయోగ్యస్యాంధాదేరిత్యేవమర్థం - పుత్రహీనస్య రిక్థిన ఇత్యేతదపి పుత్రపౌత్రహీనస్య ప్రపౌత్రాదయో యది రిక్థం గృహ్ణంతి తదర్ణం దాప్యా నాన్యథేత్యేవమర్థం - పుత్రపౌత్రైస్తు రిక్థగ్రహణాభావేపి దాప్యా ఇత్యుక్తం - యథాహ నారదః ॥ క్రమాదభ్యాగతం ప్రాప్తం పుత్రైర్యన్నర్ణముద్ధృతం। దద్యుః పైతామహం పౌత్రాస్తచ్చతుర్థాన్నివర్తత ఇతి - సర్వం నిరవద్యం ॥ యదా యోపి ద్రవ్యగ్రాహాభావే పుత్రో దాప్య ఇత్యుక్తం - తస్యాభావే యోషిద్గ్రాహో దాప్య ఇత్యుచ్యతే - పుత్రహీనస్య రిక్థిన ఇతి - రిక్థశబ్దేన యోషిదేవోచ్యతే - సైవ చాస్య ధనం స్మృతమితి స్మరణాత్ - యో యస్య హరతే దారాంస్స తస్య హరతే ధనమితి చ - నను యోషిద్గ్రాహాభావే పుత్ర ఋణం దాప్యః - పుత్రాభావే యోషిద్గ్రాహ ఇతి పరస్పరం విరుద్ధం - ఉభయసద్భావే నకశ్చిద్దాప్య ఇతి నైష దోషః - అంతిమ స్వైరిణీగ్రాహిణః ప్రథమ పునర్భూగ్రాహిణః సప్రధన స్త్రీహారిణశ్చాభావే పుత్రో దాప్యః - పుత్రాభావే తు నిర్ధననిరపత్యయోషిద్గ్రాహో దాప్య ఇతి - ఏతదేవోక్తం నారదేన ॥ ధనస్త్రీహారిపుత్రాణామృణభాగ్యో ధనం హరేత్। పుత్రోసతోః స్త్రీధనినోః స్త్రీహారీ ధనిపుత్రయోరితి ॥ ధనస్త్రీహారిపుత్రాణాం సమవాయే యో ధనం హరేత్స ఋణభాక్ - పుత్రోసతోః స్త్రీధనినోః - స్త్రీ చ ధనం చ స్త్రీధనే తే విద్యేతే యయోస్తౌ స్త్రీధనినౌ తయోః స్త్రీధనినోరసతోః పుత్ర ఏవ ఋణభాక్ - ధనిపుత్రయోరసతోః స్త్రీహార్యేవ ఋణభాక్ - స్త్రీహార్యభావే పుత్ర ఋణభాక్ - పుత్రాభావే స్త్రీహారీతి - విరోధప్రతిభాసపరిహారః పూర్వవత్ ॥ పుత్రహీనస్య రిక్థిన ఇత్యస్యాన్యా వ్యాఖ్యా - ఏతే ధనస్త్రీహారిపుత్రా ఋణం కస్య దాప్యా ఇతి వివక్షాయాముత్తమర్ణస్య దాప్యాస్తదభావే తత్పుత్రాదేః పుత్రాద్యభావే కస్య దాప్యా ఇత్యపేక్షాయామిదముపతిష్ఠతే - పుత్రహీనస్య రిక్థిన ఇతి పుత్రాద్యన్వయహీనస్యోత్తమర్ణస్య యో రిక్థీ రిక్థగ్రహణయోగ్యః సపిండాదిస్తస్య రిక్థినో దాప్యాః తథా చ నారదేన ॥ బ్రాహ్మణస్య తు యద్దేయం సాన్వయస్య న చాస్తి సః। నిర్వాపయేత్సకుల్యేషు తదభావేస్య బంధుష్విత్యభిధాయాభిహితం - యదా తు న సకుల్యాస్స్యుర్న చ సంబంధిబాంధవాః। తదా దద్యాద్ద్విజేభ్యస్తు తేష్వసత్స్వప్సు నిక్షిపేదితి ॥ ౨౦

తా ॥ అప్పుడిచ్చుటకు, అధమర్ణుఁడు వాని పుత్రపౌత్రులు - ఈ ముగ్గురును - వరుసగా కర్తలగుచుందురని పూర్వశ్లోకమందుఁ జెప్పఁబడెను గదా - ఈ శ్లోకమందు మరికొందఱు కర్తలు వరుసగాఁ జెప్పఁబడుచున్నారు ॥ అదియెట్లనిన - దాయవిభాగప్రకరణమందలి (క్లీబోథపతిత స్తజ్జః) అను శ్లోకమందున పుంసకుఁడు జాతిభ్రష్టుఁడు మొదలైన వారు పుత్రులైయున్నను వారు దాయార్హులు గారని చెప్పఁబడును గనుకను గౌతమసూత్రమందు సమానజాతీయుగాలైన భార్యయందుఁ బుట్టినవాఁడైనను అన్యాయవృత్తుఁడైన పుత్రుఁడు భాగార్హుండు గాఁడని చెప్పఁబడియున్నది గనుకను - ఇట్టి దాయార్హత లేని పుత్రులుండినప్పటికిని వాని ద్రవ్యము పితృవ్యతత్పుత్రాదులకుఁ జేరును గనుక అపుడా ద్రవ్యమును బొందినవారే వాని ఋణమప్పు దీర్చవలసినది కాని ద్రవ్యమును బొందని పుత్రాదులు దీర్చనక్కఱలేదు ॥

ద్రవ్యగ్రాహకుఁడప్పు దీర్చవలయును

అట్టి ద్రవ్యగ్రాహకుఁడు లేని పక్షమందు - అధమర్ణుని భార్య, శాస్త్రనిషిద్ధమార్గంబున నవలంబించి చతుర్విధస్వైరిణులలోఁ గడపటిదై కాని త్రివిధపునర్భువులలో మొదటిదై కాని ధనవంతురాలై కాని పరపురుషుని యొద్దఁ జేరిన యెడల - అట్టి స్త్రీని గ్రహించినవాఁడు దాని మొగని యప్పు దీర్చవలసినది ॥ ఈ విషయము నారదస్మృతియందు స్పష్టముగా నున్నది। అదియెట్లనిన - పరపురుషుఁడును మొగఁడును గల స్త్రీలు - ఏడు విధములుగాఁ జెప్పఁబడియున్నారు - అందు పునర్భువులు మూఁడు విధములు

భార్యాగ్రాహకుఁడప్పు దీర్చవలయును.

గానుందురు - స్వైరిణులు నాలుగువిధములుగానుందురు ॥ ఒకనికి పెండ్లిచేసుకొనిరజస్వలగా కముందర నేమరలమఱియొకని పెండ్లాడిన స్త్రీ మొదటిపునర్భువనంబడును ॥ వివాహము చేసుకొనిపరపురుషులఁబొందుచుండెడు స్త్రీని దేశకాలధర్మమునువిచారించి పెద్దలుగురు వొకనికిచ్చినపక్షమందు ఆ స్త్రీ రెండవపునర్భువనంబడును ॥ మగఁడుగతించినతర్వాతను అఁదులు లేనిపక్షమందుసమానవర్ణుండును సపిండుండునునగునొకనికిబంధువులిచ్చినపక్షమందుఆ స్త్రీ మూఁడవపునర్భువనంబడును॥——ఏ స్త్రీ యైననుబిడ్డగన్నదైకాని లేనిదైకా మొగఁడుబ్రతికియుండఁగా కామోద్రేకమువల్లఁజను మొగనిఁగూడెనేనిఆ స్త్రీ మొదటిస్వైరిణియనంబడును ॥ చిన్నవాఁడైయున్న మొగనివిడనాడి అన్యు మొగనిఁబొందుచుండి మరల తనమొగనియింటికివచ్చినస్త్రీ రెండవస్వైరిణియనంబడును ॥ మొగఁడుగతించినతర్వాత మఱఁది మొదలైనవారిని విడిచి కామమువల్లపరపురుషునిఁబొందినస్త్రీ మూఁడవస్వైరిణియనంబడును॥ మొదట నొకనిచేతకొనఁబడియున్న స్త్రీ క్షుత్పిపాసాపీడితురాలై మఱియొకనియొద్దఁజేరి నేనునీదాననైయుండెదనని చెప్పెనేని ఆ స్త్రీ నాలవస్వైరిణియనంబడును ॥ ఈస్వైరిణులలోకడపటిస్వైరిణినిగాని పునర్భువులలో మొదటిపునర్భువునుగాని స్వీకరించినవాఁడు దానిమొగని కప్పనిచ్చవలసినది ॥ ఇదియునుంగాక యేస్త్రీ యైననుమిక్కిలిధనవంతురాలై ఆధనముతోఁగాని బిడ్డలతోఁగాని పరపురుషునియొద్దఁజేరినయెడలదానిస్వీకరించినవాఁడుదానిమొగనియప్పుదీర్చవలసినది - అట్లుతీర్చలేనిపక్షమందుఆ స్త్రీ తెచ్చియున్నధనాదులతోఁగూడదానిమగనికంపించవలసినది ॥ ధనహీనుండును పుత్రహీనుండునునై మృతిఁబొందిన వానిభార్యను గ్రహించినవాఁడుఆ స్త్రీ యేతనకుధనమనితలంచి దాని మొగనియప్పుదీర్చవలసినది ॥ ఇట్లు నారదులచేఁ జెప్పఁబడియున్నది॥

త్రివిధపునర్భూలక్షణములు.

చతుర్విధస్వైరిణీలక్షణములు.

—— అట్టిస్త్రీగ్రాహకుఁడు లేనిపక్షమందు అధమర్ణుఁడు ద్రవ్యహీనుఁడై గతించినప్పటికిని వానిపుత్రులలో దాయాహరణత లేనిపుంసకుఁడు జాత్యంధుఁడు భ్రష్టుఁడు మొదలైనవారుదప్పతక్కినవారు - స్వార్జితద్రవ్యమువల్లతండ్రిఋణమును దీర్చవలసినది॥ ఈప్రకారమే పౌత్రుఁడును పితామహఋణమునుదీర్చవలసినదని వ్యాసశ్లోకమందుఁ జెప్పఁబడియున్నదిగదా॥——అధమర్ణుఁడుతనపుత్రపౌత్రులుగతించినతరువాత మృతిఁబొందివానిద్రవ్యము ప్రపౌత్రునికిఁజేరినపక్షమందుఆప్రపౌత్రుఁడే వానిఋణమును దీర్చవలసినది- అయితే ప్రపితామహుఁడు ద్రవ్యహీనుఁడై మృతిఁబొందినపక్షమందు వానిఋణము ప్రపౌత్రుఁడు దీర్చనక్కఱలేదు॥——పుత్రహీనస్య రిక్థినః) అనెడు వాక్యమునకు మఱియొక యర్థము॥అధమర్ణుఁడుపుత్రహీనుఁడై దరిద్రుఁడై మృతిఁబొందినపక్షమందు వానిభార్యపుత్రధనహీనురాలైనప్పటికిని దానిపరిగ్రహించినవాఁడు ఆవనితయే తనకుధనమని తలంచి దాని మొగనియప్పుదీర్చవలసినది॥ ఇచ్చట రిక్థి యనఁగా స్త్రీనిస్వీకరించినవాఁడనియర్థము॥——పుత్రహీనస్యరిక్థినః-అనెడు వాక్యమునకు మఱియొక యర్థము॥ఉత్తమర్ణుఁడుపుత్రపౌత్రహీనుఁడై గతించినపక్షమందుఆఋణద్రవ్యమును వానిదాయాదులకుఁ జెల్లించవలసినది॥మఱియునీవిషయమైనారదస్మృతియందుబ్రాహ్మణునికిఁజెల్లవలసినద్రవ్యమునుఆ బ్రాహ్మణుఁడు లేనిపక్షమందుతత్పుత్రపౌత్రాదులకుఁ జెల్లించవలసినదనియు - వారు లేనిపక్షమందు వానిదాయాదులకుఁ జెల్లించవలసినదనియు॰ వారును లేనిపక్షమందు వానిబంధువులకుఁ జెల్లించవలసినదనియు - వారును లేనిపక్షమందు బ్రాహ్మణులకియ్యవలసినదనియు-బ్రాహ్మణులుదొరకని పక్ష

ద్రవ్యహీనునిఋణమునుపుత్రపౌత్రులుదీర్చవలెను.

ప్రపౌత్రుఁడు ద్రవ్యగ్రాహకుఁడయ్యేనేని అప్పుదీర్చవలెను

పుత్రధనహీనునియప్పునుధనస్త్రీగ్రాహకుండైనఁదీర్చవలె

పుత్రహీనుఁడైగతించినవానిఋణద్రవ్యంబెవరికిజెల్లించవలయు.

ముందా ద్రవ్యమునునీటియందుఁబోసిబుణవిముక్తిచేసుకొనవలసినదనియును జెప్పఁబడియున్నది॥ . . . . . . . . . . . . . ౫౦

మూ. { భ్రాతౄణామథదంపత్యోః పితుః పుత్రస్యచైవహి। ప్రా
తిభావ్యమృణంసాక్ష్యమవిభక్తేనతుస్మృతమ్॥ ౫౧॥ }

వ్యా॥ అధునాపురుషవిశేషేణుణగ్రహణంప్రతిషేధయన్ ప్రసంగాదన్యదపి ప్రతిషేధతి॥ భ్రాతౄణామితి॥ ప్రతిభువోభావః ప్రాతిభావ్యం - భ్రాతౄణాందంపత్యోః పితాపుత్రయోశ్చావిభక్తే ద్రవ్యే ద్రవ్యవిభాగాత్ప్రాక్-ప్రాతిభావ్యమృణంసాక్ష్యంచన స్మృతం మన్వాదిభిః- అపితుప్రతిషిద్ధం - సాధారణధనత్వాత్ - ప్రాతిభావ్యసాక్ష్యయోఃపక్షే ద్రవ్యవ్యయావసానత్వాదృణస్యచావశ్యప్రదేయత్వాత్। ఏతచ్చపరస్పరానుమతివ్యతిరేకేణ। పరస్పరానుమత్యాత్వవిభక్తానామపిప్రాతిభావ్యాదిభవత్యేవ - విభాగాదూర్ధ్వంతుపరస్పరానుమతివ్యతిరేకేణాపిభవతి - ననుదంపత్యోర్విభాగాత్ప్రాక్ప్రాతిభావ్యాది ప్రతిషేధోనయుజ్యతే - తయోర్విభాగాభావేనవిశేషణానర్థక్యాత్ - విభాగాభావశ్చాపస్తంబేనదర్శితః- జాయాపత్యోర్నవిభాగోవిద్యతఇతి-సత్యం- శ్రౌతస్మార్తాగ్నిసాధ్యేషుకర్మసుతత్ఫలేషుచవిభాగాభావః- నపునస్సర్వకర్మసుద్రవ్యేషుచ- తథాహి-జాయాపత్యోర్నవిభాగోవిద్యతఇత్యుక్త్వాకిమితినవిద్యతఇత్యపేక్షాయాంహేతుముక్తవాన్ - పాణిగ్రహణాద్ధిసహత్వంకర్మసుతథాపుణ్యఫలేషుచేతి।హియస్మాత్పాణిగ్రహణాదారభ్యకర్మసుసహత్వంశ్రూయతే - జాయాపతీఅగ్నీమాదధీయాతామితితస్మాదాధానేసహాధికారాదాధానసిద్ధాగ్నిసాధ్యేష్వపికర్మసుసహాధికారః- తథా-కర్మస్మార్తంవివాహాగ్నౌకుర్వీతప్రత్యహంగృహీతిస్మరణాత్-వివాహసిద్ధాగ్నిసాధ్యేష్వపికర్మసుసహాధికారపివాతశ్చోభయవిధాగ్నినిరపేక్షేషుకర్మసుపూర్తేషుజాయాపత్యోఃపృథగేవాధికారస్సంపద్యతే-తథాపుణ్యానాంఫలేషుస్వర్గాదిషుజాయాపత్యోస్సహత్వంశ్రూయతే।దివిజ్యోతిరజరమారభేతామిత్యాది-యేషుపుణ్యకర్మసుసహాధికారస్తేషాంఫలేషుసహత్వమితిబోద్ధవ్యం - నపునఃపూర్తానాంభర్త్రనుజ్ఞయానుష్ఠితానాంఫలేష్వపి-నచద్రవ్యస్వామిత్వేపిసహత్వముక్తంద్రవ్యపరిగ్రహేషుచ - నహిభర్తుర్విప్రవాసేనైమిత్తికేదానేస్తేయముపదిశంతీతి-సత్యం - ద్రవ్యస్వామిత్వంపత్న్యాదర్శితమనేన-నపునర్విభాగాభావః యస్మాద్ద్రవ్యపరిగ్రహేషుచేత్యుక్త్వాతత్రకారణముక్తం-భర్తుర్విప్రవాసేనైమిత్తికేవశ్యకర్తవ్యేదానేతిథిభోజనభిక్షాప్రదానాదౌయస్మాన్నస్తేయముపదిశంతిమన్వాదయస్తస్మాద్భార్యాయాఅపిద్రవ్యస్వామిత్వమస్తిఅన్యథాస్తేయంస్యాదితి। తస్మాద్భర్తురిచ్ఛయాభార్యాయాఅపిద్రవ్యవిభాగోభవత్యేవనస్వేచ్ఛయా యథావక్ష్యతి-యదికుర్యాత్సమానంశాన్పత్న్యఃకార్యాస్సమాంశికాఇతి

తా॥ కొండటివిషయమైఅప్పుదీసుకొనుటయు-ప్రస్తావవశంబున-మరికొన్నికార్యములునునిషేధింపఁబడుచున్నవి

కొండటివిషయమైబుణసాక్ష్యాదినిషేధము

అన్నదమ్ములు, భార్యాభర్తలు. పితాపుత్రులు, వీరు అవిభక్తులైయుండఁగానొకనికొకఁడుజామీనుఁడుటగానిఅప్పిచ్చుటగానిసాక్ష్యముచెప్పుటగానికూడదు॥ అయితేయీకార్యములు పరస్పరానుమతిలేకజరిగింపఁగూడదుగాని పరస్పరానుమతిచేత జరిగింపవచ్చును-విభక్తులైనతర్వాతపరస్పరానుమతిలేకున్నను జరిగింపవచ్చును॥ —— భార్యాభర్తలకువిభాగమేలేదనిఆపస్తంబాదులచేఁ జెప్పఁబడియుండఁగా అవిభక్తులైనభార్యాభర్తలకుబుణాదికార్యములుజరగఁగూడదనిచెప్పుటఅసంగతముగానున్నదియనెడునాక్షేపమునకుసమాధానంబెట్లనిన[ జాయాపత్యోర్నవిభాగోవిద్యతే] అనెడుఆపస్తంబసూత్రమునకు భార్యాభర్తలకుసహాధికారముగల శ్రౌతస్మార్తాగ్నికర్మములయందును తత్ఫలములయందునువిభాగములేదనితాత్పర్యముగాని సర్వకర్మములయందును ద్రవ్యములయందునువిభాగములేదనితాత్పర్యముగాదు కాఁబట్టిఉభయవిధాగ్నినిరపేక్షంబులైయున్న తటాకవనప్రతిష్ఠాదిపుణ్యకర్మములయందును ద్రవ్యములయందునుభర్త్రనుజ్ఞచేత భార్యకువిభాగముగలుగవచ్చును-కనుక నేదాయవిభాగప్రకరణమందు( పత్న్యఃకార్యాస్సమాంశికాః. )అనిచెప్పఁబడియున్నది॥ ౫౧

దంపతులకుకొన్నికర్మలయందు విభాగములేదుగానిద్రవ్యాది విభాగముగలదు.

మూ. { దర్శనేప్రత్యయేదానే ప్రాతిభావ్యంవిధీయతే।
ఆద్యౌతువితథేదాప్యావితరస్యసుతాఅపి॥ ౫౨॥ }

వ్యా ॥ అధునా ప్రాతిభావ్యం నిరూపయితుమాహ ॥ దర్శన ఇతి ॥ ప్రాతిభావ్యం నామ విశ్వాసార్థం పురుషాంతరేణ సహ సమయః - తచ్చ విషయభేదాత్త్రిధా భిద్యతే - యథా దర్శనే దర్శనాపేక్షాయామేనం దర్శయిష్యామీతి - ప్రత్యయే విశ్వాసే మత్ప్రత్యయేనాస్య ధనం ప్రయచ్ఛ - నాయం త్వాం వంచయిష్యతే - యతోఽముకస్య పుత్రోఽయముర్వరా ప్రాయభూరస్య గ్రామవరోఽస్తీతి - దానే యద్యయం న దదాతి తదాహమేవ ధనం దాస్యామీతి - ప్రాతిభావ్యం విధీయత ఇతి ప్రత్యేకం సంబధ్యతే - ఆద్యౌ తు దర్శనప్రత్యయప్రతిభువౌ వితథే అన్యథాభావే - అదర్శనే విశ్వాసవ్యభిచారే చ దాప్యౌ రాజ్ఞా ప్రస్తుతం ధనముత్తమర్ణస్య - ఇతరస్య దానప్రతిభువస్సుతా అపి దాప్యాః । వితథే ఇత్యేతచ్చాత్యేన నిర్ధనత్వేన వా అధమర్ణే ప్రతిభువి మృతే - ఇతరస్య సుతా అపి తత్పుత్రా పూర్వయోస్సుతా న దాప్యా ఇత్యుక్తం భవతి - సుతా ఇతి పదేన పౌత్రా దాప్యా ఇతి దర్శితమ్ ॥ ౫౨

తా ॥ ప్రాతిభావ్యమనఁగా నొకనికిప్పిచ్చునపుడు వానియందు నమ్మకము లేక మఱియొకనిఁ బూటకాఁపుగా నేర్పఱచుకొనుట [అనఁగా జామీను] ఈపూటకాఁపులు విషయభేదమువలన మూఁడువిధములుగా నేర్పడుదురు - అది యెట్లనిన - ఈ ఋణికుని జూపుమన్నపుడు నేఁజూపెదనని యొప్పుకొను వాఁడు చూపుడు పూటకాఁపు - నాయందలి నమ్మకము చేత వీనికప్పిమ్ము - వీఁడు నిన్ను మోసపుచ్చఁడు - వీనికి సకలసస్యములు పండెడు గొంచి గ్రామమున్నది - అనునివి మొదలైన నమ్మకములు చెప్పెడు వాఁడు నమ్మిక పూఁటకాఁపు ॥ వీనికప్పిచ్చిన ద్రవ్యము రానిపక్షమందు ఆ ద్రవ్యమును నేనిచ్చెదనని చెప్పెడు వాఁడు ఈవి పూటకాఁపు - ఈపూటకాఁపులు చెప్పినదానికి వ్యతిరిక్తముగా జరిగినయెడల ప్రభువు వీరివల్లను ఉత్తమర్ణునికి ఋణద్రవ్యమిప్పించవలసినది ॥ వీరిలో - ఈవి పూటకాఁపు గతించినను వాని పుత్రులవల్ల ఆ ద్రవ్యమును ఉత్తమర్ణునికిప్పించవలసినది - తక్కిన వారి పుత్రులవల్ల నిప్పింపఁగూడదు ॥ ౫౨

జామీను దారుని విషయము

మూ. దర్శనప్రతిభూర్యత్ర మృతః ప్రాత్యయికోఽపి వా ।
న తత్పుత్రా ఋణం దద్యుర్దద్యుర్దానాయ యస్స్థితః ॥

వ్యా ॥ ఏతదేవ స్పష్టీకర్తుమాహ ॥ దర్శనేతి ॥ యదా దర్శనప్రతిభూః ప్రాత్యయికో వా దిష్టంగతస్తదా తయోః పుత్రాః ప్రాతిభావ్యాయాతం పైతృకమృణం న దద్యుః - యస్తు దానాయ స్థితః ప్రతిభూర్దిష్టంగతస్తస్య పుత్రా ఋణం దద్యుః - న పౌత్రాః - తే చ మూలమేవ దద్యుర్న వృద్ధిం - ఋణం పైతామహం పౌత్రః ప్రాతిభావ్యాగతం సుతః । సమం దద్యాత్తత్సుతౌ తు న దాప్యావితి నిశ్చయః ఇతి వ్యాసవచనాత్ - ప్రాతిభావ్యవ్యతిరిక్తం పైతామహమృణం పౌత్రస్సమం యావద్గృహీతం తావదేవ దద్యాన్న వృద్ధిం - తథా తత్సుతోఽపి ప్రాతిభావ్యాగతం పిత్ర్యమృణం సమమేవ దద్యాత్ - తయోః పౌత్రపుత్రయోస్సుతౌ ప్రపౌత్రపౌత్రౌ ప్రాతిభావ్యాయాతం ప్రాతిభావ్యాయాతం చర్ణం యథాక్రమమగృహీతధనౌ న దాప్యావితి - యదపి స్మరణం - ఖాదకో విత్తహీనస్స్యాల్లగ్నకో విత్తవాన్యది । మూలం తస్య భవేద్దేయం న వృద్ధిం దాతుమర్హతీతి - తదపి లగ్నకః ప్రతిభూః ఖాదకోఽధమర్ణకః - లగ్నకో యది విత్తవాన్ మృతస్తత్పుత్రేణ మూలమేవ దాతవ్యం - న వృద్ధిరితి వ్యాఖ్యేయం - యత్ర దర్శనప్రతిభూః ప్రత్యయప్రతిభూర్వా బంధకం పర్యాప్తం గృహీత్వా ప్రతిభూర్జాతస్తత్ర తత్పుత్రా అపి తస్మాదేవ బంధకాత్ప్రాతిభావ్యాయాతమృణం దద్యురేవ - యథాహ కాత్యాయనః ॥ గృహీత్వా బంధకం యస్తు దర్శనేఽస్య స్థితో భవేత్ । వినాపి పిత్రా ధనం తస్మాద్దాప్యస్స్యాత్తదృణం సుత ఇతి - దర్శనగ్రహణం ప్రత్యయస్యాప్యుపలక్షణం - వినాపి పిత్రా - పితరి ప్రేతే దూరదేశం గతేపి వేతి ॥ ౫౩

తా ॥ పూర్వశ్లోకమునఁ జెప్పినవిషయము నే స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు ॥ చూపుడు పూటకాఁపుగాని నమ్మిక పూటకాఁపుగాని గతించినపిమ్మట వారల కొడుకులు వారు పూటఁబడియున్న యప్పును తీర్ప నక్కఱలేదు - ఈవి పూటకాఁపు చనిపోయినపిమ్మట నతని కొడుకులు తండ్రి పూటఁబడిన యప్పును వడ్డిలేక తీర్పవలసినది - పౌత్రులక్కఱలేదు - తండ్రి పూటఁబడిన యప్పును కొడుకులును పితామహుఁడు తీసుకొనిన యప్పును మనుమఁడును - వడ్డిలేక తీర్పవలయునని - పితామహుఁడు పూటఁబడిన యప్పును మనుమఁడును ప్రపితామహుఁడు చేసిన యప్పును మునిమనుమఁడు

తండ్రి పూటఁబడిన యప్పు కొడుకు తీర్చవలెనా అక్కఱలేదా

మఁడునుతీర్చనక్కఱలేదని వ్యాసులచేఁ జెప్పఁబడియున్నది ॥ వారి ద్రవ్యము తమయందుఁ జేరియున్నపక్షమందు పితామహుఁడు పూటఁబడినయప్పును మనుమఁడును ప్రపితామహుఁడు చేసినయప్పును మునిమనుమఁడును తీర్చవలయును - అప్పుతీసుకొన్నవాఁడు ద్రవ్యహీనుఁడై పూటకాఁపు ధనవంతుఁడై యున్నపక్షమందా పూటకాపు అసలుమాత్రమీవలసినవాఁడగునను స్మృతికిఁ గూడ నా పూటకాపుకొడుకు అసలుమాత్రమీవలయునని యర్థము చెప్పవలసినది - చూపుడు పూటకాపును నమ్మిక పూటకాపును నప్పవయించుకొని పూటఁబడియున్నపక్షమందు వారు దేశాంతరముపోయినను గతించినను ఆకుదవయున్న ద్రవ్యమువల్లనే వారికొడుకులు తమతండ్రి పూటఁబడినయప్పును తీర్చవలయునని కాత్యాయనుచేఁ జెప్పఁబడియున్నది

మూ ॥ బహవస్స్యుర్యది స్వాంశైర్దద్యుః ప్రతిభువో ధనమ్ ।
ఏకచ్ఛాయాశ్రితేష్వేషు ధనికస్య యథారుచి ॥ ౫౮ ॥

వ్యా ॥ యత్రానేకప్రతిభూసంభవస్తత్ర కథం దాతవ్యమిత్యత ఆహ ॥ బహవ ఇతి ॥ యద్యేకస్మిన్ ప్రయోగే ద్వౌ బహవో వా ప్రతిభువస్తదర్ణం విభజ్య స్వాంశేన దద్యుః - ఏకచ్ఛాయాశ్రితేషు ప్రతిభూషు - ఏకస్యాధమర్ణస్య ఛాయా సాదృశ్యం తామాశ్రితా ఏకచ్ఛాయాశ్రితాః అధమర్ణో యథా కృత్స్నద్రవ్యదానాయ స్థితస్తథా తావత్ప్రతిభువోఽపి ప్రత్యేకం కృత్స్నదానాయ స్థితాః - ఏవం దర్శనే ప్రత్యయే చ - తేష్వేకచ్ఛాయాశ్రితేషు ప్రతిభూషు సత్సు ధనికస్యోత్తమర్ణస్య యథారుచి యథాకామం - అతశ్చ ధనికో విత్తాద్యపేక్షయా యమర్థం ప్రార్థయతే - స ఏవ కృత్స్నం దద్యాన్నాంశతః - ఏకచ్ఛాయాశ్రితేషు యది కశ్చిద్దేశాంతరంగతస్తత్పుత్రశ్చ సన్నిహితస్తదా ధనికేచ్ఛయా స సర్వం దాప్యః - మృతే తు కస్మింశ్చిత్స్వపిత్ర్యమంశమవృద్ధికం దాప్యః - యథాహ కాత్యాయనః - ఏకచ్ఛాయాప్రవిష్టానాం దాప్యో యస్తత్ర దృశ్యతే - ప్రోషితే తత్సుతస్సర్వం పిత్ర్యంశం తు మృతే సమమితి ॥ ౫౮

తా ॥ ఒకయప్పునకనేకులు పూటకాపు లుండినపక్షమందు వారాయప్పును సమభాగములుగఁ దీర్చవలయును - అయినను ఆ పూటకాపులందఱు నొకఁడు తీసుకొనిన యప్పునకే పూటఁబడినవారుగనుక అప్పిచ్చినవాఁడు వీరిలో నొకనినే తనయప్పు తీర్చుమని కోరినపక్షమందు అతఁడే తీర్చవలయును - పూటకాపులలో నొకఁడు దేశాంతరగతుండై యుండఁగా అప్పిచ్చినవాఁడు వానికొడుకును తనయప్పు నంతయు దీర్చుమనియడిగినేని అపుడతని కొడుకే యాయప్పునంతయుఁ దీర్చవలయును - మృతిఁ బొందినపక్షమందు వానికొడుకు తనతండ్రి పాలుమాత్రము వడ్డిలేక తీర్చవలయునని యిట్లు కాత్యాయనులచేఁ జెప్పఁబడియున్నది ॥

ఒకఁడు తీసిన యప్పునకిద్దఱుమువ్వురు పూటఁబడినవిషయము.

౫౯

మూ ॥ ప్రతిభూర్దాపితో యత్తు ప్రకాశం ధనినా ధనమ్ ।
ద్విగుణం ప్రతిదాతవ్యమృణికైస్తస్య తద్భవేత్ ॥

వ్యా ॥ ప్రాతిభావ్యణాదానవిధిముక్త్వా ప్రతిభూదత్తస్య ప్రతిక్రియావిధిమాహ ॥ ప్రతిభూరితి ॥ యదృణం ప్రతిభూస్తత్ప్రకాశం ధనికేనోపపీడితః ప్రకాశం సర్వజనసమక్షం రాజ్ఞా ధనికేన వాపీడితో న పునర్ద్వైగుణ్యలోభేన స్వయమేవ యద్దత్తవాన్ - యథాహ నారదః - యచ్చార్థం ప్రతిభూర్దద్యాద్ధనికేనోపపీడితః ॥ ఋణికైస్తత్ప్రతిభువే ద్విగుణం ప్రతిదాపయేదితి - ఋణికైరధమర్ణైస్తస్య ప్రతిభువస్తద్ద్రవ్యం ద్విగుణం ప్రతిదాతవ్యం స్యాత్ - తచ్చ కాలవిశేషమనపేక్ష్య సద్య ఏవ ద్విగుణం దాతవ్యం వచనారంభసామర్థ్యాత్ - ఏతచ్చ హిరణ్యవిషయం - న చేదం వచనం ద్వైగుణ్యమాత్రం ప్రతిపాదయతి - తచ్చ పూర్వోక్తకాలకలాక్రమాబాధేనాప్యుపపద్యతే - యథా జాతేష్టివిధానం శుచిత్వాబాధేన - అపి చ సద్యస్సవృద్ధికదానపక్షే వా స్త్రీణాం సద్యస్సంతత్యభావాన్మూలదానమేవ ప్రాప్నోతీతి - తదసత్ - వస్త్రధాన్యహిరణ్యానాం చతుస్త్రిద్విగుణా పరేత్యనేనైవ కాలకలాక్రమేణ ద్వైగుణ్యాదిసిద్ధేర్ద్వైగుణ్యమాత్రవిధానమిదం వచనమనర్థకం స్యాత్ - పశుస్త్రీణాం తు కాలక్రమపక్షేఽపి సంతత్యభావే స్వరూపదానమేవ - యదా ప్రతిభూరపి ద్రవ్యదానానంతరం కియతా కాలేనాధమర్ణేన సంఘట్టతే - తదా సంతతిరపి సంభవత్యేవ - యదా పూర్వసిద్ధసంతత్యా సహ పశుస్త్రీరూపా దాస్యతీతి న కించిదేతదసత్ - అథ ప్రాతిభావ్యం ప్రీతికృతమతశ్చ ప్రతిభువా దత్తం ప్రీతిదత్తమేవ - న చ ప్రీతిదత్తస్య యాచనాత్ప్రాగ్వృద్ధిరస్తి - యథాహ - ప్రీతిదత్తం

తుయత్కించిద్వర్ధతే తేనత్వయాచితమ్। యాచ్యమానమదత్తం చేద్వర్ధతే పంచకం శతమితి - అతశ్చ ప్రీతిదత్తస్యాయాచితస్యాపి దానదివసాదారభ్య యావద్ద్విగుణం కాలక్రమేణ వృద్ధిరిత్యనేన వచనేనోచ్యత ఇతి - తదప్యసత్ - అస్యార్థస్యాస్మాద్వచనాదప్రతీతేర్ద్విగుణం ప్రతిదాతవ్యమిత్యేతావదిహ ప్రతీయతే - తస్మాత్కాలక్రమమనపేక్ష్యైవద్విగుణం ప్రతిదాతవ్యం వచనారంభసామర్థ్యాదితి సుష్ఠూక్తమ్॥ ౫౫

తా॥ పూఁటకాఁపులప్పుదీర్చవలసిన క్రమమును జెప్పి వారు తీర్చినదాని మరల రాఁబట్టుకొను క్రమమును జెప్పుచున్నాఁడు॥ అప్పిచ్చినవాఁడు పూటకాపును తన ద్రవ్యమిమ్మనియుపద్రవపరచినపుడు పూటకాపు ససాక్షికముగ వానిద్రవ్యమిచ్చి పిమ్మట ఆయప్పు తీర్చవలసిన వానివలన తాను రెండంతలు తీసుకొనవచ్చును - అయినను ద్విగుణముగఁదీసుకొనవచ్చునుగదాయనునాశ చేత అప్పిచ్చినవాఁడు తొందర చేయనపుడు తానే తీర్చఁగూడదు- పూటకాపు అప్పిచ్చినవానిచేత తొందర చేయఁబడియే యప్పును తీర్చునో యాయప్పునకు రెండంతల ద్రవ్యము తనకిప్పు తీసుకొన్నవానివల్ల నిప్పించవలయునని నారదులచేఁ జెప్పఁబడియున్నది- ఇది రొక్కము విషయము. ౫౫

పూఁటకాఁపు తీర్చిన ద్రవ్యమును మరల వాఁడు రాఁబట్టుకొను క్రమము.

మూ. సంతతిస్స్త్రీపశుష్వేవ ధాన్యం త్రిగుణమేవచ। వస్త్రం
చతుర్గుణం ప్రోక్తం రసశ్చాష్టగుణస్తథా. ***** ౫౬

వ్యా॥ ప్రతిభూదత్తస్య సర్వత్ర ద్వైగుణ్యే ప్రాప్తే అపవాదమాహ॥ సంతతిరితి॥ హిరణ్యాద్ద్వైగుణ్యవత్కాలానాదరేణైవ స్త్రీపశ్వాదయః ప్రతిపాదితవృద్ధ్యా సహ దాప్యాః - శ్లోకస్తు వ్యాఖ్యాత ఏవ - యస్య ద్రవ్యస్య యావతీ వృద్ధిః పరాకాష్ఠోక్తా తద్ద్రవ్యం ప్రతిభూదత్తం ఖాదకేన తయా వృద్ధ్యా సహ కాలవిశేషమనపేక్ష్యైవ సద్యో దాతవ్యమితి తాత్పర్యార్థః - యదా తు దర్శన ప్రతిభూస్సంప్రతిపన్నే కాలే అధమర్ణం దర్శయితుమసమర్థస్తదా తదన్వేషణాయ తస్య పక్షత్రయం దాతవ్యం- తత్ర యది దర్శయతి తదా మోక్తవ్యః - అన్యథా ప్రస్తుతధనం దాప్యః ॥ నష్టస్యాన్వేషణార్థం తు దాప్యం పక్షత్రయం పరం। యద్యసౌ దర్శయేత్తత్ర మోక్తవ్యః ప్రతిభూర్భవేత్ ॥ కాలే వ్యతీతే ప్రతిభూర్యది తం నైవ దర్శయేత్ । నిబంధం దాపయేత్తం తు ప్రేతే చైష విధిస్స్మృత ఇతి కాత్యాయనవచనాత్ - లగ్నకవిశేషనిషేధశ్చ తేనైవోక్తః॥ న స్వామీ న చ వై శత్రుస్స్వామినాధికృతస్తథా। విరుద్ధో దండితశ్చైవ సందిగ్ధశ్చైవ న క్వచిత్ ॥ నైవ రిక్థీ న మిత్రం చ న చైవాత్యంతవాసినః। రాజకార్యనియుక్తశ్చ యే చ ప్రవ్రజితా నరాః ॥ నాశక్తో ధనినే దాతుం దండం రాజ్ఞే చ తత్సమం। జీవన్ వాపి పితా యస్య తథైవేచ్ఛాప్రవర్తకః॥ నావిజ్ఞాతో గృహీతవ్యః ప్రతిభూస్స్వక్రియాం ప్రతీతి । సందిగ్ధోభిశస్తః - అత్యంతవాసినో నైష్ఠికబ్రహ్మచారిణః.- ఇతి ప్రతిభూదానవిధిః ॥ ౫౬

తా॥ హిరణ్యవ్యతిరిక్త ఋణమును బూటకాపు తీర్చినపక్షమందు దాని మరల రాఁబట్టుకొను క్రమమును జెప్పుచున్నాఁడు॥ స్త్రీపశువులనప్పుదీసుకొన్న వాని విషయమందు పూటఁబడినవాఁడాయప్పు దీర్చెనేని ఆ స్త్రీపశువుల సంతతితోఁగూడ పూఁటకాఁపునకు అప్పుతీసుకొన్నవాఁడు తీర్చవలెను- ధాన్య ఋణమును పూఁటకాఁపు తీర్చినపక్షమందు అప్పుతీసుకొన్నవానివలన నా ధాన్యమునకు మూఁడంతలు రాఁబట్టుకోవచ్చును- వస్త్రమును నాలుగంతలుగను రసద్రవ్యము నెనిమిదంతలుగను రాఁబట్టుకోవచ్చును (౫౦వ) శ్లోకమందు- ఏద్రవ్యమున కెంతవఱకువడ్డి పెరుగునని చెప్పియున్నదో ఆద్రవ్యమునంత వడ్డితోఁగూడ కాలముగడవనక్కఱలేక తత్కాలమందే పూఁటకాఁపు రాఁబట్టుకోవచ్చునని ఫలితార్థము॥——చూపుడు పూఁటకాఁపు తాను గుపఱచవలసినమనిషిని ఒప్పుకొన్న కాలమందు గుపఱచఁజాలనిపక్షమందతనికి నలువదియైదు దినములు గడువీయవలయును - ఆగడువు ప్రకారము గూడ నతఁడు గుపఱచనిపక్షమందా పూఁటకాఁపే ఆయప్పు తీర్చవలసినది- ఇట్లు కాత్యాయనులచేఁ జెప్పఁబడియున్నది॥——పూఁటకాఁపుతనమునకుఁ దగినవారి నాకాత్యాయనులే చె

హిరణ్యవ్యతిరిక్తములను తీర్చిన పూఁటకాఁపు వాటిని మరల రాఁబట్టుకొను క్రమము.

చూపుడు పూఁటకాఁపునకు గడువు.

పూఁట కాఁపు తనమున

ఋతగినవారు. ప్పియున్నారు-ఎట్లనిన-అప్పిచ్చువానికధికారిగానుండువాఁడును - శత్రువును-పరాధీనుఁడును-కారాగృహమందుండువాఁడును- తప్పితము చేసి రాజదండనను బొందినవాఁడు-దుష్టుఁడన్న యపవాదము నొందినవాఁడును జ్ఞాతియు- స్నేహితుఁడును-నైష్ఠికబ్రహ్మచారియు- రాజకార్యములయందుఁ బ్రవర్తించియున్నవాఁడును- సన్యాసియు- ధనికునికి ధనమును రాజునకు ధనమంతయపరాధము నీఁదగిన ద్రవ్యము లేనివాఁడును- తండ్రి జీవించియుండఁగాఁ గొడుకును-యథేచ్ఛప్రవృత్తుఁడును- సుతెలుఁగనివాఁడును - వీరుపూఁటకాఁపుతనమునకనర్హులుగారు. ౫౭

మూ. { ఆధిః ప్రణశ్యేద్ద్విగుణే ధనే యది న మోచ్యతే । కా
లే కాలకృతో నశ్యేత్ఫలభోగ్యో న నశ్యతి॥***** }

వ్యా॥ ధనప్రయోగే ద్వౌ విశ్వాసహేతూ ప్రతిభూరాధిశ్చ- యథాహ నారదః- విస్రంభహేతూ ద్వావత్ర ప్రతిభూరాధిరేవ చేతి-. తత్ర ప్రతిభూర్నిరూపిత ఇదానీమాధిర్నిరూప్యతే-ఆధిర్నామ గృహీతస్య ద్రవ్యస్యోపరి విశ్వాసార్థమధమర్ణేనోత్తమర్ణే అధిక్రియతే- ఆధీయత ఇత్యాధిః.- స చ ద్వివిధః కృతకాలోఽకృతకాలశ్చ పునశ్చైకైకశో ద్వివిధః గోప్యో భోగ్యశ్చ- యథాహ నారదః॥ అధిక్రియత ఇత్యాధిస్స విజ్ఞేయో ద్విలక్షణః। కృతకాలోపనేయశ్చ యావద్దేయోద్యతస్తథా॥ స పునర్ద్వివిధః ప్రోక్తో గోప్యో భోగ్యస్తథైవ చేతి। కృతకాల ఆధానకాల ఏవాముష్మిన్కాలే దీపోత్సవాదౌ మయాయమాధిర్మోక్తవ్యోఽన్యథా తవైవాధిర్భవిష్యతీత్యేవం నిరూపితే కాలే ఉపనేయ ఆత్మసమీపం నేతవ్యః మోచనీయ ఇత్యర్థః- దేయం దానం-దేయమనతిక్రమ్య యావద్దేయం - ఉద్యతో నియతస్థాపిత ఇత్యర్థః- యావద్దేయముద్యతో యావద్దేయోద్యతః-గృహీతధనస్య ప్రత్యర్పణావధిరనిరూపితకాల ఇత్యర్థః-గోప్యో రక్షణీయః ॥ ఏవం చతుర్విధస్యాధేర్విశేషమాహ॥ ఆధిరితి॥ ప్రయుక్తే ధనే స్వకృతయా వృద్ధ్యా కాలక్రమేణ ద్విగుణీభూతే యద్యాధిరధమర్ణేన ద్రవ్యదానేన న మోచ్యతే - తదా నశ్యత్యధమర్ణస్య ధనం ప్రయోక్తుస్స్వం భవతి-కాలకృతః కృతకాలః- ఆహితాగ్న్యాదిషు పాఠాత్కాలశబ్దస్య పూర్వనిపాతః- స తు కాలే నిరూపితే ప్రాప్తే నశ్యేద్ద్వైగుణ్యాత్ప్రాగూర్ధ్వం వా- ఫలభోగ్యః ఫలం భోగ్యం యస్యాసౌ ఫలభోగ్యః క్షేత్రారామాదిః-స న కదాచిదపి నశ్యతి- కృతకాలస్య గోప్యస్య భోగ్యస్య చ తత్కాలాతిక్రమే నాశ ఉక్తః కాలే కాలకృతో నశ్యేదితి-అకృతకాలస్య భోగ్యస్య వా నాశాభావ ఉక్తః - ఫలభోగ్యో న నశ్యతీతి - పారిశేష్యాదాధిః ప్రణశ్యేదిత్యేతదకృతకాలగోప్యాధివిషయమవతిష్ఠతే - ద్వైగుణ్యాతిక్రమేణ నిరూపితకాలాతిక్రమేణ చ వినాశే చతుర్దశదినప్రతీక్షణం కర్తవ్యం బృహస్పతివచనాత్- *హిరణ్యే ద్విగుణీభూతే పూర్ణే కాలే కృతావధౌ। బంధకస్య ధనీ స్వామీ ద్విసప్తాహం ప్రతీక్ష్య చ ॥ తదంతరా ధనం దత్త్వా ఋణీ బంధకమాప్నుయాదితి- నన్వాధిః ప్రణశ్యేదిత్యనుపపన్నం- అధమర్ణస్య స్వత్వనివృత్తిహేతోర్దానవిక్రయాదేరభావాత్ -. ధనినశ్చ స్వత్వహేతోః ప్రతిగ్రహక్రయాదేరభావాత్ - మనువచనవిరోధాచ్చ-న చాధేః కాలసంరోధాన్నిసర్గోఽస్తి న విక్రయ ఇతి ॥ కాలేన సంరోధః కాలసంరోధశ్చిరకాలమవస్థానం- తస్మాత్కాలసంరోధాచ్చిరకాలావస్థానాదాధేర్న నిసర్గోఽస్తి నాన్యత్రాధికరణమస్తి-న చ విక్రయః- ఏవమాధికరణవిక్రయ-ప్రతిషేధాద్ధనినస్స్వత్వాభావోఽవగమ్యత ఇతి-ఉచ్యతే-ఆధికరణమేవ లోకే సోపాధికస్స్వత్వనివృత్తిహేతుః- ఆధిస్వీకారశ్చ సోపాధికస్వత్వాపత్తిహేతుః ప్రసిద్ధః - తత్ర ప్రయుక్తధనద్వైగుణ్యే నిరూపితకాలప్రాప్తౌ చ ద్రవ్యదానస్యాత్యంతనివృత్తేరనేన వచనేనాధమర్ణస్యాత్యంతికీ స్వత్వనివృత్తిరుత్తమర్ణస్య చాత్యంతికం స్వత్వం భవతి - న చ మనువచనవిరోధః- యతః-న త్వేవాధౌ సోపకారే కౌసీదీం వృద్ధిమాప్నుయాదితి- భోగ్యాధిం ప్రస్తుత్యేదముచ్యతే - న చాధేః కాలసంరోధాన్నిసర్గోఽస్తి న విక్రయ ఇతి- భోగ్యస్యాధేశ్చిరంతనకాలావస్థానేఽప్యాధికరణవిక్రయనిషేధేన ధనినస్స్వత్వం నాస్తీతి- ఇహాప్యుక్తం ఫలభోగ్యో న నశ్యతీతి-గోప్యాధౌ తు పృథగారబ్ధం మనునా-న భోక్తవ్యో బలాదాధిర్భుంజానో వృద్ధిముత్సృజేదితి॥ ఇహాపి వక్ష్యతే- గోప్యాధిభోగే నో వృద్ధిరితి-ఆధిః ప్రణశ్యేద్ద్విగుణ ఇతి తు గోప్యాధిం ప్రత్యుచ్యత ఇతి సర్వమవిరుద్ధం॥ ౫౮

తా॥ ఇంతవఱకుపూటకాపులవిషయముచెప్పఁబడెను- ఇఁక కుదవయుంచుకొనువిషయము॥ అప్పిచ్చునపుడున మ్మికకు రెండుహేతువులు- అందొకఁడుపూటకాపు - రెండవది కుదవ- కుదవయనఁగా నప్పుతీసుకొనువాఁడప్పిచ్చువానియొద్ద వాఁడిచ్చుద్రవ్యమునకు బదులుగానుంచువస్తువు- అది రెండువిధములుగలది - ఇన్నిదినములలోపల నీయప్పు తీర్చినపక్షమందు నేనునీ యొద్దనుంచినవస్తువునునీవు విడుదలచేయవలసినది లేనిపక్షమందాసొత్తునీదిగానే కావలసినదని చెప్పియుంచునదియొకటి - నేనునీయప్పుతీర్చిదీనిఁదీసుకొనిపోయెదనని కాలనిర్ణయము చేయకయుంచునదియొకటి- ఈ రెంటియందునొకటొకటికి రెండుభేదములుగలవు - కుదవయుంచుకొన్నవాఁడావస్తువుననుభవించుచుండునట్లు నిర్ణయముగలిగియుండునదియొకటి - అట్లుగాక అప్పుతీసుకొన్నవాఁడా యప్పునువడ్డితీర్చునంతవఱకు కాపాడియతఁడప్పుతీర్పఁగానే వానికిచ్చివేయవలసినట్లు నిర్ణయింపఁబడునది యొకటి- ఇట్లు నారదులచేఁ జెప్పఁబడియున్నది॥——ఈనాలుగువిధములకుదవలకునుపిమ్మటజరగవలసినక్రియలయందుభేదమును జెప్పుచున్నాఁడు॥ నీ యప్పుదీర్చునంతవఱకీవస్తువునునీయొద్దనుంచుకొనియుండుమనియేదైనను కుదవయుంచిగడువులేక అప్పుతీసుకొన్నపక్షమందు ఆవిషయమై నిర్ణయించుకొన్నవడ్డి అసలునకు సరిగా పెరిగినప్పుడుగూడ నాయప్పుదీరకుండె నేని కుదవయుంచియున్నవస్తువు అప్పిచ్చినవానిదే యగును - ఇన్నిదినములలోపలనీయప్పుదీర్చి నేనుంచినవస్తువునువిడిపించికొందును- లేనిపక్షమందాయప్పునకుచెల్లుగా ఈవస్తువును నీవేయెత్తుకొనవచ్చునని చెప్పియుంచినకుదవద్రవ్యము దాచునట్లుంచినదైనను అనుభవించునట్లుంచినదైనను నిర్ణీతకాలము కాఁగానే యప్పిచ్చినవానిదగును- పైనఁజెప్పిన రెండువిషయములయందును అప్పిచ్చినవాఁడు అప్పుతీసుకొన్నవానికిఁబిమ్మటపదునాలుగుదినములుగడువిచ్చి ఆగడువుప్రకారముగూడనతఁడుతీర్చనిపక్షమందే కుదవసొమ్మును తానెత్తుకోవలసినది॥——వడ్డికిచెల్లుగాఫలము ననుభవింపుచుండునట్లును అసలుతీర్చినపుడు విడుదలచేయవలసినట్లును నిర్ణయించుకొని కుదవయుంచిన భూములుతోపులు మొదలైనవానిని - ఎంతకాలమునకయినను అప్పుతీర్చినపుడు విడుదలచేయవలసినదే కాని యప్పిచ్చినవాఁడుతనవిగాఁజేసుకొనఁగూడదు. ౫౭

కుదవయుంచుకొనువిషయము - అది నాలుగువిధములు.

నాల్గువిధములకుదవలలో నొకటొకటికిజరగవలసినక్రమము.

భోగ్యముగానుంచిన భూమ్యాదివిషయము.

మూ. { గోప్యాధిభోగే నో వృద్ధిస్సోపకారేథహాపితే। నష్టో దేయో వినష్టశ్చ దైవరాజకృతాదృతే ॥ ౫౮ ॥ }

వ్యా॥ కించ-గోప్యేతి॥ గోప్యాధేస్తామ్రకటాహాదేరుపభోగే - నవృద్ధిర్భవతి- అల్పేప్యుపభోగే మహత్యపివృద్ధిర్హాతవ్యా సమయాతిక్రమాత్ - తథాసోపకారే ఉపకారకారిణి బలీవర్దతామ్రకటాహాదౌ భోగ్యాధౌ సవృద్ధికేహాపితే హాని వ్యవహారాత్ సమత్వంగమితే నో వృద్ధిరితి సంబంధః - నష్టో వికృతింగత స్తామ్రకటాహాది శ్ఛిద్రభేదాదినా- పూర్వవత్కృత్వా దేయస్తత్ర గోప్యాధిర్నష్టశ్చేత్పూర్వవత్కృత్వా దేయః ఉపభుక్తోపిచేద్వృద్ధిరపిహాతవ్యా భోగ్యాధిర్యదినష్టస్తదా పూర్వవత్కృత్వా దేయః- వృద్ధిసద్భావే వృద్ధిర్హాతవ్యా- వినష్ట ఆత్యంతికంనాశం ప్రాప్తస్సోపి దేయో మూల్యాదిద్వారేణ- తద్దానే సవృద్ధికం మూలంలభతే- యదినదదాతి తదా మూలనాశః వినష్టే మూలనాశస్స్యాద్దైవరాజకృతాదృత ఇతి నారదవచనాత్ - దైవరాజకృతాదృతే- దైవముగ్న్యుదక దేశోపప్లవాది- దైవకృతాద్వినాశాద్వినా తథా స్వాపరాధరహితాద్రాజకృతాత్ - దైవరాజకృతేతు వినాశే సవృద్ధికం మూల్యం దాతవ్యః ధమర్ణేనాధ్యంతరంవా- యథాహ॥ స్రోతసాపహృతే క్షేత్రే రాజ్ఞాచైవాపహారితే । ఆధిరన్యోధికర్తవ్యో దేయం వాధని నేధనమితి॥ తత్ర స్రోతసాపహృత ఇతి దైవకృతోపలక్షణం॥ ౫౮

తా॥ దాచఁదగినదిగాకుదవయుంచినవస్తువును కొంచెమైనవాడుకొన్నపక్షమందు అధికముగా వడ్డిరావలసియున్నను ఆవడ్డినంతయు వదిలిపెట్టవలసినది- ఆకుదవవస్తువు అను

దాచునట్లుకుదవయుంచి

నసో స్తననుభవించెనేని వడ్డిలేదు-అనుభవించున ట్లుకుదవయుంచినవస్తువు చెడినపక్షమందు జరగ వలసినవిధి.

భవింపఁబడకయే చెడిపోయినపక్షమందు బాగుపఱచియీయావలసినది-అనుభవించుటవల్ల చెడిపోయినపక్షమందుబాగుపఱచియిచ్చివడ్డినివిడిచిపెట్టవలసినది॥ —— అనుభవించుచుండునట్లుకుదవయుంచినవస్తువు - అనఁగాదున్నుకొనుచుండుమనియుంచినయెద్దు-వాడుకొనుచుండుమనియుంచినతపెల - మొదలగువానినికుదవయుంచుకొన్నవాఁడు న్యాయముగాననుభవింపుచుండగానవి మఱలనుపయోగార్హములుగాక పోయినపక్షమందువాటినికుదవయుంచుకొనియిచ్చినఅప్పునకైనవడ్డినివదిలిపెట్టవలసినది-చెడిపోయినపక్షమందుబాగుపఱచియీయావలసినది-లేదా- వడ్డిగలిగియున్నపక్షమందావడ్డినయినవదిలిపెట్టవలసినది ॥——

కుదవయుంచినవస్తువుపో యినపక్షమందు జరగవ లసినవిధి.

దైవోపద్రవముగాని రాజోపద్రవముగాని లేకకుదవవస్తువుపోయినపక్షమందుదానిక్రయముకుదవయుంచుకొన్న వాఁడిచ్చినపక్షమందే యతఁడప్పిచ్చినద్రవ్యమువడ్డితోడనతనికిచేరును గాని లేనిపక్షమందు చేరదు-ఇట్లు నారదులచేఁజెప్పఁబడియున్నది॥ ——

దైవవశంబునగాని రా జాజ్ఞచేఁగానికుదవవస్తు వునకు హాని గలిగిన పక్ష మందు.

దైవకృతోపద్రవమనఁగానిప్పుజలప్రవాహము మొదలగునది-రాజోపద్రవమనఁగానీతనివలన నేమియుతప్పులేకుండునప్పుడుదండు మొదలగువానివలనఁగలుగునది- పైనఁజెప్పిన రెండువిధములఉపద్రవములచేతకుదవవస్తువునకు హానిగలిగెనాఅప్పుతీసుకొనియున్నవాఁడువడ్డితోఁగూడనప్పు డెఆయప్పుతీర్చవలసినది-లేదా-ఆవస్తువునకుబదులుమరియొకవస్తువునుకుదవయుంచవలసినది. ౫౮

మూ. { ఆధేస్స్వీకరణాత్సిద్ధీరక్ష్యమాణోప్యసారతామ్ । యా
తశ్చేదన్యఆధేయోధనభాగ్వాధనీభవేత్ ॥౫౯॥ ** }

వ్యా॥ అపిచ-ఆధేరితి॥ ఆధేర్గోప్యస్యభోగ్యస్యచ- స్వీకరణాదుపభోగాదాధిగ్రహణసిద్ధిః- నసాక్షిలేఖనమాత్రేణ- నాప్యుద్దేశమాత్రేణ- యథాహనారదః॥ ఆధిస్తుద్వివిధఃప్రోక్తోజంగమస్థావరస్తథా। సిద్ధిరస్యోభయస్యాపిభోగోయద్యస్తినాన్యథేతి- అస్యచఫలం ఆధౌప్రతిగ్రహేక్రీతేపూర్వాతుబలవత్తరేతి- యాస్వీకారాంతా క్రియాసాపూర్వాబలవతీ-స్వీకారరహితాతుపూర్వాపినబలవతీతి- సచాధిఃప్రయత్నేనరక్ష్యమాణోపికాలవశేన యద్యసారతామవికృతఏవ సవృద్ధికమూలద్రవ్యాపర్యాప్తతాంగతస్తదాఽధిరన్యఃకర్తవ్యః - ధనినేవాధనందేయం- రక్ష్యమాణోప్యసారతామితివదతాఆధిఃప్రయత్నేనరక్షణీయోధనినేతిజ్ఞాపితం॥ ౫౯

తా॥ దాచునట్లుకుదవయుంచినవస్తువునుగాని అనుభవించునట్లుకుదవయుంచినవస్తువునుగాని అప్పిచ్చినవాఁడుతనస్వాధీనముచేసుకొన్నపక్షమందేఆకుదవయతనికి సిద్ధించును గాని సాక్షులుపత్రము మొదలగు కేవలసాధనములచేత నేసిద్ధించదు॥ ——

అప్పిచ్చువాఁడు కుదవవ స్తువునుస్వాధీనముచేసు కొనవలెను.

కుదవయుంచుకొన్నవాఁడావస్తువుమజాగ్రత్తతోఁగాపాడుచుండినను ఆవస్తువువడ్డితోఁగూడినతనయప్పునకు చాలనిదైపోయినపక్షమందు అప్పుతీసుకొన్నవాఁడు మఱియొకవస్తువునుకుదవయుంచవలయును లేనిపక్షమందుదానిమీఁది యప్పైనఁదీర్చవలయును-ఇట్లుచెప్పుటచేతనప్పిచ్చినవాఁడు కుదవసొత్తు నతిజాగ్రత్తతోఁగాపాడవలయునని తెలియవచ్చుచున్నది॥ ౫౯

అప్పిచ్చిన వాఁడు కుదవ సొమ్మునుగాపాడవలెను

మూ. { చరిత్రబంధకకృతం సవృద్ధ్యాదాపయేద్ధనం । సత్యం
కారకృతంద్రవ్యంద్విగుణంప్రతిదాపయేత్ ॥**౬౦॥ }

వ్యా॥ ఆధిఃప్రణశ్యేద్ద్విగుణఇత్యస్యాపవాదమాహ॥ చరిత్రేతి॥ చరిత్రంశోభనాచరితం-చరిత్రేణబంధకం చరిత్రబంధకం- తేనయద్ద్రవ్యమాత్మసాత్కృతంపరాధీనంవాకృతం- ఏతదుక్తంభవతి - ధనినస్స్వేచ్ఛాశయత్వేన బహుమూల్యమపిద్రవ్యమాధీకృత్యాధమర్ణేనాల్పమేవద్రవ్యమాత్మసాత్కృతం - యదివాఽధమర్ణస్వేచ్ఛాశ

యత్వే నాల్పమూల్యమాధింగృహీత్వా బహుద్రవ్యమేవధనినాధమర్ణాధీనంకృతమితి- తద్ధనంసవృద్ధ్యా సహదాపయేత్ - అయమాశయః- ఏవంరూపంబంధకంద్విగుణీభూతేపిద్రవ్యేననశ్యతి - కింతు ద్విగుణమేవద్రవ్యందాతవ్యమితి- తథాసత్యంకారకృతం-కరణంకారఃభావేఘఞ్ - సత్యస్యకారస్సత్యంకారః-కారేసత్యాగతస్యేతిముమ్- సత్యంకారేణకృతంసత్యంకారకృతం- అయమభిసంధిః - యదాబంధకార్పణసమయవివేత్థం పరిభాషితంద్విగుణీభూతేపిద్రవ్యేమయాద్విగుణంద్రవ్యమేవదాతవ్యం- నాధినాశఇతి- తదాపిద్విగుణందాపయేదితి- అన్యోన్యస్యార్థః- చరిత్రమేవబంధకంచరిత్రబంధకం చరిత్రశబ్దేనగంగాస్నానాగ్నిహోత్రాదిజనితమపూర్వముచ్యతే-యత్రతదేవాధీకృత్యయద్ద్రవ్యమాత్మసాత్కృతంతత్రతదేవద్విగుణీభూతందాతవ్యంనాధినాశఇతి - అధిప్రసంగాదన్యదుచ్యతే- సత్యంకారకృతమితి- క్రయవిక్రయాదివ్యవస్థానిర్వాహాయయదంగులీయకాదిపరహస్తేకృతంతద్వ్యవస్థాతిక్రమేణద్విగుణందాతవ్యం- తత్రాపియేనాంగులీయకాద్యర్పితంసఏవచేద్వ్యవస్థామతివర్తతే తేన తదేవహాతవ్యం- ఇతరశ్చేద్వ్యవస్థాతివర్తీతదాతదేవాంగులీయకాదిద్విగుణంప్రతిదాపయేదితి॥ ౬౦

తా॥ అప్పుతీసుకొన్న ద్రవ్యమువడ్డితోద్విగుణమైనను కుదవవస్తువునందుఅప్పిచ్చినవానికిస్వత్వముకలుగనివిషయము॥ అప్పిచ్చువాఁడుమిక్కిలి మంచిమనసుగలవాఁడను నమ్మికచేతనప్పుతీసుకొనువాఁడుమిక్కిలివెలగలవస్తువునుకుదవయుంచిదానివెలలోసగమునకంటెతక్కువపయికమప్పుతీసుకొన్నపక్షమందుఆఋణద్రవ్యమువడ్డితోద్విగుణమైననుఅప్పిచ్చినవాఁడుతానిచ్చినద్రవ్యమునకురెట్టింపుద్రవ్యమునుదీసుకొనవలసినదేకానికుదవయుంచినవస్తువునుదీసుకొనఁగూడదు- అప్పుతీసుకొనువాఁడుమిక్కిలిన్యాయప్రవర్తనగలవాఁడనునమ్మకముచేతకొంచెమువెలగలవస్తువునుకుదవయుంచుకొనిదానివెలలోసగముకంటెనధికముగనప్పిచ్చియున్నపక్షమందు ఆఋణద్రవ్యమువడ్డితోఁగూడకుదవసొమ్ము వెలకంటె హెచ్చైనేనిప్రభువాఋణద్రవ్యమునప్పిచ్చినవానికివడ్డితోనిప్పించవలసినదిగానికుదవసొమ్ముతోచెల్లుపెట్టఁగూడదు॥ నేనుతీసుకొన్నద్రవ్యమువడ్డితోద్విగుణమైనపిమ్మటనైననువావల్లనీద్విగుణద్రవ్యమునుదీసికొనవలసినదేకానికుదవసొమ్ము నెత్తుకొనఁగూడదని యప్పిచ్చువానితో నప్పుతీసుకొనువాఁడు మాటలాడుకొని యున్నపక్షమందు అప్పిచ్చినవాఁడుకుదవసొమ్మునుదీసుకొనఁగూడదు॥ —— దీనికి మఱియొక యర్థమును జెప్పవచ్చును- గంగాస్నానము మొదలగుపుణ్యకార్యములఫలములను కుదవయుంచుకొని యిచ్చినఅప్పువడ్డితోద్విగుణమైనను-పిమ్మటఆద్విగుణద్రవ్యమునిచ్చినప్పుడుఆపుణ్యఫలమునువదిలిపెట్టవలసినదేకానిఅప్పిచ్చినవాఁడాద్రవ్యమునుదీసికొనక పుణ్యఫలమునుతనదిగాఁజేసుకోఁగూడదు॥ ——— కుదవప్రస్తావముమీఁద మఱియొక విషయముచెప్పఁబడుచున్నది॥ ఏదైననొకసరకొప్పందముచేసుకొనిసంచకరమునకుగానుంగరము మొదలైనవేవైననిచ్చినపక్షమందా సంచకరముతీసుకొన్నవాఁడా యొప్పందమునకుతిరుగఁబడెనా రెండంతలుగనీవలయును- సంచకరమిచ్చినవాఁడేతిరుగఁబడెనా తానిచ్చిన సంచకరమునువిడిచిపెట్టవలయును॥ ౬౦

ఋణద్రవ్యముద్విగుణమైనను కుదవసొమ్మునందప్పిచ్చిన వానికిస్వత్వము లేకుండుట.

పుణ్య ఫలములను కుదవయుంచువిషయము.

సంచకరమిచ్చినవిషయము.

మూ॥ { ఉపస్థితస్య మోక్తవ్య ఆధిఃస్తేనోన్యథాభవేత్ । ప్ర
యోజకేసతిధనంకులేన్యస్యాధిమాప్నుయాత్ ॥౬౧ }

వ్యా॥ కించ- ఉపస్థితస్యేతి ॥ ధనదానేనాధిమోక్షణాయోపస్థితస్యాధిర్మోక్తవ్యోధనినా - నవృద్ధిలోభేన స్థాపయితవ్యః- అన్యథాఅమోక్షణే- స్తేనశ్చోరవద్దండ్యోభవేత్ - అసన్నిహితేపునఃప్రయోక్తరికులే తదాప్తహస్తే సవృద్ధికంధనంనిధాయాధమర్ణస్స్వకీయంబంధకంగృహ్ణీయాత్ ॥ ౬౧

తా ॥ కుదవయుంచినవాఁడుచెల్లింపవలసినద్రవ్యమును తెచ్చిఆద్రవ్యముతీసుకొనికుదవవస్తువునిమ్మనియడిగినప్పుడు కుదవయుంచుకొన్నవాఁడుఅభ్యంతరముచేయక పూ

కుదవయుంచినవాఁడును

కల విడిపించుకొను రీతి

దలచేయవలసినది - వడ్డియందాశవలన నభ్యంతరము చేసినపక్షమందు దొంగవలెదం డనార్హుఁడగును - అప్పిచ్చినవాఁడు లేనిపక్షమందతనియొక్క పుత్రులయొద్ద నతనికీవలసిన రూకలిచ్చి కుదవయుంచినవాఁడు కుదవవస్తువును విడిపించుకోవలసినది॥ ౬౧

మూ. తత్కాలకృతమూల్యోవా తత్ర తిష్ఠేదవృద్ధికః॥ ౬౨॥

వ్యా॥ అథప్రయోక్తాప్యసన్నిహిత స్తదాప్తాశ్చధనస్య గ్రహీతారోనసంతియదివా అసన్నిహితేప్రయోక్త ర్యాధివిక్రయేణధనదిత్సాధమర్ణస్యతత్ర కింకర్తవ్యమిత్యపేక్షితఆహ॥ తదితి॥ తస్మిన్కాలేయత్తస్యాధేర్మూల్యం తత్పరికల్ప్యతత్రైవధనినితమాధింవృద్ధిరహితంస్థాపయేదతఊర్ధ్వంతద్ధనంనవర్ధతే - యావద్ధనీధనంగృహీత్వాత మాధింముంచతి - యావద్వాతన్మూల్యద్రవ్యమృణినేప్రవేశయతి॥ ౬౨

తా॥ అప్పిచ్చినవాఁడును వానియొక్క పుత్రులును లేనిపక్షమందును కుదవయుంచినవానికాకు దవసొమ్మునమ్మియప్పుతీర్పవలసినదని యిచ్ఛగలిగినపుడప్పిచ్చినవాఁడు లేనిపక్షమందు ను జరగవలసినక్రమమెట్లనిన - అప్పుతీర్చవలసినవాఁడు రూకలుతెచ్చినపుడప్పిచ్చిన వాఁడును వానియొక్క పుత్రులును లేనిపక్షమందాదినమువఱకే యాయప్పునకు వడ్డియేర్పర చగా నామొత్తమెంతయగుచున్నదో యంతే తీసుకొని యతనికుదవసొమ్మును విడదలచే యవలసినదే కానిపిమ్మట వడ్డికట్టఁగూడదు॥ ——కుదవవస్తువు నమ్మి యప్పుతీర్పవల యుననియప్పుతీసుకొన్నవాఁడువచ్చినపుడప్పిచ్చినవాఁడు లేనిపక్షమున నప్పుడాకుదవ సొమ్ము యెంత వెలకు విక్రయమగునో యావెలను - నాఁటివఱకే వడ్డి మొదలు మొత్తము చే సియామొత్తమునకు చెల్లుపెట్టుకొనవలసినదే కాని పిమ్మట వడ్డి పెంపఁగూడదు॥ ౬౨॥

అప్పుతీర్చ వచ్చినపుడప్పిచ్చిన వాఁడు లేకయభ్యంతరమైనవిషయము

కుదవ యుంచిన వాఁడా సొమ్ము నమ్మి యప్పుతీర్ప వలెననివచ్చినపుడుధని లేనిపక్షమందు.

మూ. వినాధారణకాద్వాపివిక్రీణీతససాక్షికమ్॥ ౬౩॥

వ్యా॥ యదాతుద్విగుణీభూతేపిధనేద్విగుణంధనమేవగృహీతవ్యంనత్వాధినాశఇతి విచారితమృణగ్రహణకా లపేవతదాద్విగుణీభూతేద్రవ్యే - అసన్నిహితేచాధమర్ణేధనినాకింకర్తవ్యమిత్యతఆహ॥ వినేతి॥ ధారణకాదధమ ర్ణాద్వినాఅధమర్ణేఅసన్నిహితేసాక్షిభిస్తదాప్తైశ్చసహితమాధింవిక్రీయతద్ధనంగృహ్ణీయాద్ధనీ - వాశబ్దోవ్యవ స్థితవికల్పార్థః - యదర్ణగ్రహణకాలేద్విగుణీభూతేపిధనే ధనమేవ గృహీతవ్యం నత్వాధినాశఇతి నవిచారితం త దా - ఆధిఃప్రణశ్యేద్ద్విగుణఇత్యాధినాశః - విచారితేత్వయంపక్షఇతి॥ ౬౩

తా॥ రెండంతలధనము చెల్లించుకొనవలసినదే గాని కుదవయుంచిన సొమ్మునప్పిచ్చిన వాఁడుతనదిగాఁజేసుకోఁగూడదని మాటలాడుకొని యిచ్చినయప్పువిషయమందప్పుతీ సుకొన్నధనము వడ్డితో రెండంతలైనపిమ్మట కుదవయుంచినవాఁడు దగ్గిర లేనిపక్షమందు వానియొక్క పుత్రులను సాక్షులను కూడనుంచుకొని యాకుదవవస్తువును విక్రయించి తనకుచే రవలసినద్రవ్యమును తానుదీసుకొనవలసినది॥ ౬౩

అప్పువడ్డితో రెండంతలైన నుద్రవ్యమే తీసుకొనికుద వవిడుదలచేయునట్లు నిర్ణయముగలిగియుండెనేని.

మూ. {యదాతుద్విగుణీభూతమృణమాధౌతదాఖలు। మో
చ్య ఆధిస్తదుత్పన్నే ప్రవిష్టేద్విగుణేధనే॥ ౬౩॥ **}

వ్యా॥ భోగ్యాధౌవిశేషమాహ॥ యదేతి॥ యదాప్రయుక్తంధనంస్వకృతయావృద్ధ్యా ద్విగుణీభూతంతదా ఆధౌకృతేతదుత్పన్నే ఆధ్యుత్పన్నే ద్రవ్యేద్విగుణేధనినఃప్రవిష్టేధనినాధిర్మోక్తవ్యః - యదివాఆదావేవాధౌదత్తే ద్విగుణీభూతేద్రవ్యేత్వయాధిర్మోక్తవ్యఇతి పరిభాషయా కారణాంతరేణవా భోగాభావేనయదాద్విగుణీభూత మృణంతదాధౌభోగార్థంధనినిప్రవిష్టేతదుత్పన్నే ద్రవ్యేద్విగుణేసత్యాధిర్మోక్తవ్యః - అధికోపభోగే తదపిదే యం - సర్వథాసవృద్ధికమూల్యాపాకరణార్థాధ్యుపభోగవిషయమిదంవచనం - తమేనంతుయాధిమాచక్షతేలా భకాలే యత్రతువృద్ధ్యర్థఏవాధ్యుపభోగఇతిపరిభాషా - తత్రద్వైగుణ్యాతిక్రమేపియావన్మూల్యదానం తావదుప భోగ ఏవాధిః - ఏతదేవస్పష్టీకృతంబృహస్పతినా - ఋణీబంధమవాప్నుయాత్ - ఫలభోగ్యంపూర్ణకాలం ద

త్వాద్ద్రవ్యంచసామకం। యదిప్రకర్షితంతత్స్యాత్తదానధనభాగ్ధనీ। ఋణీచనలభేద్బంధంపరస్పరమతంవినేతి॥ అస్యార్థః॥ఫలంభోగ్యంయస్యాసౌఫలభోగ్యోబంధఆధిః - సచద్వివిధస్సవృద్ధికమూల్యాపకరణార్థో-వృద్ధిమాత్రాపాకరణార్థశ్చ - తత్రచసవృద్ధికమూల్యాపకరణార్థంబంధం - పూర్ణకాలంపూర్ణఃకాలోయస్యాసౌపూర్ణకాలస్తమాప్నుయాద్ఋణీ - యదాసవృద్ధికంమూల్యంఫలద్వారేణధనినఃప్రవిష్టం తదాబంధ మవాప్నుయాదిత్యర్థః - వృద్ధిమాత్రాపాకరణార్థంతుబంధంసామకందత్వాప్రాప్నుయాద్ఋణీ - సమంమూల్యం సమమేవసామకం - అస్యాపవాదమాహ - యదిప్రకర్షితంతత్స్యాదితి - తద్బంధకంప్రకర్షితమతిశయితంవృద్ధేరప్యధికఫలంయదిస్యాత్తదానధనభాగ్ధనీ - సామకంనలభేతధనీనేమూల్యమదత్త్వైవఋణీబంధమవాప్నుయాదిలియావత్ - అథాప్రకర్షితంతద్బంధకం వృద్ధయేప్యపర్యాప్తం తదాసామకం దత్వాపి బంధకం నలభేతాధమర్ణః - వృద్ధిశేషమపిదత్త్వైవలభేతేత్యర్థః - పునరుభయత్రాపవాదమాహ పరస్పరమతంవినేతి - ఉత్తమర్ణాధమర్ణయోః పరస్పరానుమత్యభావేయదిప్రకర్షితమిత్యాద్యుక్తం - పరస్పరానుమతౌతూత్కృష్టమపి బంధకం యావన్మూల్యదానం తావదుపభుఙ్క్తే ధనీ - నికృష్టమపిమూల్యమాత్రదానేనైవాధమర్ణోఽపిలభతఇతి॥ ౬౩

తా॥ ఫలముననుభవింపుచుండునట్లుంచినకుదవయందలికొన్ని భేదములుచెప్పఁబడుచున్నవి ॥ అప్పిచ్చినద్రవ్యమునిర్ణయింపఁబడినవడ్డితోఁగూడ రెండంతలైనపుడుఒకకుదవ యుంచినపక్షమందాకుదవయుంచినభూమి మొదలగుదానియందుత్పన్నమగు ఫలమువల్ల - వడ్డితోద్విగుణమైయున్నయాయప్పనుతీర్చుకొనికుదవనువదిలిపెట్టవలసినది - లేక అప్పుతీసుకొన్నపుడే కుదవయుంచియున్నధనముద్విగుణముకాఁగానేఅప్పుతీర్చికుదవవిడిపించుకొనునట్లునిబంధనగలిగియుండుటచేతఁగానిమఱియొకకారణముచేతఁగానిఅప్పిచ్చినవాఁడుకుదవయుంచుకొన్నభూమ్యాదుల ఫలము ననుభవింపకుండి అప్పువడ్డితోద్విగుణమైనపిమ్మటననుభవింపసాగినను ఆద్విగుణద్రవ్యముచెల్లఁగానేకుదవనువదిలిపెట్టవలసినది - ద్విగుణద్రవ్యమునకంటెనధికముగాఫలముననుభవించినపక్షమందుదానిమఱలనీవలసినది - ఇదిఅసలును వడ్డియును ఫలమువల్లఁదీర్చుకొనునట్లునిర్ణయించుకొనియుంచినకుదవవిషయము - దీనినిఆయకమనిఅడమానమనిచెప్పుచుందురు ॥ కుదవయుంచినదానియందుత్పన్నమగుఫలమునువడ్డికిఁగాఁజెల్లుపెట్టుకొమ్మనియుంచినకుదవనుఅసలుద్రవ్యమునిచ్చినపుడేవదిలిపెట్టవలసినది - ఈవిషయముబృహస్పతిచేతఁదేటపఱుపఁబడియున్నది - అదియెట్లనగ - వడ్డియుఅసలునుఫలమువల్లతీర్చుకొనునట్లుకుదవయుంచినభూమ్యాదులనుఅడిగీరగానేకుదవయుంచినవానికివదలవలసినది - కుదవయుంచినభూమ్యాదులయందుఁగలిగినఫలమువడ్డికిఁగాననుభవింపుచుండుమనియుంచినకుదవయందుఁగలిగినఫలము వడ్డీకంటెనధికముగనుండెనేని అదిఅసలునకుచెల్లువచ్చును - ఆఫలమువడ్డీకేచాలనిపక్షమందావడ్డీశేషమును అసలునురాఁబట్టుకొనియాకుదవనువిడిచిపెట్టవలసినది ॥ అయితేకుదవయుంచునపుడుఆభూమ్యాదులయందుత్పన్నమగుఫలము ఋణద్రవ్యపువడ్డీకంటెహెచ్చయినను తక్కువయినను ఆవడ్డీకేసరియగుచుండవలసినదనినిర్ణయముగలిగియున్నయెడలఆనిర్ణయప్రకారముజరగవలసినదిగనుక అపుడా యప్పుతీసుకొన్నవాఁడు అసలుద్రవ్యమును చెల్లించినపుడుఅభ్యంతరము చెప్పకకుదవనువిడుదలచేయవలసినది ॥ ౬౩

ఆయకముంచినవిషయము

వడ్డికిచెల్లుగా ఫలముననుభవించువిషయము.

ఋణాదానప్రకరణమాయెను - * ఇఁకనుపనిధిప్రకరణము.

మూ. { భాజనస్థమనాఖ్యాయహస్తేన్యస్యయదర్ప్యతే। ద్ర
వ్యంతదౌపనిధికంప్రతిదేయంతథైవతత్ ॥ ౬౪ ॥** }

వ్యా॥ అథోపనిధింప్రత్యాహ॥ భాజనేతి॥ నిక్షిప్తస్యద్రవ్యస్యాధారభూతంద్రవ్యాంతరంభాజనంకరండకాది - తత్స్థంభాజనస్థంయద్ద్రవ్యంరూపసంఖ్యాదివిశేషమనాఖ్యాయాకథయిత్వా ముద్రితమన్యస్యహస్తేరక్షణార్థంవిశ్రంభాదర్ప్యతేస్థాప్యతేతద్ద్రవ్యమౌపనిధికముచ్యతే - యథాహనారదః - అసంఖ్యాతమవిజ్ఞాతం సముద్రంయన్నిధీయతే। తజ్జానీయాదుపనిధింనిక్షేపంగణితంవిదురితి॥ ప్రతిదేయంతథైవతత్ - యస్మిన్స్థాపితంతేనైవయథా[illegible]

ర్వం ముద్రాదిచిహ్నితమర్పితం తత్తథైవస్థాపకాయ ప్రతిదేయం ప్రత్యర్పణీయం॥ ౧౮౪

తా॥ ఇఁక మీఁదనుపనిధివిషయము చెప్పఁబడుచున్నది ॥ ఏద్రవ్యమైనను బరణి చొంబు మొదలగు దానియందుంచి లకోటాచేసి ముద్రవేసి నమ్మికవల్ల దీనిఁగాపాడి మరల నేనడిగినపుడిమ్మని యొకని యొద్దనుంచఁబడునో అదియుపనిధియనంబడును । ఎంచి దాచనుంచినద్రవ్యమును నిక్షేపమనంబడును- ఇట్లు నారదులచేఁజెప్పఁబడియున్నది - దానినుంచుకొన్నవాఁడా ముద్రను చెఱపక కాపాడి యుంచిన వాఁడడిగినపుడు అట్లే మరల వానికొసఁగవలయును. ౧౮౪

బరణి మొదలగు దానియందుంచి ముద్రించి డాఁచనుంచిన విషయము.

మూ. నదాప్యోపహృతం తత్తు రాజదైవికతస్కరైః॥ ౧౮౫ ॥

వ్యా॥ ప్రతిదేయమిత్యస్యాపవాదమాహ॥ నదాప్యఇతి ॥ తముపనిధిం రాజ్ఞాదైవేనోదకాదినా- తస్కరైర్వా అపహృతం నష్టం నదాప్యోసౌయస్మిన్నుపనిహితం ద్రవ్యం తద్ధనేనైవ ద్రవ్యం నష్టం- యదిజిహ్మకారితం నభవతి- యథాహ నారదః॥ గ్రహీతుస్సహయో ర్థేన నష్టో నష్టస్స దాయినః। దైవరాజకృతే తద్వన్న చేత్తజ్జిహ్మకారితమితి॥ ౧౮౫ ॥

తా॥ అట్టిదానిమఱలనీయనక్కఱలేని విషయము॥ దైవోపద్రవము చేతఁగాని రాజోపద్రవము చేతఁగాని దొంగలచేతఁగాని ఉపనిధి పోయినపక్షమందు దానినుంచుకొన్నవాఁడుంచినవానికిమఱలనీయనక్కఱలేదు- ఆయుపద్రవము ఉంచుకొన్నవాని కపటమువలనఁగలిగియుండెనా అప్పుడు మఱలనిచ్చుటకతఁడుబాధ్యుఁడుగా నేయుండును-ఇట్లు నారదులచేఁజెప్పఁబడియున్నది॥ ౧౮౫

పైనఁజెప్పినరీతినుంచఁబడిన దాఁపుడుసొమ్మునక్కఱ పాయమువచ్చె నేని.

మూ. భ్రేషశ్చేన్మార్గితేదత్తే దాప్యోదండంచ తత్సమం॥ ౧౮౬ ॥

వ్యా॥ అస్యాప్యపవాదమాహ॥ స్వామినామార్గితేయాచితే యదినదదాతి- తదాతదుత్తరకాలం యద్యపి రాజాదిభిర్భ్రేషో నాశస్సంజాతస్తథాపి తద్ద్రవ్యం మూల్యకల్పనయాధనినే గ్రహీతాదాప్యః - రాజ్ఞేచ తత్సమం దండం॥

తా॥ అట్టియుపనిధినుంచినవాఁడువచ్చియడిగినపుడిచ్చుటకభ్యంతరము చేసిన పక్షమందు పిమ్మట నది పైనఁజెప్పిన దైవాద్యుపద్రవముల చేత నష్టమైనను రాజవర్యుండానిధిగ్రాహకునివలన దాని వెలను ఉంచినవానికిప్పించి దాని వెలకు సరియైనరూకల నపరాధముగాఁదానుతీసుకొనవలసినది॥ ౧౮౬

అట్టిదాఁపుడుద్రవ్యమునడిగినపుడియ్యనిపక్షమందు.

మూ. ఆజీవం స్వేచ్ఛయాదండ్యో దాప్యస్తంవాపి సోదయమ్॥ ౧౮౭ ॥

వ్యా॥ భోక్తారం ప్రత్యాహ॥ ఆజీవన్నితి॥ యస్స్వేచ్ఛయాస్వామ్యననుజ్ఞయోపనిహితం ద్రవ్యమాజీవత్యుపభుఙ్క్తే-వ్యవహరతివా ప్రయోగాదినాలాభార్థం - అసావుపభోగానుసారేణలాభానుసారేణచ దండ్యః తంచోపనిధింసోదయముపభోగేసవృద్ధికం వ్యవహారేసలాభం ధనినేదాప్యః- వృద్ధిప్రమాణంచ కాత్యాయనేనోక్తం ॥ నిక్షేపం వృద్ధిశేషంచ క్రయం విక్రయమేవచ । యాచ్యమానోనచేద్దద్యాద్వర్ధతే పంచకంశతమితి॥ఏతచ్చభక్షితే ద్రష్టవ్యం॥ ఉపేక్షాజ్ఞాననష్టేతు తేనైవవిశేషోదర్శితః। భక్షితం సోదయం దాప్యస్సమం దాప్యఉపేక్షితం । కించిన్న్యూనం ప్రదాప్యస్స్యాద్ద్రవ్యమజ్ఞాననాశితమితి- కించిన్న్యూనం చతుర్థాంశహీనం॥ ౧౮౭

తా॥ డాఁచనుంచినద్రవ్యమును ఉంచినవానియనుమతి లేక అనుభవించినను వ్యాపారము చేయుటకుపయోగపఱచుకొన్నను ప్రభువు వానిలాభమునకుఁదగినదండనవిధించి అనుభవించినపక్షమందు వడ్డితోడను వ్యాపారము చేసియున్న పక్షమందు లాభముతోడను.దాచనుంచినవానికిప్పింపవలయును- దీనికివడ్డియెంతయనిన- డాఁపుడుద్రవ్యమును - వడ్డిగానిలిచియున్న ద్రవ్యమును- కొన్నసొమ్ము వెలను - అమ్మినసొమ్మును - వీనినిఅడిగినప్పుడీని పక్షమందు నూటికిఅయిదువంతునవడ్డి పెరుగుననికాత్యాయనులచేఁజెప్పఁబడియున్నది- ఈ చెప్పినఅనుభవించియియ్యనివానివిషయము ఉంచుకొన్నవానియుపేక్షచేత ద్రవ్యనాశముగలిగియున్న పక్షమందసలు మాత్రమిప్పించవలసినదనియు - తెలి

డాఁపుడు ద్రవ్యము ననుభవించిన పక్షమందు

యమిచేత ద్రవ్యనాశముకలిగినపక్షమందు అసలులోనాలవపాలు త్రోసివుచ్చేసికడమ ద్రవ్యమిప్పించవలయుననియు నాకాత్యాయనులేచెప్పియున్నారు॥ ౬౫

మూ॥ యాచితాన్వాహితన్యాసనిక్షేపాదిష్వయంవిధిః॥ ౬౬॥

వ్యా॥ ఉపనిధేర్ధర్మాన్యాచితాదిష్వతిదిశతి॥ యాచితేతి ॥ వివాహోద్యుత్సవేషువస్త్రాలంకరణాదియాచిత్వానీతంయాచితం- యదేకస్యహస్తేనిహితంద్రవ్యం తేనాప్యనుపశ్చాదన్యస్యహస్తేస్వామినే దేహీతినిహితం యత్తదన్వాహితం- న్యాసోనామ- గృహస్వామినేదర్శయిత్వాతత్పరోక్షమేవగృహజనహస్తేప్రక్షేపోగృహస్వామినే సమర్పణీయమితి- సమక్షంతుసమర్పణంనిక్షేపః- ఆదిశబ్దేనసువర్ణకారాదిహస్తేకటకాదినిర్మాణాయన్యస్తస్య సువర్ణాదేఃప్రతిన్యాసస్యపరస్పరప్రయోజనాపేక్షయా త్వయేదంమదీయంరక్షణీయంమయేదంత్వదీయంరక్ష్య తఇతిన్యస్తస్యగ్రహణం- యథాహ నారదః॥ ఏషఏవవిధిర్దృష్టోయాచితాన్వాహితాదిషు । శిల్పిషూపనిధౌన్యాసే ప్రతిన్యాసేతథైవచేతి- ఏతేషుయాచితాదిష్వయంవిధిరుపనిధేర్యఃప్రతిదానాదివిధిస్సఏవవేదితవ్యః॥ ౬౬

తా॥ యాచితమనఁగాఎరువుదీసుకొన్నసొమ్ము - అన్వాహితమనఁగాఒకఁడుదెచ్చినసొమ్మునతఁడుమఱియొకనిచేత ఆసొమ్ముగలవానికొప్పగింపుమని యిచ్చినది - న్యాసమనఁగా ఇంటివానికొప్పగింపుమనియాయింటనుండువారిచేతనిచ్చినది- నిక్షేపమనఁగా లెక్కించి యొకనికొగ్గిరమంచినద్రవ్యము- ఆదిశబ్దమువలన భూషణములుచేయనగసాలవానికొద్దనిచ్చినద్రవ్యము - ఇద్దరుచేరియొకరిసొత్తునొకరు కాపాడునట్లుమాటలాడుకొనియుంచుకొన్నది వీనికన్నిటికినిమఱలనొప్పగింపుక్రమము పూర్వశ్లోకమందు ఉపనిధికిచెప్పినట్లేయనియెఱుఁగవలయును - ఇట్లు నారదులచేఁజెప్పఁబడియున్నది॥ ౬౬

ఎరవుసొమ్ము మొదలగు వానికినిదియెక్రమము.

—❁ నిక్షేపప్రకరణముముగిసెను- ఇఁకసాక్షిప్రకరణము. ❁—

అవతారికా॥ ప్రమాణంలిఖితంభుక్తిస్సాక్షిణశ్చేతికీర్తితమిత్యుక్తం తత్రభుక్తిర్నిరూపితా - సంప్రతిసాక్షిస్వరూపంనిరూప్యతే- సాక్షీచసాక్షాద్దర్శనాచ్ఛ్రవణాచ్చభవతి- యథాహమనుః॥ సమక్షదర్శనాత్సాక్ష్యంశ్రవణాచ్చైవసిధ్యతీతి॥ సచద్వివిధః కృతోకృతశ్చేతి - సాక్షిత్వేననిరూపితఃకృతః - అనిరూపితోఽకృతః - తత్రకృతఃపంచవిధోఽకృతశ్చషడ్విధఇతి సాక్ష్యేకాదశవిధః- యథాహ నారదః॥ ఏకాదశవిధస్సాక్షీశాస్త్రేదృష్టోమనీషిభిః । కృతఃపంచవిధోజ్ఞేయోఽకృతష్షడ్విధఉచ్యతే। తేషాంచభేదస్తేనైవదర్శితః॥లిఖితఃస్మారితశ్చైవయదృచ్ఛాభిజ్ఞఏవచ। గూఢశ్చోత్తరసాక్షీచసాక్షీపంచవిధఃకృతఇతి । లిఖితాదీనాంచస్వరూపంకాత్యాయనేనోక్తం-అర్థినాస్వయమానీతోయోలేఖ్యేసన్నివేశ్యతే। ససాక్షీలిఖితోనామస్మారితఃపత్రికాదృతఇతి॥ స్మారితఃపత్రకాదృతఇత్యస్యవివరణం తేనైవకృతం- యస్తుకార్యప్రసిద్ధ్యర్థందృష్ట్వాకార్యంపునఃపునః । స్మార్యతేచార్థినాసాక్షీ సస్మారితఇహోచ్యతఇతి॥ యస్తుయదృచ్ఛయాగతస్సాక్షీవిధీయతే- సయదృచ్ఛాభిజ్ఞః- అనయోఃపత్రానారూఢత్వేపిభేదస్తేనైవదర్శితః॥ ప్రయోజనార్థమానీతఃప్రసంగాదాగతశ్చయః। ద్వౌసాక్షిణౌత్వలిఖితౌపూర్వపక్షస్యసాధకావితి- తథా- అర్థినాస్వార్థసిద్ధ్యర్థంప్రత్యర్థివచనంస్ఫుటం। యశ్శ్రావ్యతేస్థితోగూఢోగూఢసాక్షీసఉచ్యతఇతి- తథా- సాక్షిణామపియస్సాక్ష్యముపర్యుపరిభాషతే। శ్రవణాచ్ఛ్రావణాద్వాపిససాక్ష్యుత్తరసంజ్ఞితఇతి - షడ్విధస్యాప్యకృతస్యభేదోనారదేనదర్శితః - గ్రామశ్చప్రాడ్వివాకశ్చ రాజాచ వ్యవహారిణాం ।కార్యేష్వధికృతోయస్స్యాదర్థినాప్రహితశ్చయః । కుల్యాఃకులవివాదేషువిజ్ఞేయాస్తేపిసాక్షిణఇతి - ప్రాడ్వివాకగ్రహణం లేఖకసభ్యోపలక్షణార్థం లేఖకఃప్రాడ్వివాకశ్చసభ్యాశ్చైవానుపూర్వశః । నృపేపశ్యతితత్కార్యం సాక్షిణస్సముదాహృతాఇతి॥

తా॥ ప్రమాణమనఁగానొకకార్యముజరిగినదనుటకుఁగలిగియుండుసాధనము - అట్టిప్రమాణము- వ్రాతయనియు. అనుభవమనియు. సాక్షులనియు . మూఁడువిధములుగానుండఁగను - అందనుభవస్వరూపమును ముందే తెలుపఁబడియె - ఇచటసాక్షులస్వరూపముతెలుపఁబడుచున్నది॥

సాక్షి స్వరూపమును దె

లుపుట.

సాక్షి ఒకకార్యముజరుగఁగాఁజూచినవాఁడనియు-వినినవాఁడనియు రెండువిధములుగానుండును- ఇట్లుమనువుచేఁజెప్పఁబడియున్నది । ఇందొకరొకరికి మరల రెండుభేదములుగలవు- నిర్ణయించుకోఁబడినవాఁడు నిర్ణయించుకోఁబడనివాఁడు -అని।వీరియందునిర్ణయించుకోఁబడినసాక్షి అయిదువిధంబులుగానుండును- నిర్ణయించుకోఁబడనిసాక్షియాఱువిధములుగానుండును- ఈరీతిగాసాక్షిపదకొండువిధములుగానుండును॥ —— నిర్ణయించుకోఁబడిన అయిదువిధముల సాక్షులకుఁగల భేదంబులు కాత్యాయనాదులచేవివరింపఁబడియున్నది- అదియెట్లనిన। పత్రము వ్రాయించుకొను వానిచేఁబిలువఁబడివచ్చిపత్రమందు చేవ్రాలుచేసినవాఁడు లిఖితసాక్షియనంబడును ౧ । జరిగినకార్యముబైలుపడియుండవలయుననుతలంపుచేత కార్యార్థియైనవాఁడొకనిఁబిలిచియీజరిగినకార్యమునునీవుమఱువవలదని పలుమాఱుచెప్పి నేని అట్లుచెప్పఁబడి యెఱిఁగినసాక్షి స్మారితుఁడనంబడును ౨ । తనంతటవచ్చిజరిగినకార్యమును కార్యార్థి దెలుపఁగా నెఱిఁగినసాక్షియదృచ్ఛాభిజ్ఞుఁడనంబడును ౩ । వాది తనవ్యవహారముసిద్ధించుటకై యొకనిఁబిలుచుకొనివచ్చి దాఁచియుంచి తాను ప్రతివాదితో నాడుమాటలు వినుచుండుమన్నపక్షమందట్లుదాగియుండివ్యవహారము నెఱిఁగినవాఁడు గూఢసాక్షియనంబడును ౪ । సాక్షులు గుత్తెఱిఁగినసంగతివినియుండిగాని సాక్షులచేవినుపింపఁబడియుండిగాని సాక్షులమీఁదసాక్ష్యముఁబలుకువాఁడు ఉత్తరసాక్షి యనంబడును ౫ ॥

నిర్ణయించుకోఁబడినసాక్షులైదువిధములవారు

—— నిర్ణయించుకోఁబడని యాఱువిధములసాక్షులును నారదులచేవివరింపఁబడియున్నారు ఎట్లనిన- గ్రామస్థులొకవిధమైనసాక్షులు ౧ - రాజసభయందుజరిగినవ్యవహారములకు ఆసభయందుండెడుసభికులును రాజవర్యునిచేనధికారమునుబొంది వ్యవహారముల విచారించువాఁడును అచ్చటియుద్యోగస్థులునువీరందఱుఒకవిధమైనసాక్షులు ౨- భూపాలుండొకసాక్షి ౩ - వ్యాపారముచేయువారికార్యములనువిచారింపనువారేర్పఱచుకొనియుంచుకార్యస్థుఁడొకసాక్షి ౪- వాదిచేఁబంపఁబడినవాఁడొకసాక్షి ౫ - కులవిషయకములైనవ్యవహారములయందుకులమువారొకవిధమైనసాక్షులు॥ ౬

నిర్ణయించుకోఁబడనిసాక్షులాఱు విధములవారు

మూ. తపస్వినోదానశీలాఃకులీనాస్సత్యవాదినః । ధర్మప్రధానాఋజవఃపుత్రవంతోధనాన్వితాః ॥ త్ర్యవరాస్సాక్షిణోజ్ఞేయాః శ్రౌతస్మార్తక్రియాపరాః । యథాజాతియథావర్ణంసర్వేసర్వేషువాస్మృతాః॥ ౬౮

వ్యా॥ తేసాక్షిణఃకీదృశాఃకియంతశ్చభవంతీత్యతఆహ॥ తపస్వినఇత్యాది॥ తపస్వినస్తపశ్శీలాః - దానశీలాః దాననిరతాః- కులీనాఃమహాకులప్రసూతాః- సత్యవాదినస్సత్యవచనశీలాః- ధర్మప్రధానాః - నార్థకామప్రధానాః- ఋజవోఽకుటిలాః- పుత్రవంతఃపుత్రాన్వితాః- ధనాన్వితాః బహుసువర్ణాదిధనయుక్తాః-శ్రౌతస్మార్తక్రియాపరాః నిత్యనైమిత్తికానుష్ఠానరతాః - ఏవంభూతాః పురుషాస్త్ర్యవరాఃసాక్షిణోభవంతి- త్రయఃఅవరాః న్యూనాయేషాంతేత్ర్యవరాస్త్రిభ్యోర్వాఙ్నభవంతిపరతస్తుయథాకామంభవంతీత్యర్థః - జాతిమనతిక్రమ్యయథాజాతిజాతయోమూర్ధావసిక్తాదయఅనులోమజాఃప్రతిలోమజాశ్చ-తత్రమూర్ధావసిక్తానాంమూర్ధావసిక్తాస్సాక్షిణోభవంతి-ఏవమంబష్ఠాదిష్వపిద్రష్టవ్యం-వర్ణమనతిక్రమ్యయథావర్ణం-వర్ణాఃబ్రాహ్మణాదయః- తత్రబ్రాహ్మణానాంబ్రాహ్మణాఏవోక్తలక్షణాఉక్తసంఖ్యాకాస్సాక్షిణోభవంతి- ఏవంక్షత్రియాదిష్వపిద్రష్టవ్యం-తథా-స్త్రీణాంసాక్ష్యంస్త్రియఃకుర్యుః- యథాహమనుః॥ స్త్రీణాంసాక్ష్యంస్త్రియఃకుర్యురితి - సజాతిసవర్ణాసంభవే - సర్వేమూర్ధావసిక్తాదయోబ్రాహ్మణాదయశ్చసర్వేషుమూర్ధావసిక్తాదిషు బ్రాహ్మణాదిషుచ యథాసంభవం సాక్షిణోభవంతి- ఉక్తలక్షణానాంసాక్షిణామభావేప్రతిషేధరహితానామన్యేషామపి సాక్షిత్వప్రతిపాదనార్థం పునస్సాక్షిణోవక్తవ్యాః- తేచపంచవిధానారదేనదర్శితాః॥ అసాక్ష్యపిహిశాస్త్రేషుదృష్టఃపంచవిధోబుధైః । వచనాద్దోషతోభేదాత్స్వయముక్తిమృతాంతరఇతి॥ కేపునర్వచనాదసాక్షిణఇత్యతఆహ॥ శ్రోత్రియాస్తాపసావృద్ధాయేచప్రవ్రజితాదయః॥ అసాక్షిణస్తేవచనాన్నాత్రహేతురుదాహృతఇతి॥ తాపసావానప్రస్థాః-ఆదిశబ్దేనపిత్రా

కసాక్ష్యమునకుతగఁడు - సాక్ష్యమునకుగాఁబిలువఁబడిఅర్థివలనఁగాని ప్రత్యర్థివలనఁగాని వినవలసినవిషయముల నుసమగ్రముగ వినకమునుపువినుపింపఁవలసినవాఁడు మృతుఁడై నపక్షమందతఁడావిషయమంతయు నెఱుఁగనివాఁడు గానుండునుగనుకసాక్ష్యమునకుఁదగఁడు- ఇట్టివాఁడై దవవిధమువాఁడు- ఇతఁడుమృతాంతరుఁడనంబడును - ఇట్టివా నిసాక్ష్యమునకుఁ బ్రసక్తిదాపుడుసొమ్ముఎరువుదీసుకొన్నసొమ్ము మొదలగువిషయములయందుఁగలుగును - ఆవిషయ ములలో నర్థిగాని ప్రత్యర్థిగానిసాక్షులకుఁదెలిసినవిషయమును దమకుమారులు మొదలగువారితోసీవిషయమందు వీరుసాక్షులని తానుమృతినొందుకాలమందుఁగాని తత్పూర్వముగాని చెప్పియున్నపక్షమున నీమృతాంతరుని సాక్ష్య మంగీకరింపఁబడును॥

మూ॥ { స్త్రీబాలవృద్ధకితవమత్తోన్మత్తాభిశస్తకాః । రంగావతారిపాషండికూట
కృద్వికలేంద్రియాః ॥ పతితాప్తార్థసంబంధి సహాయరిపుతస్కరాః॥
సాహసీదృష్టదోషశ్చనిర్ధూతాద్యాస్త్వసాక్షిణః॥ ౭౦ ॥******* }

వ్యా॥ తానేతానసాక్షిణోదర్శయతి॥ స్త్రీబాలేతి॥ స్త్రీప్రసిద్ధా-బాలోఽప్రాప్తవ్యవహారః- వృద్ధోశీతికా త్పరః- వృద్ధగ్రహణంవచననిషిద్ధానామన్యేషామపిశ్రోత్రియాదీనాముపలక్షణార్థం- కితవోఽక్షదేవీ- మత్తఃపా నాదినా- ఉన్మత్తోగ్రహావిష్టః- అభిశస్తోఽభియుక్తోబ్రహ్మహత్యాదినా- రంగావతారీచారణః- పాషండినోనిర్గ్రం థప్రభృతయః-కూటకృత్కూటలేఖ్యకారీ-వికలేంద్రియఃశ్రోత్రావిరహితః-పతితోబ్రహ్మహాదిః- ఆప్తస్సుహృత్- అర్థసంబంధీవిప్రతిపద్యమానార్థసంబంధీ- సహాయఏకకార్యార్థః- రిపుశ్శత్రుః- తస్కరస్తేనః -సాహసీబ లావష్టంభకారీ దృష్టదోషోదృష్టవితథవచనః- నిర్ధూతోబంధుభిస్త్యక్తః- ఆద్యశబ్దేనాన్యేషామపిస్మృత్యంతరోక్తా నాందోషాదసాక్షిణాం భేదాదసాక్షిణాంస్వయముక్తైమృతాంతరస్యచ గ్రహణం - ఏతేస్త్రీబాల వృద్ధాదయస్సా క్షిణో భవంతి ॥ ౭౦

తా॥ ఆఁడుది- వ్యవహారయోగ్యతలేనిపసివాఁడు- పూర్వశ్లోకవ్యాఖ్యానస్థమైననారదవచనమందుచెప్పినరీ తినిఎనఁబదేండ్లకుఁజై వయసుగలముసలివాఁడు - వానప్రస్థుఁడు మొదలగువారందరు ను- జూదరి- తాగిమయకముతోనుండువాఁడు - భూతముపట్టినవాఁడు- బ్రహ్మహ త్యాదులచేతనిందఁబొందినవాఁడు-వేషములువేయువాఁడు- గ్రంథములయందుఁబ్రా మాణ్యములేనివాఁడు-తప్పుపత్రములువ్రాయువాఁడు - చెవిటివాఁడు - గుడ్డివాఁడు- మొదలగునింద్రియలోపముగలవారు- జాతికిలోపమురాఁదగినపాపముచేసినవాఁడు- స్నేహితుఁడు- వివాదవిషయ మైనద్రవ్యముతోసంబంధముగలవాఁడు- సహాయుఁడుగానుండువాఁడు- శత్రువు - దొంగ-సాహసమునకుఁబూను వాఁడు- ఒకసారియబద్ధముఁజెప్పినవాఁడు- బంధువులచేతవెలివేయఁబడినవాఁడు-ఆద్యశబ్దముచేతపూర్వశ్లోకవ్యా ఖ్యానస్థమైనస్మృత్యంతరవాక్యములయందునిషేధింపఁబడినవారును- వీరందఱుసాక్ష్యమునకుఁదగరు॥ ౬౯-౭౦

ఇదియసాక్ష్యమునకుఁద గనివారివివరణమె.

మూ॥ ఉభయానుమతస్సాక్షీభవత్యేకోపిధర్మవిత్ ॥ ౭౧ ॥

వ్యా॥ త్ర్యవరాస్సాక్షిణోజ్ఞేయాఇత్యస్యాపవాదమాహ॥ ఉభయేతి॥ జ్ఞానపూర్వంనిత్యనైమిత్తికధర్మా నుష్ఠాయీధర్మవిత్ - సఏకోప్యుభయానుమతశ్చేత్సాక్షీభవతి- అపిశబ్దబలాద్ద్వావపి-శ్రౌతస్మార్తక్రియాపరా ఇతిత్ర్యవరాణామపిధర్మవిత్త్వంసమానం- తథాపితేషాముభయానుమత్యభావేపిసాక్షిత్వంభవత్యేవ -ఏకస్య ద్వయోర్వోభయానుమత్యైవసాక్షిత్వంభవతీత్యర్థవత్త్ర్యవరగ్రహణం॥ ౭౧

తా॥ ముగ్గురికంటెఁదక్కువవారైననుసాక్ష్యమునకుఁదగువిషయము ॥ అర్థిప్రత్యర్థు లిద్దఱునుధర్మవేత్తగానుండునొకనిఁగాని ఇద్దఱిఁగానిసాక్ష్యమున కేర్పఱచుకొన్నప క్షమందవ్వారేర్పఱచుకోఁబడినవారుముగ్గురికంటెతక్కువయనివారిసాక్ష్యమునుత్రోయఁ గూడదు-ధర్మవేత్తలుగానుండవలసినదనునంశముముగ్గురికంటెనధికసంఖ్యగలవారి విషయమందునుసమానమే-ఐనను వారివిషయమందుభయులసమ్మతియక్కఱలేదు.

వాదిప్రతివాదులిద్దఱు సమ్మతించి రేనిమంచిసా క్షియొకఁడేచాలును.

మూ॥ సర్వస్సాక్షీసంగ్రహణేచౌర్యేపారుష్యసాహసే॥ ౭౧ ॥

వ్యా॥ తపస్వినోదానశీలాఇత్యస్యాపవాదమాహ॥ సర్వఇతి ॥ సంగ్రహణాదీనివక్ష్యమాణలక్షణాని - తేషు సర్వేవచననిషిద్ధాస్తపఃప్రభృతిగుణరహితాశ్చసాక్షిణోభవంతి - దోషాదసాక్షిణోభేదాదసాక్షిణః స్వయముక్తిశ్చాత్రాపిసాక్షిణోనభవంతి - సత్యాభావాదిహేతోరత్రాపివిద్యమానత్వాత్ - మనుష్యమారణంచౌర్యం పరదారాభిమర్శనం। పారుష్యముభయంచేతిసాహసంస్యాచ్చతుర్విధమితి వచనాద్యద్యపిస్త్రీసంగ్రహణ చౌర్యపారుష్యాణాంసాహసత్వం- తథాపి తేషాంస్వబలావష్టంభేనజనసమక్షంక్రియమాణానాంసాహసత్వం - రహసిక్రియమాణానాంతుసంగ్రహణాదిశబ్దవాచ్యత్వమితి- తేషాంసాహసాత్పృథగుపాదానం॥ ౭౧

తా॥ తపస్సు- ఈవి- మొదలగులక్షణములులేనివారైనను సాక్ష్యమునకుఁదగియుండు విషయము॥ రహస్యముగాఁబరస్త్రీలఁబట్టినవిషయమందును- దొంగతనమందును ఒకనిరహస్యముగాఁగొట్టినతిట్టినవిషయమందును- బలగర్వముచేత నందఱుచూచుచునప్పుడేయొకనిభార్యనుబట్టినవిషయమందును - అప్రకాశమే యొకనిఁగొట్టిన తిట్టిన విషయమందును- ఒకనిద్రవ్యమునుగొల్లగొట్టినవిషయమందును - మనుష్యునిఁజంపినవిషయమందును - పైని దోషము వలనను భేదము వలనను తానే చెప్ప వచ్చుట వలనను- సాక్ష్యమునకుఁదగరనితోఁపుడుచేయఁబడినవారుతప్పకడమువారనఁగాతపోదానాదిగుణరహితులైనవారును వచననిషిద్ధులయినశ్రోత్రియాదులునుసాక్ష్యమునకుఁదగుదురు॥ ౭౧

సాక్షులకుఁబైనఁజెప్పిన లక్షణములు దొంగతనము మొదలగువిషయములలోనక్కఱలేదు.

మూ॥ సాక్షిణశ్శ్రావయేద్వాదిప్రతివాదిసమీపగాన్॥ ౭౨ ॥

వ్యా॥ సాక్షిశ్రావణమాహ॥ సాక్షిణఇతి ॥ అర్థిప్రత్యర్థిసన్నిధౌసాక్షిణస్సమవేతాన్-నాసమవేతాఃపృష్టాఃప్రబ్రూయురితిగౌతమవచనాత్ - వక్ష్యమాణంశ్రావయేత్ - తత్రాపికాత్యాయనేనవిశేషోదర్శితః- సభాంతస్సాక్షిణస్సర్వానర్థిప్రత్యర్థిసన్నిధౌ। ప్రాడ్వివాకోనియుంజీతవిధినానేనసాంత్వయన్ ॥ దేవబ్రాహ్మణసాన్నిధ్యేసాక్ష్యంపృచ్ఛేదృతంద్విజాన్। ఉదఙ్ముఖాన్ప్రాఙ్ముఖాన్వాపూర్వాహ్ణేవైశుచిశ్శుచీన్ । ఆహూయసాక్షిణః పృచ్ఛేన్నియమ్యశపథైర్భృశం। సమస్తాన్విదితాచారాన్విజ్ఞాతార్థాన్పృథక్పృథగితి। తథాబ్రాహ్మణాదిషుశ్రావణేమనునానియమోదర్శితః॥ సత్యేనశాపయేద్విప్రంక్షత్రియంవాహనాయుధైః। గోబీజకాంచనైర్వైశ్యంశూద్రంసర్వైస్తుపాతకైరితి- బ్రాహ్మణమన్యథాబ్రువతస్సత్యంతేనశ్యతీతిశాపయేత్ - క్షత్రియంవాహనాయుధానితవవిఫలానీతి- వైశ్యంగోబీజకాంచనానితవవిఫలానీతి - శూద్రమన్యథాబ్రువతస్తవసర్వాణిపాతకానిభవిష్యంతీతిశాపయేత్ - అత్రచాపవాదస్తేనైవదర్శితః - గోరక్షకాన్వాణిజకాంస్తథాకారుకుశీలవాన్। ప్రేష్యాన్వార్ధుషికాంశ్చైవవిప్రాంఛూద్రవదాచరేదితి॥ విప్రగ్రహణంక్షత్రియవైశ్యయోరుపలక్షణార్థం- కారవోరజకకార్యాధికారిణః- కుశీలవాఃగాయనాః - ప్రతివాదినాసాక్షిదూషణేదత్తేప్రత్యక్షదూషణయోగ్యేషుబాల్యాదిషుతత్రైవనిర్ణయః-అయోగ్యేషుతుతద్వచనాల్లోకతశ్చనిర్ణయోనసాక్ష్యంతరేణేతినానవస్థా - యదిసాక్షిదోషముద్భావ్యసాధయితుంనశక్నోతిప్రతివాదీతదాసౌశాస్త్రానుసారేణదండ్యః - అథసాధయతితదానతేసాక్షిణఃయథాహ - అసాధయన్దమందాప్యోదూషణంసాక్షిణాంస్ఫుటం। భావితేసాక్షిణోవర్జ్యాస్సాక్షిధర్మనిరాకృతాఇతి॥ఉద్దిష్టేషువసర్వేషుసాక్షిషుముష్టివర్గీయదాక్రియాంతరనిరపేక్షస్తదాపరాజితోభవతి- జితస్సవినయందాప్యశ్శాస్త్రదృష్టేనకర్మణా।యదివాదీనిరాకాంక్షస్సాక్షిసత్యేవ్యవస్థితఇతిస్మరణాత్, సాకాంక్షశ్చేత్క్రియాంతరమవలంబేతేత్యభిప్రాయః.

తా॥ సాక్షులందఱుచేరఁగానేఅర్థిప్రత్యర్థులయెదుటన్యాయవిచారణాధికారివారలకు వ్యవహారమునువినిపించివారలచేనావిషయమందుఁ దెలిసినసంగతి సరిగాఁ జెప్పెదమనిప్రమాణముచేయించుకోవలయును ఈప్రమాణమందఱుసాక్షులుచేరినపుడు చేయింపవలసినదనిగౌతములుచెప్పియున్నారు- ప్రాడ్వివాకుఁడుపూర్వాహ్ణమందు అర్థిప్రత్యర్థులయెదుట- ప్రస్తుతవ్యవహారమునుసాధారణములైన వాడుకలనుదెలిసినపరిశుద్ధులైనసాక్షు

సాక్షివిమర్శ సేయునపుడు వారికివినుపింపఁదగిన విషయము.

లను దేవబ్రాహ్మణసన్నిధియందుఁ బూర్వముఖముగాఁగాని యుత్తరముఖముగాఁగాని నిలిపి బుజ్జగించుచుఁ బ్రమాణము
చేయించుకొని యొకరొకరిగ నుండ సాక్ష్యము వినవలయునని కాత్యాయనులు చెప్పియున్నారు ‖ ప్రమాణము చేయింపవ
లసిన క్రమము - బ్రాహ్మణుని నీ వెఱిఁగిన సంగతి సరిగాఁ జెప్పక పోయినపక్షమందు సత్యము చెడుననియు - క్షత్రియుని నీ
వు నిజముఁ జెప్పనిపక్షమందు నీ వాహనాయుధములు నిష్ఫలములై పోవుననియు - వైశ్యుని నీవు వ్యత్యస్తముగాఁ జెప్పినపక్ష
మందు గోవులును విత్తనమును కాంచనంబును విఫలములై పోవుననియు - శూద్రునిఁ దెలిసిన సంగతి సరిగాఁ జెప్పనిపక్ష
మందు సమస్తపాపములు సంభవించుననియుఁ బ్రమాణము చేయింపవలసినదనియు - పశువుల మేపుచువర్తకము చేయు
చునుండు వారిని - చాకలిపనుల విచారించువారిని - గాయకులను - బంట్రౌతుపని చేయువారిని - వీరు బ్రాహ్మణులుగా
నుండినను శూద్రునివలెఁ బ్రమాణము చేయింపవలసినదనియు - మనువుచేఁ జెప్పఁబడియున్నది - ఇట్లు చెప్పుటచేత నేవ
ర్ణమువారైనఁ దమకుం దెదక్క వవర్ణము వారి వ్యాపారమును జేయుచుండినను - నిషిద్ధవ్యాపారమును జేయుచుం
డినను వారి నందఱను శూద్రునివలెఁ బ్రమాణము చేయింపవలయునని యెఱుఁగవలయును - ప్రతివాది - సాక్షి తగఁడనుట
కు హేతువు చెప్పినపక్షమందా హేతువు పసితనము మొదలైనదిగా నుండెనా అతఁడు చెప్పినది అట్లే యొప్పుకోఁదగును -
ఇతరహేతువు చెప్పినపక్షమందు - ప్రాడ్వివాకుఁడా సాక్షినిఁ జూచి వానిమాటలు విని యా హేతువు నిజమైనది కానిదని
ర్ణయింపవలసినదిగాని దానిఁ దెలియుటకు మఱియొక సాక్షిని గోరఁగూడదు - ప్రతివాది - సాక్షియందొక దోషమును జె
ప్పి ఋజువుపఱచఁజాలకపోయిన పక్షమందతని శాస్త్రముచొప్పున దండింపవలయును - ఋజువుపఱచెనా ఆసాక్షి నావిషయమం
దు ప్రోపుడు చేయవలయును గాని దండింపఁదగదు - అట్లు స్మృతియున్నది - మొదట వేసికొన్న సాక్షులయందు దండఱియం
దు దోషమేర్పడినపక్షమందు మఱల వేఱే సాక్షులను వేసికొనవచ్చును - ఆయపేక్ష వాదికి లేనపుడు అతని వ్యాజ్యమును
ప్రోసి వేసి ప్రతివాది సెలవుల నతనివలన నిప్పించవలయును - అట్లు స్మృతియున్నది ‖ ౭౩

మూ. { యే చ పాతకినాం లోకా మహాపాతకినాం తథా ‖ అగ్నిదానాం చ యే
లోకా యే చ స్త్రీబాలఘాతినామ్ । స తాంత్సర్వానవాప్నోతి యస్సా
క్ష్యమనృతం వదేత్ ‖ సుకృతం యత్త్వయా కించి జ్జన్మాంతరశతైః
కృతమ్ । తత్సర్వం తస్య జానీహి యం పరాజయసే మృషా ‖ ౭౪ ‖ *** }

వ్యా ‖ కథం శ్రావయేదిత్యత ఆహ ‖ య ఇత్యాది ‖ పాతకోపపాతకమహాపాతకకారిణామగ్నిదానాం స్త్రీబా
లఘాతినాం చ యే లోకాస్తాంత్సర్వానవాప్నోతి యస్సాక్ష్యమనృతం వదేదితి - తథా జన్మాంతరశతైర్యత్సుకృతం కృతం
తత్సర్వం తస్య భవతి - యస్త్వేనానృతవాదేన పరాజితో భవతీతి తం శ్రావయేదితి సంబంధః - ఏతచ్చ శూద్రవిషయం ద్రష్ట
వ్యం - శూద్రం సర్వైస్తుపాతకైరితి శూద్రే సర్వపాతకశ్రావణస్య విహితత్వాత్ - గోరక్షకాది ద్విజాతివిషయం
చ - గోరక్షకాన్వాణిజకానిత్యుక్తత్వాత్ - అన్యస్యానేకజన్మార్జిత సుకృతసంక్రమణస్య మహాపాతకోపపాతకా
దిఫలప్రాప్తేశ్చానృతవచనమాత్రేణానుపపత్తేస్సాక్షిసంత్రాసార్థమిదముచ్యతే - యథాహ నారదః - పురాణైర్ధర్మ
వచనైస్సత్యమాహాత్మ్యకీర్తనైః । అనృతస్యాపవాదైశ్చ భృశం సంత్రాసయేదిమానితి ‖ ౭౪

తా ‖ ప్రమాణము నెట్లు వినుపింపవలయుననఁగ - పాతకోపపాతకమహాపాతకములు చేసినవారికిని - ఇండ్లలోని
ప్పు పెట్టినవారికిని - స్త్రీలను బాలురను జంపినవారికి నెట్టినరకము గలుగునో - అట్టినరక
ములన్నియుఁ దప్పుసాక్ష్యముఁ బలికినవానికిఁ గలుగును - నీవబద్ధము చెప్పి యొకని వ్యా
జ్యమును జెఱిపినపక్షమందు నీవు నూఱు జన్మములలోఁ జేసిన పుణ్యమంతయు నీవల్ల పరా
జితుండైనవానిఁ బొందునని తెలిసికొమ్ము - అని వినుపింపవలయును - పైన శూద్రునకని

సాక్షులచే ప్రమాణము చేయించు క్రమము.

చెప్పఁబడిన మహాపాతకాదుల నిచ్చట చెప్పుటచేత నిది శూద్రవిషయమును శూద్రునివలెఁ బ్రమాణము చేయింపఁదగిన
వారివిషయమును అని తెలియవలయును - నూఱు జన్మములనుండి చేసిన పుణ్యములన్ని యోడిపోయినవానిఁ జెందునని
యు మహాపాతకాదులచే వచ్చు నరకములు వచ్చుననియుఁ జెప్పుట సాక్షులను బెదరింపనని తెలియునది । ప్రాచీనములై
న ధర్మవాక్యములను సత్యమహిమను వర్ణించు వాక్యములను అసత్యమును దూషించు వాక్యములను జెప్పి సాక్షుల

ను బెదరింపవలయునని నారదులచేఁ జెప్పఁబడియున్నది॥ ౭౪

మూ. {అబ్రువన్హి నరస్సాక్ష్యమృణంసదశబంధకమ్। రాజ్ఞా
సర్వంప్రదాప్యస్స్యాత్షట్చత్వారింశకేహని ॥ ౭౫ ॥}

వ్యా॥ యదాతుశ్రావితాస్సాక్షిణఃకథంచిదపిన బ్రూయుస్తదా కింకర్తవ్యమిత్యతఆహ ॥ అబ్రువన్నితి ॥ యస్సాక్ష్యమంగీకృత్యశ్రావితస్సన్కథంచిన్నవదతి సరాజ్ఞాసర్వంసవృద్ధికమృణం ధనినేదాప్యస్సదశబంధకం దశమాంశసహితం- దశమాంశశ్చరాజ్ఞోభవతి- రాజ్ఞాధమర్ణికోదాప్యస్సాని తాద్దశకంశతమిత్యుక్తత్వాత్ - షట్చత్వారింశేహని ప్రాప్తే వేదితవ్యం- తతోర్వాగ్వదన్నదాప్యః- ఇదంచవ్యాధ్యాద్యుపప్లవరహితస్య- యథాహమనుః॥ త్రిపక్షాదబ్రువంత్సాక్ష్యమృణాదిషునరోగదః। తదృణంప్రాప్నుయాత్సర్వం దశబంధంచసర్వశః ఇతి- అగద ఇతి రాజదైవోపప్లవరహితోపలక్షణం॥ ౭౫

తా॥ ప్రమాణముచేయించినపిమ్మట సాక్షులెవ్వరును జెప్పకయుండినపక్షమునజరగవలసినక్రమము ॥ సాక్ష్యమునకొప్పుకొని ప్రమాణపద్ధతినివినియేమియుఁ జెప్పకుండినవాని నలువదియాఱవదినములవరకుఁ జూచి అప్పుడును జెప్పనిపక్షమున నావ్యాజ్యమొత్తమును ఆమొత్తమునకుఁబదవపాలునకు సరియైనద్రవ్యముతోఁగూడవానిచేఁదీసి వ్యాజ్యపుమొత్తమును వ్యాజ్యగానికిప్పించి పదవపాలుద్రవ్యమును రాజుతీసుకోవలయును- ఇది వ్యాధ్యుపద్రవముగానియితరములైనదైవికరాజికోపద్రవములుగాని లేనివానివిషయము- అట్లు మనుస్మృతియందుఁ జెప్పఁబడియున్నది॥ ౭౫॥

సాక్ష్యమునకొప్పికొనిచెప్పనివానివిషయము.

మూ. {నదదాతిహియస్సాక్ష్యంజానన్నపినరాధమః। సకూట
సాక్షిణాంపాపైస్తుల్యోదండేనచైవహి ॥ ౭౬ ॥***}

వ్యా॥ యస్తుజానన్నపిసాక్ష్యమేవనాంగీకరోతి తంప్రత్యాహ ॥ నేతి ॥ యఃపునర్నరాధమోవిప్రతిపన్నమర్థంవిశేషతోజానన్నపిసాక్ష్యంనదదాతి నాంగీకరోతి- సకూటసాక్షిణాంపాపైస్తుల్యః- దండేనచ- కూటసాక్షిణాంచదండంవక్ష్యతి- కూటసాక్షిణశ్చదండయిత్వా పునర్వ్యవహారఃప్రవర్తనీయః- కృతోపికూటసాక్ష్యేవిదితేనివర్తనీయః - యథాహమనుః- యస్మిన్యస్మిన్వివాదేతుకౌటసాక్ష్యంకృతంభవేత్ । తత్తత్కార్యంనివర్తేత కృతంచాప్యకృతంభవేదితి॥ ౭౬

తా॥ ఎఱిఁగియుసాక్ష్యముచెప్పనితుడువ- పాపములచేతను - దండనచేతను- తప్పుసాక్షులతోసమానుఁడగును- అనఁగా ౮౦ వశ్లోకమందుఁ దప్పుసాక్షులదండనక్రమము చెప్పఁబడునుగనుక నాక్రమమునవానిదండింపఁదగుననుట - తప్పుసాక్ష్యముచేత నొకవ్యవహారముతీర్పుచేయఁబడినదైనను బిమ్మటఁ దెలిసినపక్షమందు దానిమార్పవలయును- అట్లు మనువచనమున్నది॥ ౭౬

ఎఱిఁగియుఁదులువతనముచేసాక్ష్యము చెప్పకుండెనేనిదండ్యుండగు.

మూ॥ {ద్వైధేబహూనాంవచనంసమేషుగుణినాంతథా। గు
ణిద్వైధేతువచనంగ్రాహ్యంయేగుణవత్తమాః॥ ౭౭॥}

వ్యా॥ సాక్షివిప్రతిపత్తౌతుకథంనిర్ణయ ఇత్యతఆహ॥ ద్వైధఇతి॥ సాక్షిణాంద్వైధేవిప్రతిపత్తౌబహూనాం వచనంగ్రాహ్యం- సమేషుసమసంఖ్యేషుద్వైధే యేగుణినస్తేషాంవచనంగ్రాహ్యం - యదాపునర్గుణినాంవిప్రతిపత్తిస్తదాయేగుణవత్తమాశ్శ్రోత్రియాధ్యయనతదర్థానుష్ఠానపుత్రాదిగుణసంపన్నాస్తేషాంవచనంగ్రాహ్యం - యత్రగుణినఃకతిపయే- ఇతరేబహవస్తత్రాపిగుణినామేవవచనంగ్రాహ్యం- ఉభయానుమతస్సాక్షీభవత్యేకోపిధర్మవిదితిగుణాతిశయస్యముఖ్యత్వాత్ -యత్తుభేవాదసాక్షిణ ఇత్యుక్తం తత్పద్యసామ్యేనాగృహ్యమాణవిశేషవిషయం॥

తా॥ సాక్షులుచెప్పినది రెండువిధములుగానున్నప్పుడు పెక్కండ్రెట్లు చెప్పియున్నారో దాని ప్రమాణముగానెంచవలయును- రెండువిధములఁ జెప్పినవారును సరిగానేయున్నపక్షమందు - వారిలోగుణవంతులుచెప్పినది ప్రమాణముగానెంచవలయును - రెండువిధములఁ బలికిన

సాక్షులు రెండువిధము

ముందటి వాఁడు లేనపుడు వెనుకటివాఁడధికారి యన్నవిధి సమానజాతీయులకుమాత్రమే.

వాఁడు దాయమునుబొందునని చెప్పినవిధి సమానజాతీయులయందే కాని భిన్నజాతీయులయందుఁబ్రవర్తింపదు - కానీనగూఢోత్పన్నసహోఢజపౌనర్భవులకు సజాతీయత్వము నెట్లు చూడవలయుననిన వీరలకు వర్ణజాతి లక్షణములు లేవు కాఁబట్టి వారియుత్పాదకుని వర్ణము నుగ్రహింపవలయును - అనులోమజాలనుమూర్ధావసిక్తాదిజాతులవా రౌరసులేయగుచున్నారు గావున వారును లేనిపక్షమున నే క్షేత్రజాదులకు దాయగ్రహణాధికారము నీయుఁగవలయును - బ్రాహ్మణాదివర్ణత్రయస్త్రీలయందుఁ బుత్రుఁడుఁ బుట్టియున్నను లేకున్నను శూద్రస్త్రీపుత్రునకుదశమభాగముకంటె నధిక మీఁగూడదను మనువచనమననుసరించి క్షేత్రజాదిపుత్రులున్నపక్షమందు వారుగాని లేనిపక్షమందు సపిండుఁడుగాని వానిధనములోఁబడవపాలుకంటె నధికము శూద్రస్త్రీపుత్రునకీఁగూడదు- క్షత్రియస్త్రీయందును వైశ్యస్త్రీయందును బుట్టినకొడుకులకుమాత్రము సమానవర్ణస్త్రీయందుఁ బుట్టినపుత్రుఁడు లేనియెడల సర్వధనమును బొందు నధికారమీవచనమువలన నేగమ్యమానమగుచున్నది॥ ౧౩౦

మూ. { జాతోపిదాస్యాం శూద్రేణకామతోంశహరోభవేత్ ॥ మృతేపితరికుర్యుస్తంభ్రాతరస్త్వర్ధభాగికం। అభ్రాతృకోహరేత్సర్వందుహితౄణాంసుతాదృతే ॥ }

వ్యా॥ అధునా శూద్రధనవిభాగేవిశేషమాహ॥ జాతఇతి ॥ శూద్రేణదాస్యాం సముత్పన్నః పుత్రః కామతః పితురిచ్ఛయా భాగంలభతే- పితురూర్ధ్వంతు యదిపరిణీతాపుత్రాస్సంతి తదా తేభ్రాతరస్తం దాసీపుత్రమర్ధభాగికంకుర్యుస్స్వభాగాదర్ధందద్యురిత్యర్థః - అథపరిణీతాపుత్రానసంతి తదా కృత్స్నంధనం దాసీపుత్రోగృహ్ణీయాత్- యదిపరిణీతాదుహితరస్తత్పుత్రావానసంతి- తత్సద్భావేత్వర్ధభాగిక ఏవదాసీపుత్రః - అత్రచశూద్రగ్రహణాద్ద్విజాతినాదాస్యాముత్పన్నః పితురిచ్ఛయాప్యంశంనలభతే నాప్యర్ధాంశం నూరతఏవకృత్స్నం - కింత్వనుకూలశ్చేజ్జీవనమాత్రంలభతే॥ ౧౩౧

తా॥ శూద్రధనవిభాగమందువిశేషమును జెప్పుచున్నాఁడు॥ శూద్రునకుదాసియందుఁ బుత్రుఁడు పుట్టినపక్షమందు అతనికిఁదండ్రియున్నప్పుడా తండ్రియే తనయాస్తినిఁబుత్రులకుఁబంచియిచ్చునట్టులయినఁదనయిష్టానుసారముగాఁబుత్రసమభాగ మీవచ్చును - తండ్రిగతించినపిరువాత తండ్రివివాహముచేసుకొన్న భార్యయొక్క పుత్రులుగాని దుహితలుగాని దౌహిత్రులుగాని విభాగము చేసుకొనునపుడు దాసీపుత్రునకుఁ దమభాగమందర్ధభాగ మీవలయును - వివాహము చేసుకొన్న భార్యకు సంతతి లేనిపక్షమందు యావద్ధనమును దాసీపుత్రుఁడే గ్రహింపవలయును - ఇక్కడ శూద్రవిషయమయియిట్లు చెప్పఁబడవలనఁదక్కిన మూఁడువర్ణములవారికిఁ గలిగినదాసీపుత్రునకుఁ దండ్రి యిష్టానుసారముగా భ్రాతృసమాంశముగాని పిమ్మటఁ జెప్పఁబడిన యర్ధాంశముగాని కలుగదు- సర్వధనాధికారము మొదలే లేదు- మరియేమన్నను- తండ్రి వివాహము చేసుకొన్న స్త్రీలకు సంతతియున్న పక్షమందు సంతతివారికిఁగాని లేనిపక్షమందా స్త్రీలకుగాని యనుకూలుఁడై యుండె నేని తనజీవనమునకుఁదగుపాటి ద్రవ్యమును వారివలనఁబొందవచ్చును॥ ౧౩౨

శూద్రునిదాసీపుత్రునకు దండ్రి జీవించి యున్నపుడతని యిష్టము చొప్పున భ్రాతృసమాంశమును బిమ్మట నర్ధాంశమును వచ్చును.

మూ. { పత్నీదుహితరశ్చైవపితరౌభ్రాతరస్తథా। తత్సుతోగోత్రజోబంధుశ్శిష్యస్సబ్రహ్మచారిణః ॥ ఏషామభావేపూర్వస్యధనభాగుత్తరోత్తరః । స్వర్యాతస్యహ్యపుత్రస్యసర్వవర్ణేష్వయంవిధిః॥ }

వ్యా॥ ముఖ్యగౌణసుతాదాయంగృహ్ణంతీతినిరూపితం। తేషామభావేత్వన్యేషాందాయాదక్రమఉచ్యతే॥ పత్నీత్యాది ॥ పూర్వోక్తాద్వాదశపుత్రాయస్యనసంత్యసావపుత్రస్తస్యాపుత్రస్యస్వర్యాతస్య పరలోకంగతస్యధనభాగ్ధనగ్రాహీ - ఏషాంపత్న్యాదీనామనుక్రాంతానాం మధ్యేపూర్వపూర్వస్యాభావేఉత్తరోత్తరోధనభాగితి సంబంధః- సర్వవర్ణేషుసర్వేషుమూర్ధావసిక్తాదిష్వనులోమజేషుసూతాదిషుప్రతిలోమజేషువర్ణేషుచ బ్రా

ష్మణాదిష్వయం దాయగ్రహణే క్రమో వేదితవ్యః - తత్ర ప్రథమం పత్నీ ధనభాక్ - పత్నీ వివాహసంస్కృతా - పత్యు
ర్నో యజ్ఞసంయోగ ఇతి స్మరణాత్ - ఏకవచనం చ జాత్యభిప్రాయేణాతశ్చ బహ్వ్యశ్చేత్సజాతీయా విజాతీయాశ్చ
యథాంశం విభజ్య ధనం గృహ్ణంతి - వృద్ధమనురపి - పత్న్యాస్సమగ్రధనసంబంధం వక్తి - అపుత్రా శయనం భర్తుః
పాలయంతీ వ్రతే స్థితా । పత్న్యేవ దద్యాత్తత్పిండం కృత్స్నమంశం లభేత చేతి - బృహద్విష్ణురపి - అపుత్రధనం పత్న్య
భిగామి తదభావే దుహితృగామి తదభావే పితృగామి తదభావే మాతృగామీతి - కాత్యాయనోపి - పత్నీ భర్తుర్ధనహా
రిణీ యా స్యాదవ్యభిచారిణీ । తదభావే తు దుహితా యద్యనూఢా భవేత్తదేతి - తథా - అపుత్రస్యాథ కులజా పత్నీ దుహిత
రోపి వా । తదభావే పితా మాతా భ్రాతా పుత్రాశ్చ కీర్తితా ఇతి - బృహస్పతిరపి - కుల్యేషు విద్యమానేషు పితృభ్రా
తృసనాభిషు । అసుతస్య ప్రమీతస్య పత్నీ తద్భాగహారిణీతి - ఏతద్విరుద్ధానీవ వాక్యాని లక్ష్యంతే - యథా - భ్రాతౄ
ణామప్రజాః ప్రేయాత్కశ్చిచ్చేత్ప్రవ్రజేత వా । విభజేరన్ధనం తస్య శేషాస్తే స్త్రీధనం వినా ॥ భరణం చాస్య కుర్వీ
రన్ స్త్రీణామాజీవనక్షయాత్ । రక్షంతి శయ్యాం భర్తుశ్చేదాచ్ఛింద్యురితరాసు చ ఇతి పత్నీసద్భావేపి ధనగ్రహణం భ్రా
తౄణాం పత్నీనాం చ భరణమాత్రం నారదేనోక్తం - మనునా తు పితా హరేదపుత్రస్య రిక్థం భ్రాతర ఏవ వేతి - అపు
త్రస్య ధనం పితుర్భ్రాతుర్వేతి దర్శితం - తథా - అనపత్యస్య పుత్రస్య మాతా దాయమవాప్నుయాత్ । మాతర్య
పి చ వృత్తాయాం పితుర్మాతా హరేద్ధనమితి - మాతుః పితామహ్యాశ్చ ధనసంబంధో దర్శితః - శంఖేనాపి - స్వర్యాత
స్య హ్యపుత్రస్య భ్రాతృగామి ద్రవ్యం తదభావే పితరౌ హరేయాతాం జ్యేష్ఠా వా పత్నీతి భ్రాతౄణాం పిత్రోర్జ్యే
ష్ఠాయాశ్చ పత్న్యాః క్రమేణ ధనసంబంధో దర్శితః · కాత్యాయనేనాపి - విభక్తే సంస్థితే ద్రవ్యం పుత్రాభావే పితా
హరేత్ - భ్రాతా వా జననీ వాథ మాతా వా తత్పితుః క్రమాదిత్యేవమాదీనాం విరుద్ధార్థానాం వాక్యానాం ధారేశ్వ
రేణ వ్యవస్థా దర్శితా - పత్నీ గృహ్ణీయాదిత్యేతద్వచనజాతం విభక్తభ్రాతృస్త్రీవిషయం - సా చ యది నియోగార్థినీ
భవతి - కుత ఏతన్నియోగాపేక్షాయాః పత్న్యాః ధనగ్రహణం న స్వతంత్రాయా ఇతి - పితా హరేదపుత్రస్యేత్యా
దివచనాత్ - తత్ర తదేవ వ్యవస్థాకారణం వక్తవ్యం - నాన్యద్వ్యవస్థాకారణమస్తీతి - గౌతమవచనాచ్చ పిండగోత్ర
ర్షిసంబద్ధా రిక్థం భజేరన్ స్త్రీ వానపత్యస్య బీజం వా లిప్సేతేతి - అస్యార్థః - పిండగోత్రర్షిసంబద్ధా అనపత్య
స్య రిక్థం భజేరన్ స్త్రీ వా రిక్థం భజేత సా యది బీజం లిప్సేతేతి - మనురపి - ధనం యో బిభృయాద్భ్రాతుర్మృతస్య స్త్రి
యమేవ వా । సోపత్యం భ్రాతురుత్పాద్య దద్యాత్తస్యైవ తద్ధనమిత్యనేనైతద్దర్శయతి - విభక్తధనేపి భ్రాతర్యుపర
తేఽపత్యద్వారేణైవ పత్న్యా ధనసంబంధో నాన్యథేతి - తథా అవిభక్తధనేపి - కనీయాన్ జ్యేష్ఠభార్యాయాం పుత్ర
ముత్పాదయేద్యది । సమస్తత్ర విభాగస్స్యాదితి ధర్మో వ్యవస్థిత ఇతి - తథా వసిష్ఠోపి - రిక్థలోభాన్నాస్తి నియోగ ఇతి రి
క్థలోభాన్నియోగం ప్రతిషేధన్నియోగద్వారక ఏవ పత్న్యా ధనసంబంధో నాన్యథేతి దర్శయతి - నియోగాభావే తు ప
త్న్యా భరణమాత్రమేవ నారదవచనాత్ - భరణం చాస్య కుర్వీరన్ స్త్రీణామాజీవనక్షయాదితి యోగీశ్వరేణాపి కిల వ
క్ష్యతే - అపుత్రా యోషితశ్చైషాం భర్తవ్యాస్సాధువృత్తయః । నిర్వాస్యా వ్యభిచారిణ్యః ప్రతికూలాస్తథైవ చేతి - అపి చ
ద్విజాతిధనస్య యజ్ఞార్థత్వాత్ స్త్రీణాం యజ్ఞేఽనధికారాద్ధనగ్రహణమయుక్తం - తథా చ కేనాపి స్మృతం - యజ్ఞార్థం
ద్రవ్యముత్పన్నం తత్రానధికృతాస్తు యే । అరిక్థభాజస్తే సర్వే గ్రాసాచ్ఛాదనభాజనాః ॥ యజ్ఞార్థం విహితం విత్తం తస్మా
త్తద్వినియోజయేత్ । స్థానేషు ధర్మజుష్టేషు న స్త్రీమూర్ఖవిధర్మిష్వితి - తదిదమనుపపన్నం - పత్నీ దుహితర ఇత్యత్ర
నియోగస్యాప్రతీతేః ప్రస్తుతత్వాచ్చ - అపి చేదమత్ర వక్తవ్యం పత్న్యా ధనగ్రహణే నియోగో వా నిమిత్తం తదుత్ప
న్నమపత్యం వా - తత్ర నియోగస్యైవ నిమిత్తత్వే అనుత్పాదితపుత్రాయా అపి ధనసంబంధః ప్రాప్నోత్యుత్పన్నస్య
చ పుత్రస్య ధనసంబంధో న ప్రాప్నోతి అథ తదపత్యస్యైవ నిమిత్తత్వం తథా సతి పుత్రస్యైవ ధనసంబంధాత్ - పత్నీతి
నారబ్ధవ్యం - అథ స్త్రీణాం పతిద్వారకో ధనసంబంధః పుత్రద్వారకో వా నాన్యథేతి మతం - తదప్యసత్ - అధ్యగ్న్య
ధ్యావాహనికం దత్తం చ ప్రీతికర్మణి । భ్రాతృమాతృపితృప్రాప్తం షడ్విధం స్త్రీధనం స్మృతమిత్యాదిస్మృతివిరోధా
త్ - కించ - సర్వపుత్రాభావే పత్నీ దుహితర ఇత్యారబ్ధం - తత్ర నియుక్తాయా ధనసంబంధం వదతా క్షేత్రజస్యైవ ధన
సంబంధ ఉక్తో భవతి - స చ ప్రాగేవాభిహిత ఇత్యపుత్రప్రకరణే పత్నీతి నారబ్ధవ్యం - అథ పిండగోత్రర్షిసంబద్ధా రి

క్థం భజేరన్ స్త్రీ వానపత్యస్య బీజం వా లిప్సేతేతి గౌతమవచనాన్నియుక్తాయా ధనసంబంధ ఇతి తదప్యసత్ - న హి య
దిబీజం లిప్సేత తదానపత్యస్య స్త్రీ ధనం గృహ్ణీయాదిత్యయమర్థోఽస్మాత్ప్రతీయతే - కింత్వనపత్యస్య ధనం పిండగో
త్రర్షిసంబంధా భజేరన్ స్త్రీ చ సా స్త్రీ బీజం వా లిప్సేత సంయతా వా భవేదితి తస్యాయమర్థోఽంతరోపదేశో వా శబ్ద
స్య పక్షాంతరవచనత్వేన యద్యర్థాప్రతీతేః - అపి చ సంయతాయా ఏవ ధనగ్రహణం యుక్తం - నియుక్తాయాః స్మృ
తిలోకనిందితాయాః - అపుత్రా శయనం భర్తుః పాలయంతీ వ్రతే స్థితా । పత్న్యేవ దద్యాత్తత్పిండం కృత్స్నమంశం
లభేత చేతి సంయతాయా ధనగ్రహణముక్తం । తథా నియోగశ్చ నిందితో మనునా - నాన్యస్మిన్ విధవా నారీ నియోక్త
వ్యా ద్విజాతిభిః। అన్యస్మిన్ హి నియుంజానా ధర్మం హన్యుః సనాతనమిత్యాదినా - యత్తు వసిష్ఠవచనం రిక్థలోభాన్నా
స్తి నియోగ ఇతి తదవిభక్తైః సంసృష్టిభిర్వా భర్తరి ప్రేతే తస్యా ధనసంబంధో నాస్తీతి స్త్రియా ధనసంబంధార్థం ని
యోగో న కర్తవ్య ఇతి వ్యాఖ్యేయం - యదపి నారదవచనం - భరణం చాస్య కుర్వీరన్ స్త్రీణామాజీవనక్షయాదితి - తద
పి సంసృష్టినాం తు యో భాగస్తేషామేవ స ఇష్యత ఇతి సంసృష్టినాం ప్రస్తుతత్వాత్ స్త్రీణామనపత్యానాం భరణమా
త్రప్రతిపాదనపరం - న చ భ్రాతౄణామప్రజాః ప్రేయాదిత్యేతస్య సంసృష్టివిషయత్వే సంసృష్టినాం తు యో భా
గ ఇత్యనేన పౌనరుక్త్యమాశంకనీయం - యతః పూర్వోక్తవివరణేన స్త్రీధనస్యావిభాజ్యత్వం తత్ స్త్రీణాం చ భరణ
మాత్రం విధీయత ఇతి - యదప్యపుత్రా యోషితశ్చైషామిత్యాదివచనం తత్ క్లీబాదిస్త్రీవిషయమితి వక్ష్యతే - యత్తు
ద్విజాతిధనస్య యజ్ఞార్థత్వాత్ స్త్రీణాం చ యజ్ఞేఽనధికారాద్ధనగ్రహణాయుక్తమితి తదసత్ - సర్వస్య ద్రవ్యజా
తస్య యజ్ఞార్థత్వే దానహోమాద్యసిద్ధేః అథ యజ్ఞశబ్దస్య ధర్మోపలక్షణత్వాద్దానహోమాదీనామపి ధర్మ
త్వాత్తదర్థత్వమవిరుద్ధమితి మతం - ఏవం తర్హ్యర్థకామయోర్ధనసాధ్యయోరసిద్ధిరేవ స్యాత్ - తథా సతి - న ధ
ర్మమర్థం చ కామం చ యథాశక్తి న హాపయేత్ । తథా । న పూర్వాహ్ణమధ్యందినాపరాహ్ణాన్నిష్ఫలాన్కుర్యాద్యథా
శక్తి ధర్మార్థకామేభ్య ఇతి - తథా - న తస్మై తాని శక్యం తే సన్నియంతుమసేవయేత్యాది యాజ్ఞవల్క్యగౌతమమ
నువచనవిరోధః - అపి చ - ధనస్య యజ్ఞార్థత్వే హిరణ్యం ధార్యమితి హిరణ్యధారణస్య క్రత్వర్థతానిరాకరణేన పురు
షార్థత్వముక్తం - తద్విరుద్ధం స్యాత్ - కిం చ - యజ్ఞశబ్దస్య ధర్మోపలక్షణత్వే స్త్రీణామపి పూర్తధర్మాధి
కారాద్ధనగ్రహణం యుక్తతరం - యత్తు పారతంత్ర్యవచనం న స్త్రీ స్వాతంత్ర్యమర్హతీత్యాది తదస్తు పారతంత్ర్యే
ధనస్వీకారే తు కో విరోధః - కథం తర్హి యజ్ఞార్థం ధనముత్పన్నమిత్యాదివచనం - ఉచ్యతే యజ్ఞార్థమేవార్జితం
ద్రవ్యం యత్తద్యజ్ఞ ఏవ నియోక్తవ్యం పుత్రాదిభిరపీత్యేవంపరం తత్ - యజ్ఞార్థం లబ్ధమదదద్భాసః కాకోఽపి వా భవే
దితి దోషశ్రవణస్య పుత్రాదిష్వవిశేషత్వాత్ - యదపి కాత్యాయనేనోక్తం - అదాయకం రాజగామి యోషిద్భృ
త్యౌర్ధ్వదైహికం। అపాస్య శ్రోత్రియద్రవ్యం శ్రోత్రియాయోపపాదయేదితి అదాయకం దాయాదరహితం యద్ధ
నం తద్రాజగామి రాజ్ఞో భవతి - యోషిద్భృత్యౌర్ధ్వదైహికమపాస్య తత్ స్త్రీణామశనాచ్ఛాదనోపయుక్తం త
థా భృత్యానాం - ఔర్ధ్వదైహికం ధనశ్రాద్ధాద్యుపయుక్తం చాపాస్య పరిహృత్య రాజగామి భవతీతి సంబంధః - అ
స్యాపవాదః - శ్రోత్రియద్రవ్యం తు యోషిద్భృత్యౌర్ధ్వదైహికమపాస్య శ్రోత్రియాయోపపాదయేదిత్యేతదప్య
వరుద్ధస్త్రీవిషయం - యోషిద్గ్రహణాత్ - నారదవచనం చ - అన్యత్ర బ్రాహ్మణాత్కింతు రాజా ధర్మపరాయ
ణః। తత్ స్త్రీణాం జీవనం దద్యాదేష దాయవిధిః స్మృత ఇత్యవరుద్ధస్త్రీవిషయమేవ - స్త్రీశబ్దగ్రహణాత్ - ఇహ తు పత్నీ
శబ్దగ్రహణాదూఢాయాః సంయతాయా ధనగ్రహణమవిరుద్ధమేవ - తస్మాద్విభక్తాసంసృష్టిన్యపుత్రే స్వర్యాతే పత్నీ
ధనం ప్రథమం గృహ్ణాతీత్యయమర్థః సిద్ధో భవతీతి - విభాగస్యోక్తత్వాత్సంసృష్టినాం చ వక్ష్యమాణత్వాచ్చ - ఏతే
నాల్పధనవిషయత్వం శ్రీకరాదిభిరుక్తం నిరస్తం వేదితవ్యం - తథా హి - ఔరసేషు పుత్రేషు సత్స్వపి జీవద్విభాగే అజీవ
ద్విభాగే చ పత్న్యాః పుత్రసమాంశగ్రహణముక్తం - యది కుర్యాత్సమానంశాన్ పత్న్యః కార్యాః సమాంశికా ఇతి। త
థా పితురూర్ధ్వం విభజతాం మాతాప్యంశం సమం హరేదితి చ - తథా సత్యపుత్రస్య స్వర్యాతస్య ధనం పత్నీ భరణా
దతిరిక్తం న లభత ఇతి వ్యామోహమాత్రం - అథ పత్న్యః కార్యాః సమాంశికా ఇత్యత్ర మాతాప్యంశం సమం హరేది
త్యత్ర చ జీవనోపయుక్తమేవ ధనం స్త్రీ గృహ్ణాతీతి యన్మతం తదసత్ - అంశశబ్దస్య సమశబ్దస్య చానర్థక్యప్రసంగాత్

స్యాన్మతం- బహుధనే జీవనోపయుక్తం ధనం గృహ్ణీయాదల్పే తు పుత్రాంశసమమంశం గృహ్ణీయాదితి - తచ్చ న- విధి వైషమ్యప్రసంగాత్ - తథాహి పత్న్యః కార్యాస్సమాంశికాః - మాతాప్యంశం సమం హరేదితి చ బహుధనే జీవన మాత్రోపయుక్తం వాక్యాంతరమపేక్ష్య ప్రతిపాదయత్యల్పధనే తు పుత్రాంశసమమంశం ప్రతిపాదయతీతి - యథా చాతుర్మాస్యేషు ద్వయోః ప్రణయంతీత్యత్ర పూర్వపక్షిణా సౌమికప్రణయనాతిదేశహేతుత్వేన వైశ్వదేవ ఉత్తర వేదిముపవపంతి న శునాసీరీయ ఇత్యుత్తరవేదిప్రతిషేధే దర్శితే రాద్ధాంతైకదేశినా న సౌమికప్రణయనాతిదేశప్రాప్తాయా ఉత్తరవేద్యాః ప్రథమోత్తమయోః పర్వణోరయం ప్రతిషేధః- కింతూపాత్తవపంతీతి ప్రాకరణికేన వచనేన ప్రాప్తాయా ఉత్తరవేద్యాః ప్రతిషేధోయమిత్యభిహితే పునః పూర్వపక్షిణోపాత్తవపంతీతి ప్రథమోత్తమయోః పర్వణోః ప్రతిషేధమపేక్ష్య పాక్షికీముత్తరవేదిం ప్రాపయతి మధ్యమయోస్తు నిరపేక్షమేవ నిత్యవదుత్తరవేదిం ప్రతిపాదయతీతి విధివైషమ్యం దర్శితం- రాద్ధాంతేసి విధివైషమ్యభయాత్ప్రథమోత్తమయోః పర్వణోరుత్తరవేదిప్రతిషేధో నిత్యానువాదః- ద్వయోః ప్రణయంతీత్యాద్యర్థవాదపర్యాలోచనయోపాత్తవపంతీతి మధ్యమయోరేవ వరుణప్రఘాససాకమేధపర్వణోరుత్తరవేదిం విధత్త ఇతి దర్శితం- యదపి మతం - పితా హరేదపుత్రస్య రిక్థం భ్రాతర ఏవ వేతి మనుస్మరణాత్తథా స్వర్యాతస్య హ్యపుత్రస్య భ్రాతృగామి ద్రవ్యం తదభావే పితరౌ హరేయాతాం జ్యేష్ఠా వా పత్నీతి శంఖస్మరణాచ్చ - అపుత్రధనం భ్రాతృగామీతి ప్రాప్తం భరణం చాస్య కుర్వీరన్ స్త్రీణామాజీవనక్షయాదిత్యాదివచనాచ్చ- భరణోపయుక్తం పత్నీ లభత ఇత్యపి స్థితం- ఏవం స్థితే - బహుధనే అపుత్రే స్వర్యాతే భరణోపయుక్తం పత్నీ గృహ్ణాతి శేషం చ భ్రాతరః యదా తు పత్నీభరణమాత్రోపయుక్తమేవ ద్రవ్యమస్తి తతో న్యూనం వా తదా కిం పత్న్యేవ గృహ్ణాత్యుత భ్రాతరో వేతి విరోధే పూర్వపూర్వస్య బలీయస్త్వజ్ఞాపనార్థం పత్నీ దుహితర ఇత్యారబ్ధమితి తదప్యత్ర భగవానాచార్యో న మృష్యతి-యతః- పితా హరేదపుత్రస్య రిక్థం భ్రాతర ఏవ వేతి వికల్పస్మరణాన్నేదం క్రమపరం వచనమపి తు ధనగ్రహణాధికారిప్రదర్శనమాత్రపరం-తచ్చాసత్యపి పత్న్యాదిగ్రహణే ఘటత ఇతి వ్యాచక్షతే- శంఖవచనమపి సంసృష్టభ్రాతృవిషయమితి - అపి చాల్పవిషయత్వమనల్పవిషయత్వం చాస్మాద్వచనాత్ప్రకరణాద్వా నావగమ్యతే- ధనభాగుత్తరోత్తర ఇత్యస్య చ పత్నీ దుహితర ఇతి విషయద్వయే వాక్యాంతరమపేక్ష్యాల్పధనవిషయత్వం పిత్రాదిషు తు ధనమాత్రవిషయత్వమితి పూర్వోక్తవిధివైషమ్యం తదవస్థమేవేతి న కించిదేతత్ - యత్తు హారీతవచనం- విధవా యౌవనస్థా చేన్నారీ భవతి కర్కశా । ఆయుషః క్షపణార్థం తు దాతవ్యం జీవనం తదేతి- తదపి శంకితవ్యభిచారాయాస్సకలధనగ్రహణనిషేధపరం - అస్మాదేవ వచనాదశంకితవ్యభిచారాయాస్సకలధనగ్రహణం గమ్యతే- ఏతదేవాభిప్రేత్యోక్తం శంఖేన- జ్యేష్ఠా వా పత్నీతి జ్యేష్ఠా గుణజ్యేష్ఠా అనాశంకితవ్యభిచారా సా సకలధనం గృహీత్వా అన్యాం కనిష్ఠామపి మాతృవత్పరిపాలయతీతి సర్వమనవద్యం- తస్మాదపుత్రస్య స్వర్యాతస్య విభక్తస్యాసంసృష్టినః పరిణీతా స్త్రీ సంయతా సకలమేవ ధనం గృహ్ణాతీతి స్థితం॥ తదభావే దుహితరః-దుహితర ఇతి బహువచనం సమానజాతీయానామసమానజాతీయానాం చ సమవిషమాంశప్రాప్త్యర్థం - తథా చ కాత్యాయనః - పత్నీ భర్తుర్ధనహారీ యా స్యాదవ్యభిచారిణీ। తదభావే తు దుహితా యద్యనూఢా భవేత్తదేతి - బృహస్పతిరపి - భర్తుర్ధనహారీ పత్నీ తాం వినా దుహితా స్మృతా । అంగాదంగాత్సంభవతి పుత్రవద్దుహితా నృణాం ॥ తస్మాత్పితృధనం త్వన్యః కథం గృహ్ణీత మానవ ఇతి- తత్ర చోఢానూఢాసమవాయే అనూఢైవ గృహ్ణాతి - తదభావే తు దుహితా యద్యనూఢా భవేత్తదేతి విశేషస్మరణాత్- తథా ప్రతిష్ఠితాఽప్రతిష్ఠితాసమవాయే అప్రతిష్ఠితైవ గృహ్ణాతి- తదభావే ప్రతిష్ఠితా - స్త్రీధనం దుహితౄణామప్రత్తానామప్రతిష్ఠితానాం చేతి గౌతమవచనస్య పితృధనేపి సమానత్వాత్ -న చైతత్పుత్రికావిషయమితి మంతవ్యం- తత్సమః పుత్రికాసుత ఇతి పుత్రికాయాస్తత్సుతస్య చౌరససమత్వేన పుత్రప్రకరణేభిధానాత్ - చశబ్దాద్దుహితృభావే దౌహిత్రో ధనభాక్- యథాహ విష్ణుః- అపుత్రపౌత్రసంతానే దౌహిత్రా ధనమాప్నుయుః । పూర్వేషాం తు స్వధాకారే పౌత్రా దౌహిత్రకా మతా ఇతి -మనురపి- అకృతా వా కృతా వాపి యం విందేత్సదృశాత్సుతం। పౌత్రీ మాతామహస్తేన దద్యాత్పిండం హరేద్ధనమితి॥ తదభావే పితరౌ మాతాపితరౌ ధనభాజౌ యద్యపి యుగపదధికరణవచనతాయాం ద్వంద్వస్మరణాత్ - తదపవాదత్వాదేకశేషస్య ధనగ్రహణే పితుః క్రమో న ప్రతీయతే - తథాపి

విగ్రహవాక్యే మాతృశబ్దస్య పూర్వనిపాతాదేకశేషాభావపక్షే చ మాతాపితరావితి మాతృశబ్దస్య పూర్వశ్రవణా
త్పఠక్రమాదేవార్థక్రమావగమాద్ధనసంబంధేపి క్రమాపేక్షాయాం ప్రతీతక్రమానురోధేనైవ ప్రథమం మాతా
ధనభాక్ - తదభావేపి తేతిగమ్యతే - కించ పితా పుత్రాంతరేష్వపి సాధారణో మాతా తు నసాధారణీతి ప్రత్యాసత్త్య
తిశయాత్ - అనంతరస్సపిండాద్యస్తస్యతస్య ధనం భవేదితి వచనాచ్చ మాతురేవ ప్రథమం ధనగ్రహణం యుక్తం - న
చ సపిండేష్వేవ ప్రత్యాసత్తిర్నియామికా - అపితు సమానోదకాదిష్వప్యవిశేషేణ ధనగ్రహణే ప్రాప్తే ప్రత్యాసత్తి
రేవ నియామికేత్యస్మాదేవ వచనాదవగమ్యత ఇతి మాతాపిత్రోర్మాతురేవ ప్రత్యాసత్త్యతిశయాద్ధనగ్రహణం యు
క్తతరం - తదభావే పితా ధనభాక్ ॥ పితరి భావే భ్రాతరో ధనభాజః - తథా చ మనుః - పితా హరేదపుత్రస్య రిక్థం భ్రా
తర ఏవ వేతి - యత్పునర్ధారేశ్వరేణోక్తం - అనపత్యస్య పుత్రస్య మాతా దాయమవాప్నుయాత్ । మాతర్యపి చ వృ
త్తాయాం పితుర్మాతా హరేద్ధనమితి మనువచనా జ్జీవత్యపి పితరి మాతరి వృత్తాయాం పితుర్మాతా పితామహీ ధనం
హరేన్న పితా - యతః పితుర్గృహీతం ధనం విజాతీయేష్వపి పుత్రేషు గచ్ఛతి - పితామహీగృహీతం తు సజాతీయేష్వేవ
గచ్ఛతీతి పితామహ్యేవ గృహ్ణాతీతి - ఏతదప్యాచార్యో నానుమన్యతే - విజాతీయపుత్రాణామపి ధనగ్రహణస్యోక్త
త్వాత్ - చతుస్త్రిద్వ్యేకభాగాస్స్యురిత్యాది నేతి - యత్పునః - అహార్యం బ్రాహ్మణద్రవ్యం రాజ్ఞా నిత్యమితి స్థితిరితి
మనుస్మరణం తన్నృపాభిప్రాయం న పుత్రాభిప్రాయం ॥ భ్రాతృష్వపి సోదరాః ప్రథమం గృహ్ణీయుః భిన్నోదరా
ణాం మాతృవిప్రకర్షాత్ - అనంతరస్సపిండాద్యస్తస్య తస్య ధనం భవేదితి స్మరణాత్ - సోదరాణామభావే భిన్నోద
రా ధనభాజః - భ్రాతౄణామప్యభావే తత్పుత్రాః పితృక్రమేణ ధనభాజః - భ్రాతృభ్రాతృపుత్రసమవాయే భ్రా
తృపుత్రాణామనధికారః - భ్రాతరి భావే తత్పుత్రాణామధికారవచనాత్ - యదా త్వపుత్రే భ్రాతరి స్వర్యాతే
తద్భ్రాతౄణామవిశేషేణ ధనసంబంధే జాతే భ్రాతృధనవిభాగాత్ప్రాగేవ యది కశ్చిద్భ్రాతా మృతస్తదా తత్పు
త్రాణాం పితృతోధికారే ప్రాప్తే తేషాం భ్రాతౄణాం చ విభజ్య గ్రహణే పితృతో భాగకల్పనేతి యుక్తం ॥ భ్రాతృ
పుత్రాణామప్యభావే గోత్రజా ధనభాజః - గోత్రజాః పితామహీ సపిండాస్సమానోదకాశ్చ తత్ర పితామహీ ప్రథ
మం ధనభాక్ - మాతర్యపి చ వృత్తాయాం పితుర్మాతా ధనం హరేదితి మాత్రనంతరం పితామహ్యా ధనగ్రహణే ప్రా
ప్తే పిత్రాదీనాం భ్రాతృసుతపర్యంతానాం బద్ధక్రమత్వేన మధ్యే అనుప్రవేశాభావా త్పితుర్మాతా ధనం హరేదిత్య
స్య వచనస్య ధనగ్రహణాధికారప్రాప్తిమాత్రపరత్వాదుత్కర్షే తత్సుతానంతరం పితామహీ గృహ్ణాతీత్యవిరోధః -
పితామహ్యాశ్చాభావే సమానగోత్రజాస్సపిండాః పితామహాదయో ధనభాజః - భిన్నగోత్రాణాం సపిండానాం
బంధుశబ్దేన గ్రహణాత్ - అత్ర చ పితృసంతానాభావే పితామహీ పితామహః పితృవ్యాస్తత్పుత్రాశ్చ క్రమేణ ధనభా
జః - పితామహసంతానాభావే ప్రపితామహీ ప్రపితామహస్తత్పుత్రాస్తత్సూనవశ్చేత్యేవమా సప్తమాత్సమాన
గోత్రాణాం సపిండానాం ధనగ్రహణం వేదితవ్యం - తేషామభావే సమానోదకానాం ధనసంబంధః - తే చ సపిండా
నాముపరి సప్త వేదితవ్యాః - జన్మనామజ్ఞానావధికా వా - యథాహ బృహన్మనుః - సపిండతా తు పురుషే సప్తమే వినివ
ర్తతే । సమానోదకభావస్తు నివర్తేతా చతుర్దశాత్ ॥ జన్మనామ్నోస్స్మృతేరేకే తత్పరం గోత్రముచ్యత ఇతి - గో
త్రజానామభావే బంధవో ధనభాజః - బంధవశ్చ త్రివిధాః - ఆత్మబాంధవాః పితృబాంధవాః మాతృబాంధవాశ్చేతి -
యథోక్తం - ఆత్మపితృష్వసుః పుత్రా ఆత్మమాతృష్వసుస్సుతాః । ఆత్మమాతులపుత్రాశ్చ విజ్ఞేయా ఆత్మబాంధవాః ॥ పి
తుః పితృష్వసుః పుత్రాః పితుర్మాతృష్వసుస్సుతాః । పితుర్మాతులపుత్రాశ్చ విజ్ఞేయాః పితృబాంధవాః ॥ మాతుః పి
తృష్వసుః పుత్రా మాతుర్మాతృష్వసుస్సుతాః । మాతుర్మాతులపుత్రాశ్చ విజ్ఞేయా మాతృబాంధవా ఇతి - తత్ర చాం
తరంగత్వాత్ప్రథమమాత్మబాంధవా ధనభాజస్తదభావే పితృబాంధవాస్తదభావే మాతృబాంధవా ఇతి క్రమో వేదిత
వ్యః - బంధూనామభావే ఆచార్యస్తదభావే శిష్యః - పుత్రాభావే యః ప్రత్యాసన్నస్సపిండస్తదభావ ఆచార్య ఆచా
ర్యాభావేంతేవాసీత్యాపస్తంబస్మరణాత్ - శిష్యాభావే సబ్రహ్మచారీ ధనభాక్ యేనసహైకస్మాదాచార్యాదుపనయ
నాధ్యయనతదర్థజ్ఞానప్రాప్తిః స సబ్రహ్మచారీ తదభావే బ్రాహ్మణద్రవ్యం యః కశ్చిచ్ఛ్రోత్రియో గృహ్ణీయాత్
శ్రోత్రియా బ్రాహ్మణస్యానపత్యస్య రిక్థం భజేరన్నితి గౌతమస్మరణాత్ - తదభావే బ్రాహ్మణమాత్రం - యథాహ

మనుః- సర్వేషామప్యభావేతుబ్రాహ్మణారిక్థభాగినః- త్రైవిద్యాశ్శుచయోదాంతాస్తదా ధర్మోనహీయత ఇతిక దాచిదపిబ్రాహ్మణద్రవ్యంరాజాగృహ్ణీయాత్ - అహార్యంబ్రాహ్మణద్రవ్యంరాజ్ఞానిత్యమితిస్థితిరితిమనుస్మరణాత్ - నారదేనాప్యుక్తం- బ్రాహ్మణార్థస్యతన్నాశేదాయాదశ్చేన్నకశ్చన। బ్రాహ్మణాయైవదాతవ్యమేనస్వీస్యాన్నృపోన్యథేతి- క్షత్రియాదిధనంసబ్రహ్మచారిపర్యంతానామభావేరాజాహరేన్న బ్రాహ్మణః-యథాహమనుః - ఇతరేషాంతువర్ణానాంసర్వాభావేహరేన్నృపఇతి॥

తా ॥ ముఖ్యపుత్రులును గౌణపుత్రులును దాయమును బొందనధికారులని చెప్పఁబడెను - వారు లేనిపక్షమందతని ద్రవ్యమును పొందవలసినవారి మెట్టువరుసను జెప్పుచున్నాఁడు ॥ పూర్వోక్తులయిన

అపుత్రకుఁడై గతించిన వాని ద్రవ్యమును బొందఁదగిన వారిక్రమము.

ద్వాదశవిధపుత్రులలో నేవిధమైనపుత్రుఁడును లేనివాఁడు పరలోకమును బొందినపుడతనిధనము నీక్రిందఁ జెప్పఁబడువారిలో ముందుముందు చెప్పఁబడినవారు లేనిపక్షమందు వెనుక వెనుకఁ జెప్పఁబడినవారు పొందుదురు - ఈ జెప్పినవిధి బ్రాహ్మణులు మొదలగు నాలుగువర్ణములవారికిని మూర్ధావసిక్తులు మొదలగు ననులోమజాతులవారికిని సూతాదిప్రతిలోమజాతులవారికినని తెలియవలయును॥ ——— అందువివాహముచే

విభక్తుని ద్రవ్యమందు ముందు భార్యకధికారము.

సుకోఁబడిన భార్య ధనమును బొందుటకు మొదటియధికారిణియగును- ఇచ్చట నేకవచనము జాత్యభిప్రాయకము కాఁబట్టి పలువురు భార్యలు సమానవర్ణమువారుగాని భిన్నవర్ణమువారుగానియున్నపక్షమందు భాగముల చొప్పునఁ బంచుకొనవలయు ॥ వృద్ధమనువు కొడుకులు లేనివాని భార్య నియమమందున్నదగుచు పతికిఁ బిండదానము తానే చేసి యతని ద్రవ్యమును దానే పొందునని భార్యకు సంపూర్ణధనసంబంధమును జెప్పియున్నాఁడు - బృహద్విష్ణువు కొడుకులు లేనివాని ద్రవ్యము వాని భార్యకుఁ జేరు నాపె లేనిపక్షమందుఁ గొమారికలఁ జెందును - వారు లేనిపక్షమందతని తండ్రినిఁ జెందును-అతఁడు లేనిపక్షమందు తల్లినిఁ జెందునని చెప్పియున్నాఁడు- కాత్యాయనవచనమందు పతివ్రతయైన భార్య భర్తధనమునకధికారిణి యాపె లేనిపక్షమందు వివాహముగాని కూఁతురధికారిణియని చెప్పఁబడియున్నది- అలాగే - మరియొకవచనమందు అపుత్రుని ధనమును సమానజాతీయురాలగు భార్యయు నాపె లేనియపుడు కూఁతులు- వారు లేనియపుడు తండ్రి- అతఁడు లేనిపక్షమందు తల్లి - ఆమె లేనిపక్షమందు భ్రాతలు- వారు లేనిపక్షమందు వారికొడుకులు పొందుదురని చెప్పఁబడియున్నది॥ స్వకులమందుఁ బుట్టిన తండ్రి అన్నదమ్ములు సపిండులు మొదలగువారున్నను కొడుకులు లేనివాఁడు మృతుఁడైనపక్షమందతని ద్రవ్యమును బొందునధికారము భార్యదేయని బృహస్పతిచేఁ జెప్పఁబడియున్నది॥ ఇట్లుండగా కొన్నివచనములీవచనములకు విరుద్ధములవలెఁ దోచుచున్నవి యేవన్నను ॥ అ

ఈ యర్థమునకు విరుద్ధములవలెఁ దోచుచున్న వచనములు.

న్నదమ్ములలో నొకఁడు సంతతిలేక మృతుఁడైనను సన్న్యసించిననతని భార్యయొక్క స్త్రీధనము దప్ప విడిచి యతని భాగమును దక్కినవారు పంచుకొని యతని భార్యలు పాతివ్రత్యమును గాపాడుకొనుచున్నపక్షమందు వారికి యావజ్జీవము భరణమీవలయుననియు లేనిపక్షమందు నదియు నక్కరలేదనియుఁ జెప్పియుండు నారదవచనమువలనఁ బత్నియున్నను భ్రాతలకే ధనగ్రహణాధికారమును భార్యకు భరణమాత్రమును దెలియవచ్చుచున్నది॥ మనువచనమందుఁ బుత్రులు లేనివాని ధనమును దండ్రియైనను భ్రాతలైనను గ్రహింపవలయునని చెప్పియున్నది - మరియొకవచనమందు బిడ్డలు లేనివాని ద్రవ్యము తల్లికనియు నాపె లేనియెడఁ బితామహికనియుఁ జెప్పఁబడియున్నది - శంఖవచనమందుఁ బుత్రులు లేనివాఁడు మృతుఁడైనపక్షమందతని ద్రవ్య మతనియన్నదమ్ములకుఁ జేరుననియు వారు లేనిపక్షమందుఁ దలిదండ్రులకుఁగాని జ్యేష్ఠభార్యకుఁగాని చేరుననియుఁ జెప్పఁబడియున్నది - కాత్యాయనవచనమందు విభక్తుఁడు పుత్రులు లేక మృతుఁడైనపక్షమందతని ద్రవ్యమునతని తండ్రి గ్రహింపవలయుననియు నతఁడు లేనిపక్షమందు భ్రాత యతఁడు లేనిపక్షమందుఁ దల్లి యాపె లేనిపక్షమందు పితామహియును గ్రహింపవలయునని చెప్పఁబడియున్నది ॥ ఈవచనములకెల్ల ధారేశ్వ

భార్యకు ధనాధికారముఁ

రుఁడు వ్యవస్థఁ గల్పించెనదియెట్లనిన - భార్యకు ధనాధికారమును జెప్పెడువచనముల

జెప్పెడు వచనములు దేవరాదులవల్ల సంతతినిగోరిన స్త్రీవిషయములని ధారేశ్వరుఁడు చెప్పె నది సరిగాదు.

కు - భ్రాత్రాదులతో విభాగింపఁబడకున్నవాఁడు పుత్త్రహీనుఁడై మృతిఁబొందిన వాని భార్య దేవరాదులవల్ల పుత్త్రోత్పత్తి నపేక్షించినయెడల నట్టివిషయమందు భార్యకే ధనము కాగలదని తాత్పర్యమనియు (పిండగోత్రర్షిసంబన్ధా రిక్థం భజేరన్ స్త్రీ వానపత్యస్య బీజం వా సా లిప్సేత) అనెడు గౌతమసూత్రమునకు పుత్త్రహీనుని ధనము సపిండసగోత్రఋషిసంబంధములుగలవారు పొందుదురు అతని భార్య దేవరాదులవల్ల పుత్త్రోత్పత్తిఁ గోరినపక్షమందా పెయైనఁ బొందునని యర్థమనియు (ధనం యో బిభృయాద్భ్రాతుః) అనెడుమనువచనమందు భ్రాత మృతుఁడయ్యెనేని వాని స్త్రీని ధనమును భరించువాఁడా భ్రాతకుఁ బిడ్డను బుట్టించి యాబిడ్డకా ధనమునీవలయునని చెప్పియుండుటవలన విభక్తుఁడైన భ్రాతయొక్క ధనమందైన నతని భార్యకు సంబంధము సంతానమూలకమే యని యేర్పడుచున్నదనియు - వసిష్ఠవచనమందును ధనాశవలన నియోగము గూడదని చెప్పియుండుటవలన భార్యకు ధనము నియోగమూలకముగా నేరావలయుననియు - నియోగము లేనిపక్షమందు నారదవచనప్రకారము యావజ్జీవము భరణము వచ్చునేకాని ధనమంతయు రాదనియు - యాజ్ఞవల్క్యయోగియు నొక వెనుకటి గ్రంథమందు అపుత్త్రకులైనవీరి భార్యలు నియమముగలవారై యున్నపక్షమందు వారిని భరింపవలయునని చెప్పఁబోవుచున్నాఁడుగనుక వారికి భరణమే సిద్ధించుచున్నదనియు - బ్రాహ్మణక్షత్త్రియవైశ్యుల ధనము యజ్ఞముకొఱకగుటవలన స్త్రీలకు యజ్ఞమందధికారము లేదుగనుక వారలకు ధనము గూడదని యొకస్మృతియందుఁ జెప్పఁబడియున్నదనియుఁ జెప్పియున్నాఁడు॥ ఇట్లు ధారేశ్వరుఁడు వ్యవస్థనుగల్పించుట యుక్తముగానుండలేదు- ఏలయనిన- పత్నీదుహితరశ్చైవ యని యుపక్రమింపఁబడిన యీయాజ్ఞవల్క్యవచనమందు నియోగము తోఁచుటలేదు ప్రస్తుతంబును గాదు అదియునుంగాక నియోగమే ధనసంబంధమందు నిమిత్తమైనపక్షమందుఁ బుత్త్రునకు ధనసంబంధము లేకపోవలయును - పుత్త్రుఁడు నిమిత్తమైనపక్షమందుఁ బత్ని ధనాధికారిణియని చెప్పఁగూడదు - స్త్రీలకు ధనసంబంధము పుత్త్రమూలకముగాగాని పతిమూలకముగాగాని కలుగును స్వతంత్త్రముగాఁ గలుగదనియుఁ జెప్పఁగూడదు - అట్లు చెప్పినపక్షమందు స్త్రీధనము షడ్విధమని చెప్పియుండు స్మృతికి విరోధము గలుగుచున్నది - ఇదిగాక యెవ్విధమైన పుత్త్రుఁడును లేనివిషయమందుఁ బత్నియని యారంభించి యుండఁగా నది నియోగమూలకమని చెప్పినపక్షమందు క్షేత్త్రజపుత్త్రునకే ధనసంబంధమును జెప్పుటయగుచున్నది - అది ముందే చెప్పఁబడి యున్నదిగనుక నపుత్త్రప్రకరణమందు దానిఁ జెప్పఁగూడదు- గౌతమవచనమువల్ల నియోగమూలకము ధనసంబంధమని చెప్పుటయు నుయుక్తముగాదు - ఆవచనమందు నియోగమునైనఁ బొందవచ్చును నియమముతోనైన నుండవచ్చునని యాపె యుండవలసిన నడవడి దెలుపఁబడియున్నదే కాని నియోగమును బొందినపక్షమందే ధనమును బొందునని లేదు - అదిగాక నియోగము మనువుచేత నిందితముగనుక నియోగమును బొందినదానికంటె నియమముతోనున్నదానికి ధనము చెందవలయుననుటయే వృద్ధమనువచనమందును జెప్పఁబడియున్నది- వసిష్ఠవచనమందు ధనాశవలన నియోగము గూడదన్నదానికి అవిభక్తుండైనగాని సంసృష్టియైనగాని యుండి మృతిఁబొందిన యపుత్త్రకుని భార్య తనకు భాగార్హత లేమిం జేసి నియోగమువల్ల పుత్త్రునిఁగన్నపక్షమందు భాగము వచ్చుననునపేక్షచే నియోగమును గోరెనేని అప్పుడు నియోగము గూడదని యర్థము చేయవలయును- భరణమీవలయునను నారదవచనము సంసృష్టిప్రకరణములోనిదిగనుక దానినిచ్చట [illegible] గ్రహింపఁగూడదు - యాజ్ఞవల్క్యస్మృతియందింక వెనుకటి గ్రంథమందు బిడ్డలులేనివీరి స్త్రీలు మంచినడవడి [illegible] వారిని భరింపవలయునన్నది నపుంసకాంధాది స్త్రీల విషయమని యక్కడనే తెలియవచ్చుచున్నది - బ్రాహ్మణాదులకు మూఁడువర్ణములవారి ధనము యజ్ఞముకొఱకుఁగనుక స్త్రీలకు యజ్ఞమందధికారము లేమిం జేసి వారలకు ధనము [illegible] టయు యుక్తముగాదు- ద్రవ్యమంతయు యజ్ఞముకొఱకన్నపక్షమందు దాన హోమాదులు లేకపోవలయును దృష్ట మనఁగా ధర్మములకన్నిటికిని తాత్పర్యమని చెప్పుటయుక్తముగాదు - అట్లు చెప్పినపక్షమందర్థము [illegible]

విభక్తుఁడై సంసృష్టిగాని వాఁడు పుత్త్రహీనుఁడై మృతిఁ బొందెనేని వాని ద్రవ్యమందు సాధ్వియగు నతని భార్యకే యధికారమని సిద్ధాంతము.

వ్యమువలనసిద్ధింపవలసినవిగదా యవిసిద్ధింపకపోవును - అట్లయిన ధర్మమునర్థమును గామమును విడువగూడదను యాజ్ఞవల్క్యస్మృతికిని - ప్రాతఃకాలమందు ధర్మమును మధ్యాహ్నమందర్థమును రాత్రికాలమందు కామమును సంపాదింపవలయునను గౌతమవచనమునకును ధర్మార్థకామములు సేవింపక నిగ్రహింప శక్యములు గావను మనువచనమునకును విరోధమువచ్చుచున్నది - అదిగాక ధనమంతయు యజ్ఞార్థమను పక్షమందు హిరణ్యమును ధరింపవలయునని నహిరణ్యధారణమునకు స్వతంత్రముగాఁ బురుషార్థత్వము చెప్పుట నెత్తివేసినట్లవును - ఇదిమాత్రమే కాక యజ్ఞశబ్దము ధర్మమునకుఁగూడఁ బోధకమను పక్షమందు స్త్రీలకు తటాకవనప్రతిష్ఠాదిపూర్తధర్మముఁ జేయనధికారమున్నదిగనుక నవశ్యము వారు ధనమును బొందవచ్చును - స్త్రీలకు స్వాతంత్ర్యము లేదను వచనమునకు స్త్రీ స్వేచ్ఛగా ప్రవర్తింపఁగూడదని తాత్పర్యము గనుక నది ధనమును బొందుటకు బాధకముగాదు - యజ్ఞార్థం ధనముత్పన్నమ నెడు వచనమునకు యజ్ఞముకొఱకు సంపాదించిన ద్రవ్యమును బుత్రుఁడు మొదలగువారెవరైన యజ్ఞమందే వినియోగము చేయవలయునని యర్థముగనుక యజ్ఞముకొఱకార్జింపఁబడిన ద్రవ్యము నావిషయమై వ్యయము చేయనివాఁడు కాకిగానో భాసముగానో పుట్టునను వచనమందు సామాన్యముగా దోషము చెప్పియున్నదిగనుకను అట్టి ద్రవ్యమందు భార్యకువలె పుత్రులకు నర్హత లేదుగనుక నీవచనమువల్ల భార్యకు భర్తృద్రవ్యమందధికారము లేదని యర్థమేర్పడదు - దాయమును బొందునధికారి లేనివాని ద్రవ్యమునందు వాని యుత్తరక్రియలకును వాని స్త్రీలు భృత్యులు మొదలగువారి భరణమునకును దగిన ద్రవ్యము నిచ్చి తక్కిన ద్రవ్యమును రాజు పొందుననియు శ్రోత్రియుని ద్రవ్యమును బైమాదిరిగా నిచ్చి తక్కినదాని మఱియొక శ్రోత్రియునకు రాజవర్పించవలయు ననియుఁ జెప్పియుండు కాత్యాయనవచనమందు యోషిచ్ఛబ్దముచేఁ జెప్పుటవలన నది వివాహము చేసుకోఁబడక యూరక యుంచుకోఁబడిన స్త్రీలవిషయమని తెలియఁదగినది - బ్రాహ్మణద్రవ్యము దప్పఁ దక్కినవారి ద్రవ్యమందు ధర్మనిరతుఁడైన రాజు వాని స్త్రీలకుఁ గొంచెమీవలయు నను నారదవచనమందును స్త్రీశబ్దముతోనే చెప్పియుండుటవలన నదియు నుంచుకొన్న స్త్రీలవిషయమే - ఇక్కడఁ బత్నీశబ్దముతో గ్రహింపఁబడియున్నదిగనుక వివాహము చేసుకోఁబడి పతివ్రతయైయుండు స్త్రీ విభక్తుఁడై సంసృష్టుఁడు గాకయున్న తనభర్త పుత్రులు లేక మృతుఁడైన పక్షమందతని ధనమును బొందుటకు మొదటి యధికారిణి యగునను నర్థము సిద్ధమగుచున్నది॥ విభాగము పూర్వమే చెప్పఁబడియున్నదిగనుక సంసృష్టిన్యాయ మింకమీఁద జెప్పఁబడఁ బోవుచున్నదిగనుక - ఇచ్చటఁ జెప్పినది విభక్తుఁడై సంసృష్టుఁడు గాని వానివిషయమనుట యుక్తమని తెలియవలయును ॥ ఇట్లు చెప్పుటచేత పత్నికి ధనగ్రహణాధికారము స్వల్పధనవిషయమని చెప్పిన శ్రీకరాదులమతంబును గొట్టివేయఁబడెనని తెలియఁదగినది. ఎట్లనిన - తండ్రియగువాఁడు తనకొమాళ్లకు విభాగము సేయునపుడు తనపత్నులఁ బుత్రులతో సమభాగములుగలవారినిగాఁ జేయవలయుననియు - తండ్రి గతించినపిమ్మట నన్నదమ్ములు విభాగించుకొనునపుడు తల్లి పుత్రభాగముతో సమానమయిన భాగమును బొందుననియు నీగ్రంథమందే చెప్పఁబడియున్నది - ఇట్లు ఔరసులైన పుత్రులుండునపుడు గూడ భార్యలకు భాగము గలుగుచుండఁగా పుత్రహీనుఁడై చనిపోయినవారి ధనమును వాని భార్య భరణముకంటె నధికముగాఁ బొందఁజాలదని చెప్పుట భ్రమమే కాని యితరము గాదు। అయితే పత్న్యః కార్యాస్సమాంశికాః - మాతాప్యంశం సమం హరేత్ - అనుస్థలములయందును జీవనోపయుక్తమైన ధనము నే యాపె పొందునని చెప్పెదమనిన అంశ సమ శబ్దములకు నిరర్థకత్వము సంభవించును గనుక నట్లు చెప్పఁగూడదు - అయితే ధనము విశేషముగానున్న పక్షమందు జీవనోపయుక్తధనంబును కొంచముగానున్న పక్షమందు పుత్రభాగముతో సమానమైన భాగంబును స్త్రీకిఁ గలుగునని చెప్పెదమన్నను. విధివైషమ్యదోషము సంభవించును కాఁబట్టి యట్లును చెప్పఁగూడదు॥ ( ఈపుస్తకమందు సంస్కృతమునఁ దెలిపియున్న విధివైషమ్యదోషప్రకారమును దెనుఁగున వివరించినను సంస్కృతవ్యుత్పత్తి లేనివారికి బోధపడుట దుర్లభము గనుక సంక్షేపింపఁబడియె) కొందఱు - మనువచనమందు పుత్రహీనుని ద్రవ్యమును తండ్రియైనన న్నదమ్ములయిన గ్రహింపవలయుననియు - శంఖవచనమందు నపుత్రకుని ద్రవ్యము భ్రాతలకుఁ జేరును - వారు లేనిపక్షమందు తల్లిదండ్రులైన జ్యేష్ఠభార్యయైన గ్రహింపవలయునని యుఁ జెప్పఁబడియున్నదిగనుక నపుత్రకుని ధనము భ్రాతలకుఁ జేరుననియు - నారదవచనమువలన భ్రాతృభార్యలకు యావజ్జీవము భరణము గలుగుననియు నేర్పడెను - ఇట్లేర్పడఁగా - ఆస్త్రీ విశేషముగానున్నపక్షమందు

భరణోపయుక్తద్రవ్యమునుపత్నులుగ్రహింతురుతక్కినద్రవ్యమును భ్రాతలుగ్రహింతురు-అట్లుగాకపత్నీభరణమునకుసమముగాఁగానిచాలకగాని ఆ స్త్రీయున్నపక్షమందాయాస్త్రీపత్నులకుఁజేరునా లేక భ్రాతలకుఁజేరునాయనిసందేహముగలుగఁగాఅట్టిస్వల్పద్రవ్యమునుందుపత్నులకేచేరును వారులేనిపక్షమందు దుహితాదులకుఁ జేరునని తెలుపుటకయియిచటపత్నీదుహితరశ్చైవయని యుపక్రమింపఁబడెనని యొకమతమును జెప్పుదురు - అదియును యాజ్ఞవల్క్యయోగియభిప్రాయముగాదు - అదియేలయనిన- మనువచనమందుపుత్రహీనునిద్రవ్యమును తండ్రియయినను భ్రాతయయినను గ్రహింపవలయునని వికల్పముగాఁజెప్పుటవలన నావచనము ధనగ్రహణాధికారులనుమాత్రముఁదెలియఁజేయునదియేకానిధనగ్రహణాధికారులమెట్టువరుసను దెలియఁ జేయునదికాదు - శంఖవచనము సంసృష్ట భ్రాతృవిషయము - ఇదియునుంగాక- అల్పధనవిషయమనుటయు బహుధనవిషయమనుటయునీవచనమువల్లఁగానియాప్రకరణమువల్లఁగానిస్ఫురించుటలేదు- ధనభాగుత్తరోత్తరః- అను వాక్యమునకుభార్యలవిషయమందును దుహితలవిషయమందును స్వల్పధనవిషయత్వమును జెప్పి పితృభ్రాతాదులవిషయమందుధనమాత్రవిషయత్వమును జెప్పినపక్షమందుపూర్వోక్తవిధివైషమ్యదోషముకల్గియుండును ॥ యౌవనవతియైనవిధవస్త్రీ - కఠినురాలుగానుండెనేని ఆపెకు కాలముగడుపుటకుఁదగినజీవనమీవలయునని హారీతవచనము - వ్యభిచరించునదియనిసందేహము గలిగినదానికిసర్వధనగ్రహణాధికారము లేదనినిషేధింపుచున్నదిగనుకనీవచనమువల్ల నేపతివ్రతకుసర్వధనగ్రహణాధికారముగమ్యమానమగుచున్నది ॥ ఈయభిప్రాయముచేత నేశంఖవచనమందు జ్యేష్ఠపత్నియనిచెప్పుటయును - అక్కడజ్యేష్ఠయనఁగా గుణములచేత పెద్దయని యర్థము - అట్టిదిధనమును గ్రహించి మఱియొకతె కఠినురాలై యున్నను ఆపెను తల్లివలె పాలించవలయుననియభిప్రాయము- కాఁబట్టివిభక్తుఁడైసంసృష్టుఁడుగాకపుత్రహీనుఁడై మృతిఁబొందినవానిసకలద్రవ్యమును వానివివాహముచేసుకొని పతివ్రతయైయుండెడుభార్యయే గ్రహింపవలయుననిసిద్ధాంతము॥

భార్యలేనిపక్షమందుకొమార్తెలకధికారము.

——— అట్టిభార్యలేనిపక్షమందా ద్రవ్యమునకుకొమార్తెలధికారిణులగుదురు- బహువచనముగాఁజెప్పుటవలనసమానవర్ణస్త్రీలయందుఁబుట్టినవారుసమాంశముగాను భిన్నవర్ణస్త్రీలయందుఁబుట్టినవారువిషమాంశముగాను తండ్రిద్రవ్యమునుబంచుకొందురనియభిప్రాయము - ఇట్లుకాత్యాయనబృహస్పతివచనములలోఁజెప్పఁబడియున్నది-వారిలోఁ కొందఱు పెండ్లియైనవారుగాను కొందఱు పెండ్లి గానివారుగా నున్నపక్షమందుఁ బెండ్లిగానివారికి ముందధికారము- అట్లుకాత్యాయనస్మృతియందువిశేషముచెప్పఁబడియున్నది- అందరు పెండ్లియైనవారైయుండి వారిలోఁగొందఱుధనవతులుగానుగొందఱునిర్ధనలుగానున్నపక్షమందు నిర్ధనలకు ముందధికారము - గౌతమస్మృతియందు మాతృధనవిషయమైయీవిశేషముచెప్పఁబడియున్నదిగనుకఁ పితృధనవిషయమందు నాన్యాయమునేగ్రహింపవలయును ॥

దుహితలు లేనిపక్షమందుదౌహిత్రులధికారులు. వారు లేనిపక్షమందుతల్లి. ఆపె లేనిపక్షమందు తండ్రి.

——— చశబ్దమువలనదుహితలు లేనిపక్షమందు దౌహిత్రులధికారులు- అట్లువిష్ణుమనువులుచెప్పియున్నారు ॥ వారు లేనియపుడుతల్లి యాపె లేనియపుడుతండ్రి- ఇక్కడఁ దలిదండ్రులని సాధారణముగాఁ జెప్పియున్నను సపిండాదులయందుఁబ్రత్యాసన్నుఁడుముఖ్యుఁడనుస్మృతివచనమననుసరించితండ్రియితరవర్ణపుపుత్రులకును మాతృసపత్నీపుత్రులకును సాధారణుఁడు గనుకను తల్లి యితనికి మాత్రమెతల్లియైయున్నదిగనుకను దండ్రికంటెఁ దల్లిముఖ్యురాలనియెఱుఁగవలయును ॥

తండ్రిలేనిపక్షమందుసోదరభ్రాతలు- వారులేనిపక్షమందు భిన్నోదరభ్రాతలు- వారు లేనిపక్షమందుభ్రాతృపుత్రులు.

తండ్రిలేనిపక్షమందుభ్రాతలు ధనమునుబొందుదురు- వారిలోసోదరులుసన్నిహితులుగనుక సోదరభ్రాతలకుముందధికారము - వారు లేనిపక్షమందు భిన్నోదరభ్రాతలకధికారము - వారు లేనిపక్షమందుభ్రాతృపుత్రులకధికారము- ఇట్లుచెప్పియుంటవలన భ్రాతలును భ్రాతృపుత్రులు నున్నప్పుడు భ్రాతలకేయధికారముగాని వారలకొడుకులకధికారములేదు - ఐననొకభ్రాత మృతుఁడైనప్పు డతనిద్రవ్యమందుతక్కిన భ్రాతలకందరికిని సమానాధికారముగలుగును కాఁబట్టి ఆద్రవ్యమును వారు

పంచుకొనకముందందొకఁడుమృతుఁడైనపక్షమందతనిభాగమతనికొడుకులకువచ్చును

వారు లేనిపక్షమందుపితామహి.

భ్రాతృపుత్రులు లేనిపక్షమందు పితామహియధికారిణియగును - తల్లికనంతరమేపితామహికధికారమున్నట్లొకవచనము రాఁగాఁ దండ్రి మొదలయినవారు మధ్యమముననుండుటవలనఁబ్రవేశింపఁజాలక యావచనముధనాధికారిమాత్రపరమై యుండెనుగనుక భ్రాతృపుత్రులులేనియపుడుపితామహి ధనమునుబొంద నేమియువిరోధములేదు॥

ఆపె లేనిపక్షమందుపితామహ. పితృవ్య. తత్పుత్రులు- వారులేనిపక్షమందు ప్రపితామహీ ప్రపితామహతత్పుత్రాదులు. ఇట్లేడుతరములవఱకు సగోత్రసపిండులుధనాధికారులగుదురు- వీరులేనిపక్షమందు సమానోదకులు.

ఆపె లేనిపక్షమందుసగోత్రజులైనసపిండులు ధనమును గ్రహింపవలయును-భిన్నగోత్రులగుసపిండులను వెనుకబంధుశబ్దముచేతఁజెప్పియున్నాఁడు - అనఁగాదండ్రిసంతానము భ్రాతృసుతపర్యంతము లేనిపక్షమందుపితామహి - పితామహుఁడు పితృభ్రాతలువారికుమారులును- పితామహునిసంతానము వారును లేనిపక్షమందుఁబ్రపితామహి-ప్రపితామహుఁడు అతనికొడుకులు వారికొడుకులును ఈరీతిగా నేడుతరములసగోత్రసపిండులుధనగ్రహణాధికారులగుదురనియెఱుఁగవలయును- వారు లేనియపుడుపిమ్మట యేడుతరములవారైన సమానోదకులనెడు జ్ఞాతులకు ధనగ్రహణాధికారము- ఈసమానోదకత్వముజ్ఞాతులకుపుట్టుక పేరు తెలిసియున్నవఱకునివర్తింపదనియొకపక్షముగలదు - ఏడవపురుషునియందుసపిండత్వమునివర్తించుననియుఁ బదునాలవపురుషునిదగ్గిరనుండి సమానోదకత్వము నివర్తించుననియుఁ బఱొంతరప్రకారముసమానోదకత్వము కూటస్థునిపేరునక్కడనుండి వంశము పుట్టినక్రమముదెలిసియున్నవఱకుండుననియుఁ బిమ్మట గోత్రమని చెప్పఁబడుననియు బృహన్మనువుచెప్పియున్నాఁడు॥

వారు లేనిపక్షమందుత్రివిధబాంధవులు.

ఇట్టిగోత్రజులైనసమానోదకులు లేనియపుడు బాంధవులుధనమునుబొందుదురు- అందుఁదనమేనత్తకొడుకులు. పినతల్లి పెత్తల్లి కొడుకులు మేనమామకొడుకులు . వీరుతనబంధువులుగనుకవీరికిమొదటధనమునుగ్రహించునధికారము ॥ తండ్రిమేనత్తకొడుకులు. తండ్రిపినతల్లిపెత్తల్లికొడుకులు. తండ్రిమేనమామకొడుకులు వీరుతండ్రిబంధువులుగనుక తనబంధువులు లేనిపక్షమందుఁదండ్రిబంధువులకుధనమునుగ్రహించునధికారము ॥ తల్లికిమేనత్తకొడుకులుతల్లికిమేనమామకొడుకులు. తల్లికిఁబినతల్లిపెత్తల్లి కొడుకులు. వీరుతల్లిబంధువులుగనుకఁదండ్రిబంధువులులేనిపక్షమందు తల్లిబంధువులు ధనమునుబొందుదురు ॥

వారు లేనిపక్షమందాచార్యశిష్యాదులు.

ఈమూఁడువిధములబంధువులు లేనిపక్షమందాచార్యుఁడుధనగ్రహణాధికారియగును అతఁడులేనిపక్షమందుశిష్యుఁడు - ఇట్లాపస్తంబస్మృతియందున్నది - శిష్యుఁడు లేనిపక్షమందుసబ్రహ్మచారియధికారియగును-సబ్రహ్మచారియనఁగాతనతోఁగూడనొకగురువుదగ్గిర నుపనయన వేదాధ్యయన తదర్థజ్ఞానాదులను బొందినవాఁడు ॥

వారు లేనిపక్షమందు బ్రాహ్మణద్రవ్యమునకొకశ్రోత్రియుఁడును. ఇతరులద్రవ్యమునకు ప్రభువునధికారులు.

అతఁడులేనిపక్షమందు బ్రాహ్మణునిద్రవ్యమును మఱియొక శ్రోత్రియుఁడుగ్రహింపఁదగును - అట్లుగౌతమస్మృతియున్నది - అతఁడులేనిపక్షమందుబ్రాహ్మణమాత్రుఁడధికారి - అట్లుమనువచనమున్నది - ఎప్పుడును బ్రాహ్మణునిద్రవ్యమునురాజుగ్రహింపఁగూడదు - అట్లు మనువచనము వలనను నారదవచనము వలనను దెలియవచ్చుచున్నది- క్షత్రియాదిసకలవర్ణములవారిద్రవ్యమును సబ్రహ్మచారివఱకుఁజెప్పఁబడినదాయాధికారులు లేనిపక్షమందురాజుగ్రహింపవలయును- అట్లుమనుస్మృతియందుఁజెప్పఁబడియున్నది॥ ౧౩౪

మూ॥ { వానప్రస్థయతిబ్రహ్మచారిణాంరిక్థభాగినః। క్రమేణా
చార్యసచ్ఛిష్యధర్మభ్రాత్రేకతీర్థినః ॥ ౧౩౫ ॥ * }

వ్యా॥ పుత్రాఃపౌత్రాఃప్రపౌత్రాశ్చదాయంగృహ్ణంతి తదభావే పత్న్యాదయ ఇత్యుక్తమిదానీం తదుభ

యాపవాదమాహ॥ వానప్రస్థేతి॥ వానప్రస్థస్య యతేర్బ్రహ్మచారిణశ్చ క్రమేణ ప్రతిలోమక్రమేణాచార్యసచ్ఛిష్యధర్మభ్రాత్రేకతీర్థిన రిక్థస్య ధనస్య భాగినః- బ్రహ్మచారీ నైష్ఠికః- ఉపకుర్వాణస్య ధనం మాత్రాదయ ఏవ గృహ్ణంతి- నైష్ఠికస్య తు ధనం తదపవాదకత్వేనాచార్యో గృహ్ణాతీత్యుచ్యతే- యతేస్తు ధనం సచ్ఛిష్యో గృహ్ణాతి-సచ్ఛిష్యః పునరధ్యాత్మశాస్త్రశ్రవణతదర్థానుష్ఠానక్షమః - దుర్వృత్తస్యాచార్యాదేరపి భాగానర్హత్వాత్ - వానప్రస్థస్య ధనం ధర్మభ్రాత్రేకతీర్థీ గృహ్ణాతి ధర్మభ్రాతా సంప్రతిపన్నో భ్రాతా ఏకతీర్థ్యేకాశ్రమీ ధర్మభ్రాతా చాసావేకతీర్థీ చ ధర్మభ్రాత్రేకతీర్థీ - ఏతేషాం పుత్రాదిషు సత్స్వపి భాగానర్హత్వాదేత ఏవ గృహ్ణంతి- నన్వనంశాస్త్వాశ్రమాంతరగతా ఇతి వసిష్ఠస్మరణాదాశ్రమాంతరగతానాం రిక్థసంబంధ ఏవ నాస్తి కుతస్తద్విభాగః - నచ నైష్ఠికస్యాపి స్వార్జితధనసంబంధః ప్రతిగ్రహాదినిషేధాత్ - అనిచయో భిక్షురితి గౌతమస్మరణాద్భిక్షోరపి న స్వార్జితధనసంబంధః- ఉచ్యతే- వానప్రస్థస్య తావత్ - అహ్నో మాసస్య షణ్ణాం వా తథా సంవత్సరస్య వా । అర్థస్య నిచయం కుర్యాత్కృతమాశ్వయుజే త్యజేదితి వచనాద్ధనసంబంధోఽస్త్యేవ- యతేరపి-కౌపీనాచ్ఛాదనం వాసో బిభృయాత్పుస్తకం తథా । యోగసంభారభేదాంశ్చ గృహ్ణీయాత్పాదుకే తథేత్యాదివచనాద్వస్త్రపుస్తకాదిసంబంధోఽస్త్యేవ నైష్ఠికస్యాపి శారీరయాత్రార్థం వస్త్రాదిసంబంధోఽస్త్యేవేతి తద్విభాగకథనం యుక్తమేవ॥ ౧౩౫

తా॥ పుత్రపౌత్రప్రపౌత్రులు దాయమును గ్రహింతురనియు - వారు లేనియపుడు భార్య మొదలగువారు గ్రహింతురనియుఁ జెప్పఁబడె నిక్కడ దానికపవాదమును జెప్పుచున్నాఁడు॥ వానప్రస్థుని ధనమును ధర్మపరుఁడై యతనితోఁగూడ వానప్రస్థాశ్రమమును బొందియున్న భ్రాత పొందును - యతియొక్క ధనమును వేదాంతశాస్త్రమును జదివి తెలుసుకొని యందుఁ జెప్పియున్న ప్రకారము నడుచుకొనఁగల శిష్యుఁడు పొందును - నైష్ఠికబ్రహ్మచారియొక్క ధనము నాచార్యుఁడు పొందును- ఉపకుర్వాణుఁడైన బ్రహ్మచారియొక్క ధనమును దల్లి మొదలగువారే గ్రహింపఁదగును - వీరిలోఁ బుత్రాదులుండఁదగినవారికిఁ బుత్రాదులుండినను వీరి ద్రవ్యము వారికిఁ జేరఁదనియభిప్రాయము॥ ఓయివసిష్ఠవచనమందాశ్రమాంతరమును బొందియున్నవారికంశము లేదనియున్నది- నైష్ఠికబ్రహ్మచారికి ప్రతిగ్రహాదులుగూడవు గనుక స్వార్జితంబును గలుగదు - సన్న్యాసి సంగ్రహము లేనివాఁడని గౌతమవచనమందుఁ జెప్పియున్నది గనుక సన్న్యాసికిని స్వార్జితము లేదు - ఇట్లుండగా వీరి ధనమున కధికారులఁ జెప్ప నేలయనుశంకకుత్తరము ॥ వానప్రస్థుఁడు దినమునకుఁగాని నెలకుఁగాని యారు నెలలకుఁగాని సంవత్సరమునకుఁగాని చాలునట్లు ధనసంగ్రహము చేయవచ్చుననియు సంగ్రహించియున్నదాని నాశ్వయుజమాసమందు విడువవలయుననియునున్నది-యతి గోచినివస్త్రమును పుస్తకమును యోగమునకుఁగావలసిన పదార్థములను బావుకోళ్లను భరింపఁదగుననియున్నది- నైష్ఠికబ్రహ్మచారికిని శరీరయాత్రార్థమయి వస్త్రాదిసంబంధము గలదు గనుక నా ద్రవ్యములగ్రహింపనధికారినిఁ జెప్పుటయుక్తమె॥ ౧౩౫

మూ. { సంసృష్టినస్తు సంసృష్టీ సోదరస్య తు సోదరః । దద్యా
దపహరేచ్చాంశం జాతస్య చ మృతస్య చ ॥ ౧౩౬ ॥ }

వ్యా॥ ఇదానీం స్వర్యాతస్య హ్యపుత్రస్య పత్న్యాదయో ధనభాజ ఇత్యుక్తం తస్యాపవాదమాహ॥ సంసృష్టిన ఇతి॥ విభక్తం ధనం పునర్మిశ్రీకృతం సంసృష్టం తదస్యాస్తీతి సంసృష్టీ- సంసృష్టత్వం చ న యేన కేనాపి- కింతు పిత్రా భ్రాత్రా పితృవ్యేణ వా- యథాహ బృహస్పతిః- విభక్తో యః పునః పిత్రా భ్రాత్రా వైకత్ర సంస్థితః । పితృవ్యేణాథ వా ప్రీత్యా స తు సంసృష్ట ఉచ్యత ఇతి - తస్య సంసృష్టినో మృతస్యాంశం భాగం విభాగకాలే అవిజ్ఞాతగర్భాయాం భార్యాయాముత్పన్నస్య పుత్రస్య సంసృష్టీ దద్యాత్పుత్రాభావే సంసృష్ట్యేవాపహరేద్గృహ్ణీయాన్న పత్న్యాదిః- సంసృష్టినస్తు సంసృష్టీత్యస్యాపవాదమాహ- సోదరస్య తు సోదరః- సంసృష్టినస్సంసృష్టీత్యనువర్తతే అతశ్చ సోదరస్య సంసృష్టినో మృతస్యాంశం సోదరస్సంసృష్టీ సంసృష్టానుజాతస్య సుతస్య దద్యాత్తదభావే అపహరేదితి పూర్వేణ సంబంధః- ఏవం చ సోదరస్యాసోదరస్య చ సంసర్గే సోదరస్య సంసృష్టినో ధనం సోదర ఏవ సంసృష్టీ గృహ్ణాతి న భిన్నోదర

రస్సంసృష్ట్యపీతిపూర్వోక్తస్యాపవాదః ॥ ౧౩౮

తా ॥ పుత్త్రులు లేనివాఁడుమృతుఁడైనన తనిధనమును భార్య మొదలగువారు గ్రహింపవలయు నన్నదానికపవాదమును జెప్పుచున్నాఁడు ॥ విభాగమైనపిమ్మట నావిభాగించుకొన్న ద్రవ్యమును మరలఁగలుపుకొని యొకటిగాఁగాపురముండువారు సంసృష్టులనఁబడుదురు - ఈసంసర్గము తండ్రితోడను భ్రాతతోడను బితృవ్యునితోడనుగూడు నేకానితక్కినవారితోఁగూడదు- అట్లు బృహస్పతివచనమున్నది- అట్టిసంసృష్టియైనవాఁడుమృతుఁడైనపిమ్మట విభాగము చేసుకొనునట్టిసమయమందతని భార్య గర్భిణియని తెలియకయుండిపిమ్మటఁగొడుకునుగన్నపక్షమందా కొడుకునకతనితండ్రి భాగమునీవలయును- లేనిపక్షమందు సంసృష్టియే గ్రహింపవలయుఁగాని వాని భార్యకీఁబనిలేదు ॥ సోదరులును భిన్నోదరులును సంసృష్టులైయున్నపక్షమందువారిలో మృతుఁడైనవానియంశమును వానిసోదరుఁడు గ్రహించి పూర్వోక్తప్రకారమతని భార్యగర్భిణియైయుండి కొడుకునుగన్నపక్షమందా కొడుకునకీవలయును లేనిపక్షమందాసోదరుఁడే గ్రహింపవలయునుగాని భిన్నోదరభ్రాత సంసృష్టియైయున్నను వాఁడు గ్రహింపఁగూడదు ॥ ౧౩౮

విభాగించుకొన్న ద్రవ్యమును మరలఁగలుపుకొన్నవారివిషయము.

మూ. అన్యోదర్యస్తుసంసృష్టీ నాన్యోదర్యోధనంహరేత్ । అసంసృష్ట్యపిచాదద్యాత్సంసృష్టో నాన్యమాతృజః ॥ ౧౩౯ ॥

వ్యా ॥ ఇదానీంసంసృష్టిన్యపుత్రేస్వర్యాతేసంసృష్టినోభిన్నోదరస్యసోదరస్యవాసంసృష్టినస్సద్భావేకస్యధనగ్రహణమితివివక్షాయాంద్వయోర్విభజ్యగ్రహణేకారణమాహ ॥ అన్యోదర్యఇతి ॥ అన్యోదర్యస్సాపత్నోభ్రాతాసంసృష్టీధనంహరేన్నపునరన్యోదర్యోధనంహరేదసంసృష్టీ- అనేనాన్వయవ్యతిరేకాభ్యామన్యోదర్యస్యసంసృష్టిత్వంధనగ్రహణేకారణముక్తం- అసంసృష్టీత్యేతదుత్తరేణాపిసంబధ్యతే - అతశ్చాసంసృష్ట్యపిసంసృష్టినోధనమాదదీత - కోసావిత్యతఆహ- సంసృష్టఏకోదరసంసృష్టస్సోదరఇతియావత్ - అనేనాసంసృష్టస్యాపిసోదరస్యధనగ్రహణేసోదరత్వంకారణముక్తం- సంసృష్టఇత్యుత్తరేణాపిసంబధ్యతే- తత్రచసంసృష్టస్సంసృష్టీత్యర్థః- నాన్యమాతృజః- అత్రైవశబ్దాధ్యాహారేణవ్యాఖ్యానంకార్యం- సంసృష్ట్యప్యన్యమాతృజఏవ సంసృష్టినోధనంనాదదీతేతి- ఏవంచాసంసృష్ట్యపిచాదద్యాదిత్యపిశబ్దశ్రవణాత్సంసృష్టోనాన్యమాతృజఏవేత్యవధారణనియమాదసంసృష్టసోదరస్యసంసృష్టభిన్నోదరస్యచవిభజ్యగ్రహణంకర్తవ్యమిత్యుక్తంభవతి - ద్వయోరపిధనగ్రహణకారణస్యైకైకస్యసద్భావాదేతదేవస్పష్టీకృతంమనునా- విభక్తాస్సహజీవంతోవిభజేరన్ పునర్యదీతిసంసృష్టివిభాగంప్రక్రమ్య- ఏషాంజ్యేష్ఠఃకనిష్ఠోవాహీయేతాంశప్రదానతః । మ్రియేతాన్యతరోవాపితస్యభాగోనలుప్యతే । సోదర్యావిభజేయుస్తంసమేత్యసహితాస్సమం । భ్రాతరోయేచసంసృష్టాభగిన్యశ్చసనాభయఇతివదతైషాంభ్రాతౄణాంసంసృష్టినాంమధ్యేజ్యేష్ఠోవాకనిష్ఠోవామధ్యమోవాంశప్రదానతోంశప్రదానే, సార్వవిభక్తికస్తసిః - విభాగకాలఇతియావత్ - హీయేతస్వాంశాద్భ్రశ్యేత ఆశ్రమాంతరపరిగ్రహేణ బ్రహ్మహత్యాదినావామ్రియేత వాతస్యభాగోనలుప్యతే- అతఃపృథగుద్ధరణీయోనసంసృష్టినపవగృహ్ణీయురిత్యర్థః- తస్యోద్ధృతస్యవినియోగమాహ-సోదర్యావిభజేయుస్తమితి- తముద్ధృతభాగంసోదర్యాస్సహోదరాఅసంసృష్టాఅపిసమేత్యదేశాంతరగతాఅపిసమాగత్యసహితాస్సంభూయసమమన్యూనాధికభావేన - యేచభ్రాతరోభిన్నోదరాస్సంసృష్టాస్తేచసనాభయోభగిన్యశ్చవిభజేయుస్సమంవిభజ్యగృహ్ణీయురితిస్పష్టోర్థః ॥ ౧౩౯

తా ॥ సంసృష్టియైనవాఁడుపుత్త్రులులేకమృతుఁడైనపక్షమందు మాఱుదల్లి కొడుకుసంసృష్టిగాను సహోదరుఁడు సంసృష్టిగాకయుండిరేని వారతనిద్రవ్యమును సరిగాఁ బంచుకొనవలయునను టకుఁగారణమును జెప్పుచున్నాఁడు ॥ మాఱుదల్లికొడుకుసంసృష్టియైనపక్షమందు భ్రాతృధనమును బొందునుగాని లేనిపక్షమందుఁబొందఁడు- ఏకోదరుఁడుసంసృష్టిగాకున్నను ధనమునుబొందును - ఇట్లు చెప్పుటవలన భిన్నోదరునకు ధనమువచ్చుటకు సంసర్గమ్ము

సంసృష్టియైయున్నభిన్నోదరుఁడును సంసృష్టిగాకయున్నసోదరుఁ

ధనుసమ భాగులగుదురు.

కారణమనియు సోదరునకు సోదరత్వమే ధనగ్రహణకారణమనియు నేర్పడుచున్నది సంసృష్టియైనభిన్నోదరుఁడు తానుమాత్రమే ధనమునుబొందఁగూడదు - ఇట్లు చెప్పుటవలననొకనికొకనికి ధనగ్రహణకారణ మొకటొకటి యున్నది గనుక సంసృష్టియైనభిన్నోదరుఁడును సంసృష్టిగానియేకోదరుఁడును సమముగాఁబంచుకొనవలయుననియేర్పడుచున్నది - ఈయంశమువిజ్ఞానేశ్వరీయందలి సంసృష్టివిభాగప్రకరణమందుఁ జేటముగాఁజెప్పఁబడియున్నది - అదియెట్లనిన- సంసృష్టులైనభ్రాతలలో జ్యేష్ఠుఁడుగాని మధ్యముఁడుగాని కనిష్ఠుఁడుగాని విభాగకాలమందు ఆశ్రమాంతరస్వీకారముచేతఁగాని బ్రహ్మహత్యాదిపాతకములచేతఁగాని భాగమునకనర్హుఁడై పోయినను మృతుఁడైనను వాని భాగమును సముదాయద్రవ్యము సుండియె త్తియతని సోదరభ్రాతలును సంసృష్టులగుభిన్నోదరభ్రాతలును సహోదరులైనభగినులును సమముగాఁ బంచుకొనవలయుఁగాని సంసృష్టులగుభిన్నోదరులుమాత్రమే గ్రహింపఁగూడదు( ఇదిపుత్రపత్న్యాదులు లేనివానివిషయమని మనుస్మృతివ్యాఖ్యానమందుఁదెలుపఁబడియున్నది॥ ౧౩౯

మూ. { క్లీబోథపతితస్తజ్జః పంగురున్మత్తకో జడః । అంధో
చికిత్స్యరోగాద్యాభర్తవ్యాస్స్యుర్నిరంశకాః॥ }

వ్యా॥ పుత్రపౌత్రపత్న్యాదిసంసృష్టినాం యద్దాయగ్రహణముక్తం తస్యాపవాదమాహ ॥ క్లీబఇతి ॥ క్లీబస్తృతీయాప్రకృతిః- పతితో బ్రహ్మహాదిః- తజ్జః పతితోత్పన్నః- పంగుః పాదవికలః ఉన్మత్తకో వాతపిత్తశ్లేష్మసన్నిపాతగ్రహావేశలక్షణైరున్మాదైరభిభూతః - జడో వికలాంతఃకరణో హితాహితావధారణాక్షమ ఇతియావత్ - అంధో నేత్రేంద్రియవికలః- అచికిత్స్యరోగోఽప్రతిసమాధేయరాజయక్ష్మాదిరోగగ్రస్తః - ఆద్యశబ్దేనాశ్రమాంతరగతపితృద్వేష్యుపపాతకిబధిరమూకనిరింద్రియాణాం గ్రహణం- యథాహవసిష్ఠః-అనంశాస్త్వాశ్రమాంతరగతా ఇతి- నారదోపి - పితృద్విట్పతితష్షండో యశ్చస్యాదౌపపాతికః। ఔరసా అపి నైతేంశం లభేరన్ క్షేత్రజాః కుతఇతి - మనురపి- అనంశౌ క్లీబపతితౌ జాత్యంధబధిరౌ తథా। ఉన్మత్తజడమూకాశ్చ యే చ కేచిన్నిరింద్రియాఇతి- నిర్గతమింద్రియం యస్మాద్వ్యాధ్యాదినాసనిరింద్రియః - ఏ తేక్లీబాదయోనిరంశకాః రిక్థభాజో నభవంతి కేవలమశనాచ్ఛాదనేన పోషణీయాభవేయుః- అభరణాత్పాతిత్యదోషః - సర్వేషామపితున్యాయ్యం దాతుం శక్త్యా మనీషిణా । గ్రాసాచ్ఛాదనమత్యంతంపతితోహ్యదదద్భవేదితిమనుస్మరణాత్ - అత్యంతం యావజ్జీవమిత్యర్థః - ఏతేషాం విభాగాత్ప్రాగేవ దోషప్రాప్తావనంశత్వం వేదితవ్యం- నపునర్విభక్తస్య- విభాగోత్తరకాలమపి వ్యాధ్యాదినాదోషనిరాకరణే భాగప్రాప్తిరస్త్యేవ- విభక్తేషు సుతోజాతస్సవర్ణాయాం విభాగభాగిత్యనేన సమానన్యాయత్వాత్ - పతితాదిష్వపుంలింగమవివక్షితమతశ్చపత్నీదుహితృమాత్రాదీనామప్యుక్తదోషదుష్టానామనంశత్వం వేదితవ్యం॥ ౧౪౦

తా॥ పుత్రాదులును-భార్య మొదలగువారును-సంసృష్టులును దాయగ్రహణాధికారులున్నందుకపవాదము నుజెప్పుచున్నాఁడు ॥ నపుంసకుఁడును బ్రహ్మహత్యాదిపాతకములచేతపతితుఁడైనవాఁడును- వానికిఁబుట్టినకొడుకులును- కాళ్లులేనివాఁడును- వాతపిత్తశ్లేష్మసన్నిపాతగ్రహావేశాద్యున్మాదములఁబొందినవాఁడును- తెలివిలేనివాఁడును - కన్నులులేనివాఁడును- ఔషధముచేతనివర్తింపఁజేయఁగూడనిరోగముగలవాఁడును- పిచ్చి మొదలగువారు భాగముసుబొందుటకధికారములేనివారు - ఇచ్చట మొదలగువారనుటచేతనాశ్రమాంతరముసుబొందినవాఁడును తండ్రితో విరోధించుకొన్నవాఁడునుఉపపాతకములఁజేసినవాఁడును చెవిటివాఁడును మూగవాఁడును రోగాదులచేతనింద్రియహానిని బొందినవాఁడును భాగార్హులుగారని తెలియఁదగినది- ఇట్లువసిష్ఠనారదమనుస్మృతులవలనఁదెలియవచ్చుచున్నది - ఈ చెప్పఁబడిన దాయాధికారములేనివారిని దాయముసుబొందువారు యావజ్జీవమన్నవస్త్రములనిచ్చి కాపాడవలయును-అట్లుకాపాడనివారికి పాతిత్యముసంభవించును- ఇట్లుమనుస్మృతియందుఁ జెప్పఁబడియున్నది - వీరలకిచెప్పినదోషములు విభాగకాలమునకుముందున్నయెడలనే భాగాధికారము లేకపోవునుగాని విభాగించుకొన్నపిదప నట్టిదోషములుసంభవించినను నాతెభా

నపుంసకత్వాది దోషములుగల వారికి భాగాధికారము లేదు - వారినిఁదక్కినవారుపోషింపవలయు.

గములనన్యులపహరింపఁగూడదు - విభాగము చేసుకొన్నపిమ్మట వారిరోగము మొదలగుదోషము లౌషధాదులచేతనివర్తించినపక్షమందట్టివారికివారి భాగమునుగడమవారు ముందు గ్రహించికొనియుందురుగనుక దానినీవలయును - పతితాదులయందుఁబుల్లింగము చెప్పుటవివక్షితముగాదుగనుక భార్యకూఁతురుతల్లి మొదలగుస్త్రీలకయినట్టిదోషములు గలిగియున్నపక్షమందువారికిఁజేరఁదగినదాయముచేరదని తెలియవలయును॥ ౧౩౭

మూ. ఔరసాఃక్షేత్రజాస్త్వేషాంనిర్దోషాభాగహారిణః॥ ౧౩౮॥

వ్యా॥ క్లీబాదీనామనంశత్వే తత్పుత్రాదీనామప్యనంశత్వే ప్రాప్త ఇదమాహ॥ ఔరసా ఇతి॥ తేషాం క్లీబాదీనామౌరసాః క్షేత్రజా వా పుత్రా నిర్దోషా అంశగ్రహణవిరోధిక్లైబ్యాదిదోషరహితా భాగహారిణోంశగ్రాహిణో భవంతి- తత్ర క్లీబస్య క్షేత్రజః పుత్రస్సంభవత్యన్యేషామౌరసా అపి - ఔరస క్షేత్రజయోర్గ్రహణ మితరపుత్రవ్యుదాసార్థం॥ ౧౩౮

తా॥ నపుంసకాదులకుభాగములేకసుటచేత వారికొడుకులకును భాగము లేదని ప్రాప్తముకాఁగా దీనిఁజెప్పుచున్నాఁడు॥ ఆనపుంసకుఁడు మొదలగువారియౌరసపుత్రులును క్షేత్రజపుత్రులును దాయగ్రహణమునకుబాధకములనిచెప్పఁబడిన దోషములు లేనివారైనపక్షమందువారికిఁదమతండ్రులభాగమువచ్చును - నపుంసకునకు క్షేత్రజపుత్రుఁడు మాత్రముకలుగును తక్కినవారికౌరసులునుగలుగుదురు- ఔరసక్షేత్రజులనుటచేతనీయధికారము తక్కినపుత్రులకు లేదని తాత్పర్యము॥ ౧౩౮

నపుంసకాదుల యౌరస క్షేత్రజపుత్రులు నిర్దోషులైనపక్షమందుఁ దమతండ్రులభాగమునొందుదురు

మూ. సుతాశ్చైషాం ప్రభర్తవ్యాయావద్వైభర్తృసాత్కృతాః॥ ౧౩౯॥

వ్యా॥ క్లీబాదిదుహితౄణాం విశేషమాహ॥ సుతా ఇతి॥ ఏషాం క్లీబాదీనాం సుతా దుహితరో యావద్వివాహసంస్కృతా భవంతి తావద్భరణీయాశ్చశబ్దాత్సంస్కార్యాశ్చ॥ ౧౩౯

క్లీబాదులకూఁతులఁబోషించి పెండ్లి సేయవలయు

తా॥ నపుంసకాదులకూఁతులవిషయమందువిశేషమును జెప్పుచున్నాఁడు॥ ఈ చెప్పఁబడినదాయాధికారము లేనివారికూఁతులను వివాహమగునంతవఱకుఁ బోషించి వారికి వివాహము చేయవలయును॥ ౧౩౯

మూ. { అపుత్రాయోషితశ్చైషాంభర్తవ్యాస్సాధువృత్తయః॥ ని
ర్వాస్యావ్యభిచారిణ్యఃప్రతికూలాస్తథైవచ ॥ ౧౪౦ ॥** }

వ్యా॥ క్లీబాదిపత్నీనాం విశేషమాహ॥ అపుత్రా ఇతి॥ ఏషాం క్లీబాదీనామపుత్రాః పత్న్యస్సాధువృత్తయస్సదాచారాశ్చేద్భర్తవ్యాః భరణీయాః- వ్యభిచారిణ్యస్తు నిర్వాస్యాః- ప్రతికూలాస్తథైవ నిర్వాస్యాః భరణీయాశ్చ వ్యభిచారిణ్యశ్చేన్న పునః ప్రాతికూల్యమాత్రేణ భరణమపి న కర్తవ్యం॥ ౧౪౦

దాయాధికారము లేనివారి భార్యలు పతివ్రతలైయుండిరేని భరణమీవలె.

తా॥ ఈ చెప్పఁబడినదాయాధికారము లేనివారి భార్యలవిషయమందు విశేషమును జెప్పుచున్నాఁడు॥ వీరి భార్యలఁబుత్రులు లేనివారిని సదాచారముగలవారిని బోషింపవలయును - వ్యభిచరించువారినింటనుండి వెడలఁగొట్టవలయును - ప్రతికూలురాండ్రై వ్యభిచారము లేకయున్నపక్షమందు వెడలఁగొట్టిభరణమీవలయును॥ ౧౪౦

మూ. { పితృమాతృపతిభ్రాతృదత్తమధ్యగ్న్యుపాగతం ।
ఆధివేదనికాద్యంచస్త్రీధనంపరికీర్తితం ॥ ౧౪౧॥ }

వ్యా॥ విభజేరంత్సుతాః పిత్రోరిత్యత్ర స్త్రీపుంసధనవిభాగం సంక్షేపేణాభిధాయ పురుషధనవిభాగో విస్తరేణాభిహితః ఇదానీం స్త్రీధనవిభాగం విస్తరేణాభిధాస్యంస్తత్స్వరూపం తావదాహ॥ పిత్రిరితి॥ పితా మాతా పత్యా భ్రాత్రా చ యద్దత్తం యచ్చ వివాహకాలే అగ్నావధికృత్య మాతులాదిభిర్దత్తం ఆధివేదనికమాధివేదననిమిత్తం - అధివిన్నస్త్రియై దద్యాదితి వక్ష్యమాణం- ఆద్యశబ్దేన రిక్థక్రయసంవిభాగపరిగ్రహాధిగమప్రాప్తమేతత్ స్త్రీధనం మన్వాదిభిరుక్తం స్త్రీధనశబ్దశ్చ యౌగికో న పారిభాషికః- యోగసంభవే పరిభాషాయా అయుక్తత్వాత్ - యు

త్పునర్మనునోక్తం- అధ్యగ్న్యధ్యావహానికం దత్తంచ ప్రీతికర్మణి। భ్రాతృమాతృపితృప్రాప్తం షడ్విధం స్త్రీధనంస్మృతమితి స్త్రీధనస్య షడ్విధత్వం తన్న్యూనసంఖ్యావ్యవచ్ఛేదార్థం నాధికసంఖ్యావ్యవచ్ఛేదాయ· అధ్యగ్న్యాదిస్వరూపంచ కాత్యాయనేనాభిహితం- వివాహకాలే యత్ స్త్రీభ్యో దీయతే హ్యగ్నిసన్నిధౌ। తదధ్యగ్నికృతం సద్భిః స్త్రీధనం పరికీర్తితం॥ యత్పునర్లభతే నారీ నీయమానా పితుర్గృహాత్। అధ్యావహానికం నామ స్త్రీధనం తదుదాహృతం। ప్రీత్యాదత్తంతు యత్కించిచ్ఛ్వశ్ర్వా వా శ్వశురేణ వా। పాదవందనికం చైవ ప్రీతిదత్తం తదుచ్యతే। ఊఢయా కన్యయా వాపి పత్యుః పితృగృహేపి వా। భ్రాతుస్సకాశాత్పిత్రోర్వా లబ్ధం సౌదాయికం స్మృతమితి॥ ౧౪౧

తా॥ విభజేరన్సుతాః పిత్రోః- అను శ్లోకమందు స్త్రీపురుషధనవిభాగమును సంక్షేపముగాఁ జెప్పి తరువాతఁ బురుషధనవిభాగము విస్తరించి చెప్పఁబడెను - ఇఁక స్త్రీధనవిభాగమును విస్తరించి చెప్పఁ

స్త్రీధనస్వరూపము దెలుపుట.

బోవుచు దాని స్వరూపమును జెప్పుచున్నాఁడు ॥ తండ్రిచేతఁ దల్లిచేత భర్తచేతఁ దోడబుట్టినవాని చేత నీఁబడినదియు - వివాహకాలమందు మేనమామ మొదలగువారు చదివించినదియు - పెనిమిటి మరల వివాహము చేసుకొనుపక్షమందుఁ బూర్వభార్యకు ధనమీవలయునని ౧౪౬ వ-శ్లోకమందుఁ జెప్పఁబడును గనుక అట్లు పెనిమిటిచేత నీఁబడిన ద్రవ్యమును - అప్రతిబంధదాయము- క్రయము- సప్రతిబంధదాయము- ఒకనిది కానిదానిఁ గ్రహించుట- నిధ్యాదులను బొందుట-వీనివలన స్త్రీకి వచ్చిన ద్రవ్యమును ఈలాటిది స్త్రీధనమనంబడును। మనుస్మృతియందు-అధ్యగ్నికము-అధ్యావహానికము - ప్రీతిదత్తము - భ్రాతలిచ్చినది- తల్లి యిచ్చినది· తండ్రియిచ్చినదియని యిట్లు స్త్రీధనమాఱు తెఱంగులనుండునని చెప్పుట న్యూనసంఖ్యావ్యవచ్ఛేదముకొఱకుఁగాని యధికసంఖ్యావ్యవచ్ఛేదముకొఱకుఁగాదు గనుక నిచట షడ్విధవ్యతిరిక్త స్త్రీధనమును జెప్పుట యామనువచనమునకు విరుద్ధంబుగాదని తెలియఁదగినది॥ అధ్యగ్ని మొదలగు వాని స్వరూపము కాత్యాయనులు చెప్పినరీతిని క్రిందఁ దెలుపఁబడుచున్నది - వివాహవేళ యందగ్నిహోత్రము నిసమీపమందు స్త్రీలకుఁ జదివింపఁబడునది యధ్యగ్నికృతమనంబడును- తండ్రియింటనుండి పిలుచుకొనిపోవునపుడు స్త్రీకిచ్చునట్టి ధనమధ్యావహానికమనంబడును- అత్తగారుగాని మామగారుగాని సంతోషముచేత నిచ్చినది నమస్కరించినపుడిచ్చినదియుఁ బ్రీతిదత్తమనంబడును - పెండ్లియైనదానికిఁగాని కానిదానికిఁగాని పెనిమిటింటఁగాని తండ్రియింటఁగాని యన్నదమ్ములైనను తల్లిదండ్రులైన నిచ్చినది సౌదాయికమనంబడును॥ ౧౪౧

మూ. బంధుదత్తం తథా శుల్కమన్వాధేయకమేవచ॥ ౧౪౫ ॥

వ్యా॥ కించ-బంధుదత్తమితి॥ బంధుభిః కన్యాయా ఆత్మమాతృపితృబంధుభిశ్చ యద్దత్తం - శుల్కం యద్గృహీత్వా కన్యా దీయతే- అన్వాధేయకం పరిణయనాదనుపశ్చాదాహితం దత్తం - ఉక్తంచ కాత్యాయనేన - వివాహాత్పరతో యచ్చ లబ్ధం భర్తృకులాత్ స్త్రియా। అన్వాధేయం తు తద్ద్రవ్యం లబ్ధం పితృకులాత్తథేతి - స్త్రీధనం పరికీర్తితమితి గతేనసంబంధః॥ ౧౪౫

తా॥ మఱియును గన్యకకు ఆత్మబాంధవులచేతఁగాని పితృబాంధవుల చేతఁగాని మాతృ బాంధవుల చేతఁగాని యీఁబడిన ద్రవ్యంబును- వివాహమందుఁ గన్యనిచ్చుటకుఁగాదీసికొన్న రొక్కమును-

ఇదియును స్త్రీధనమె.

వివాహానంతరము భర్తృపార్శ్వము వారిచేతఁగాని తండ్రిపార్శ్వము వారిచేతఁగాని కన్యకకీఁబడిన ద్రవ్యమును స్త్రీధనంబగును - వివాహానంతరము భర్తృపార్శ్వము వారుగాని తండ్రిపార్శ్వము వారుగాని యిచ్చినది యన్వాధేయకమనెడు స్త్రీధనమని కాత్యాయనులచేఁ జెప్పఁబడియున్నది ॥ ౧౪౫

మూ. అతీతాయామప్రజసి బాంధవాస్తదవాప్నుయుః॥ ౧౪౬॥

వ్యా॥ ఏవం స్త్రీధనముక్త్వా తద్విభాగమాహ॥ అతీతాయామితి॥ తత్పూర్వోక్తం స్త్రీధనమప్రజసి అనపత్యాయాం దుహితృదౌహిత్రీదౌహిత్రపుత్రపౌత్రరహితాయాం స్త్రియామతీతాయాం బాంధవా భర్త్రాదయో వక్ష్యమాణా గృహ్ణంతి ॥ ౧౪౬

తా॥ అస్వామివిక్రయమనువ్యవహారపదమారంభింపఁబడుచున్నది॥ దాఁచనుంచినపరద్రవ్యమునుగాని-ఒకఁడు పోఁగొట్టుకోఁగా దొరికినపరద్రవ్యమునుగాని - అపహరింపఁబడినపరద్రవ్యమునుగాని మఱియొకఁడువిక్రయించినదదియస్వామివిక్రయమనంబడునని దానిస్వరూపమునారదులచేఁజెప్పఁబడియున్నది- దానియందు జరగవలసినవిషయమును జెప్పుచున్నాఁడు॥ తనసొమ్మును మఱియొకఁడమ్మినను- ఇచ్చినను-కుదవయుంచినను - దానియధికారియా వ్యవహారమును తాను చేయలేమగనుకతనస్వత్వమాత్రమునుంచుకొని యున్నవానికిఁగలుగదు కాఁబట్టిచూచినప్పుడు తన ద్రవ్యమును తానుదీసుకొనవచ్చును- కొన్నవాఁడు తానుగొన్నవయినమును దెలుపకున్నను- రహస్యముగాఁగొనియున్నను- అల్పస్వము రాఁదగినయుపాయములేనివానియొద్దఁగొనియున్నను- తక్కువవెలకుఁగొనియున్నను రాత్రిమొదలగువ్యవహారముచేయఁగూడనిసమయములయందుఁగొనియున్నను దొంగవలెదండనమునుబొందును॥ స్మృత్యంతరమందును అస్వామివిక్రీతమైనద్రవ్యముద్రవ్యస్వామికిఁజేరుననియు-కొన్నవాఁడు బహిరంగముగాఁగొనియున్నపక్షమందతనికిఁ దప్పులేదనియు- అట్లుగానియెడనతఁడుదొంగయగుననియుఁజెప్పఁబడియున్నది. ౧౬౨

ఒకనిసొమ్మును మఱియొకఁడమ్మేనేని దాని ద్రవ్యస్వామి రాజునకుఁదెల్పి తీసుకోవచ్చును - అట్టిదాని నమ్మిన వాఁడును రహస్యముగాఁ గొన్నవాఁడును శిక్షార్హులగుదురు.

మూ. { నష్టాపహృతమాసాద్య హర్తారం గ్రాహయేన్నరమ్। దే
శకాలాతిపత్తౌ చ గృహీత్వా స్వయమర్పయేత్॥ ౧౬౩॥ }

వ్యా॥ స్వామ్యభియుక్తేన క్రేత్రా కింకర్తవ్యమిత్యత ఆహ॥ నష్టమపహృతం వా స్వదీయం క్రయాదినా ప్రాప్య హర్తారం క్రేతారం గ్రాహయేద్చోరోద్ధరణకాదిభిరాత్మవిశుద్ధ్యర్థం రాజదండప్రాప్త్యర్థం చ - అథావిదితదేశాంతరంగతః కాలాంతరేణ వా విపన్నస్తదా మూలసమాహరణాశక్తేర్విక్రేతారమదర్శయిత్వైవ స్వయమేవ తద్ధనం నాష్టికస్య సమర్పయేత్ - తావతైవాసౌ శుద్ధో భవతీతి శ్రీకరాచార్యేణ వ్యాఖ్యాతం - తదిదమనుపపన్నం విక్రేతురదర్శనాచ్ఛుద్ధిరిత్యనేనపౌనరుక్త్యప్రసంగాత్ - అతోఽన్యథా వ్యాఖ్యాయతే-నష్టాపహృతమితి నాష్టికం ప్రత్యయముపదేశః- నష్టమపహృతం వాత్మీయద్రవ్యమాసాద్య క్రేతృహస్తస్థం జ్ఞాత్వా తం హర్తారం స్థలపాలాదిభిర్గ్రాహయేత్ - దేశకాలాతిపత్తౌ దేశకాలాతిక్రమే స్థానపాలాద్యసన్నిధానే తద్విజ్ఞాపన కాలాత్యయే పలాయనాశంకాయాం స్వయమేవ గృహీత్వా తేభ్యస్సమర్పయేత్. ౧౬౩

తా॥ ద్రవ్యాధికారి వాదము దెచ్చినప్పుడు కొన్నవాఁడేమి చేయవలయుననఁగాఁ జెప్పుచున్నాఁడు॥ అన్యులు పోఁగొట్టుకొనఁగా దొరికినసొమ్మునైనను అపహరించినసొమ్మునయినను- ఆసొమ్మునం దధికారము లేనివానియొద్దఁ గొన్నవాఁడు తనకమ్మినవానిఁ బట్టియీవలయును - అట్లయిననతనికిఁ దప్పును రాజదండనమును గలుగదు - విక్రయించినవాఁడు తానెఱుఁగనిదేశమునకుఁబోయియున్నను విపత్తినిఁజెందినను తానే యాద్రవ్యమును ద్రవ్యస్వామికొప్పగింపవలయును - అంతమాత్రము చేతనే తనతప్పు తొలఁగునని శ్రీకరాచార్యుఁడు వ్యాఖ్యానము చేసెనదియుక్తము కాదు- అట్లయిన నుత్తరశ్లోకమందమ్మినవానిఁ నగుపఱచుటవలనఁ గొన్నవాఁడు శుద్ధుఁడగుననియున్నదిగనుక పునరుక్తి సంభవించును- కాఁబట్టి విజ్ఞానేశ్వరుండు ప్రకారాంతరముగా వ్యాఖ్యానము చేయువిధంబెట్లనిన ఇది ద్రవ్యమును బోఁగొట్టుకొన్నవానిఁ గూర్చి చెప్పనది పోయినతనద్రవ్యమును గొన్నవానియింటఁ జూచినప్పుడా కొన్నవానిఁ దలారి తోటలు మొదలగువారి చేతఁబట్టింపవలయును- వారు దాపున లేకవారికిఁ దాను దెలుపునంతలో వాఁడు పరుగెత్తి పోవుననుసందేహము గలిగినపుడు దానే పట్టుకొనివచ్చి వారికొప్పగింపవలయును. ౧౬౪

పోయినసొమ్ము దొరికినప్పుడు దానియధికారి- అది యెవనియొద్ద నున్నదో వాని రాజకీయులగు నధికారుల కొప్పగింపవలయును.

మూ. { విక్రేతుర్దర్శనాచ్ఛుద్ధిస్స్వామీద్రవ్యంనృపోదమమ్।
క్రేతామూల్యమవాప్నోతితస్మాద్యస్తస్యవిక్రయీ॥ }

వ్యా ॥ గృహీతేక్రేతరికింకర్తవ్యమిత్యతఆహ॥ విక్రేతురితి॥ యద్యసౌగృహీతఃక్రేతానమయేదమపహృతమస్యసకాశాత్క్రీతమితివక్తి- తదాతస్యక్రేతుర్విక్రేతుర్దర్శనమాత్రేణశుద్ధిర్భవతి- నపునరసౌతదభియోజ్యః- కింతుతత్ప్రదర్శితేనవిక్రేత్రాసహనాష్టికస్యవివాదః- యథాహబృహస్పతిః - మూలేసమాహృతేక్రేతానాభియోజ్యఃకథంచన। మూలేనసహవాదస్తునాష్టికస్యవిధీయతఇతి-తస్మింశ్చవివాదేయద్యస్వామివిక్రయనిశ్చయోభవతి - తదాతస్యనష్టాపహృతస్యగవాదిద్రవ్యస్యయోవిక్రయీవిక్రేతాతస్యసకాశాత్స్వామీనాష్టికస్స్వకీయంద్రవ్యమాప్నోతి నృపశ్చాపరాధానురూపందండంక్రేతాచమూల్యమవాప్నోతి- యదాసౌదేశాంతరంగతస్తదాయోజనసంఖ్యయానయనార్థంకాలోదేయః- ప్రకాశంవాక్రయంకుర్యాన్మూలంవాపిసమర్పయేత్। మూలానయనకాలశ్చదేయస్తత్రాధ్వసంఖ్యయేతిస్మరణాత్- అథావిజ్ఞాతదేశతయామూలమాహర్తుంనశక్నోతి తదాక్రయంశోధయిత్వైవశుద్ధోభవతి - అసమాహార్యమూలస్తుక్రయమేవవిశోధయేదితిమనుస్మరణాత్ -యదాపునస్సాక్ష్యాదిభిర్దివ్యేనవాక్రయంనశోధయతిమూలంచనప్రదర్శయతితదాసఏవదండభాగ్భవతీతి- అనుపస్థాపయన్మూలంక్రయంవాప్యవిశోధయన్। యథాభియోగంధనినేధనందాప్యోదమంచసఇతిస్మరణాత్. ౧౬౮

తా ॥ కొన్నవానిఁబట్టుకొన్నతరువాతజరగవలసినదానిఁజెప్పుచున్నాఁడు॥పట్టుపడినకొన్నవాఁడు నేనీద్రవ్యమునపహరింపలేదు పలానివానియొద్దఁగొంటినని చెప్పినపక్షమందు నతఁడుతనకమ్మినవానినగుపఱుపవలయును- తరువాతనాద్రవ్యస్వామియమ్మినవానిమీఁదనే వ్యవహరింపవలయునుగాని కొన్నవానిమీఁదవివాదముచేయఁగూడదు-అట్లుబృహస్పతివచనమున్నది-ఆవ్యవహారమందువిక్రయించినవాఁడాద్రవ్యమున కధికారికాఁడని యేర్పడినపక్షమందుప్రభువునవానివలన నాద్రవ్యమును ద్రవ్యస్వామికిప్పించి వానితప్పునకుఁదగిన దండనమునువిధించికొన్నవాఁడిచ్చియున్నమూల్యద్రవ్యమును మరలనిప్పించవలయు-

కొన్నవాఁడు తనకమ్మిన వానిఁ జూపిన తరువాతఁ గొన్నవానిమీఁద వ్యవహారము లేదు.

అమ్మినవాఁడు దేశాంతరమునకుఁబోయియున్నపక్షమందావాఁడలకుఁదగినంతకాలముగడువీవలయును - ఇట్లుస్మృత్యంతరమందుఁజెప్పఁబడియున్నది - అమ్మినవాఁడుండుచోటు దెలియక యతనిఁబట్టిచ్చుటశక్యముగాని పక్షమందుఁదానుకొన్నవయినమంతయుసరిగారుజువుపఱిచిద్రవ్యాధికారికాద్రవ్యమునిచ్చితానుతప్పులేనివాఁడగును-అట్లుమనుస్మృతియందున్నది- సాక్షులుమొదలగువారిచేతఁగానిదివ్యప్రమాణముచేతఁగాని తానుదానినిమ్రుపటముగాఁగొన్నట్లు రుజువుచేయలేనిపక్షమందతఁడేదండనమునుబొందును- అట్లుస్మృతియున్నది. ౧౬౮

మూ. { ఆగమేనోపభోగేననష్టంభావ్యమతోన్యథా।పంచ
బంధోదమస్తస్యరాజ్ఞే తేనావిభావితే ॥ ౧౬౯ ॥ }

వ్యా ॥ స్వంలభేతాన్యవిక్రీతమిత్యుక్తంతల్లిప్సునాకింకర్తవ్యమిత్యతఆహ॥ ఆగమేనేతి॥ ఆగమేనరిక్థక్రయాదినోపభోగేనచమదీయమిదంద్రవ్యంతచ్చైవంనష్టమపహృతంవేత్యపిభావ్యంసాధనీయంతత్స్వామినా - అతోన్యథాతేనస్వామినాఅవిభావితేపంచబంధోనష్టద్రవ్యస్యపంచమాంశోదమోనాష్టికేనరాజ్ఞేదేయః-అత్రచాయంక్రమః- పూర్వంస్వామీనష్టమాత్మీయంసాధయేత్తతఃక్రేతాచౌర్యపరిహారార్థంమూల్యలాభాయచవిక్రేతారమానయేత్- అథానేతుంనశక్నోతితదాత్మదోషపరిహారాయక్రయంశోధయిత్వాద్రవ్యంనాష్టికస్యసమర్పయేదితి. ౧౬౯

తా॥ మఱియొకనిచేతవిక్రయింపఁబడినతనసొమ్మునుతానుబొందునని చెప్పఁబడెనట్లుపొందనిచ్ఛగలవాఁడేమిచేయవలయునోదానిఁజెప్పుచున్నాఁడు ॥ ఆద్రవ్యమునధికారియివినా ద్రవ్యమునాకుఁబలానిరీతిగాలభించినదియీద్రవ్యమునాదగ్గిరనుండునపుడు పెక్కండ్రెఱుఁగుదురు -

...మ్ములచేతవిక్రయింపఁబ

డినతనసొమ్మునుతనదనిరుజువుచేయవలయును.

ఇదివఱలానివిధముగాఁబోయెను- అనిరుజువుచేయవలయును - అట్లుచేయనిపక్షమందుఁ బోయినసొమ్మునకై దవపాలిద్రవ్యమును దండనముగా రాజునకీవలయును ॥ ఈవిష యమైజరగవలసినక్రమము- మొదటద్రవ్యాధికారియాద్రవ్యము తనదనియునివ్విధము బునఁబోయెననియురుజువుపఱుపవలయును- పిమ్మటకొన్నవాఁడుతనమీఁదికివచ్చుదొంగతనమునుదప్పించుకొనుటకునుతా నిచ్చినవెలనురాఁబట్టుకొనుటకునుఅమ్మినవానిఁబట్టియీయవలయును - అట్లుపట్టియీయఁజాలనిపక్షమందుఁ దానుకొనుటనురుజువుచేసియాద్రవ్యమునుద్రవ్యాధికారికీవలయును॥ ౧౬౯

మూ. {హృతం ప్రణష్టం యో ద్రవ్యం పరహస్తాదవాప్నుయాత్ ।
అనివేద్య నృపే దండ్యస్సతు షణ్ణవతిం పణాన్ ॥ ౧౭౦ ॥*}

వ్యా॥ తస్కరస్య ప్రచ్ఛాదకం ప్రత్యాహ॥ హృతమితి॥ హృతం ప్రణష్టం వా చోరాదిహస్తస్థం ద్రవ్యమనేనమదీయం ద్రవ్యమపహృతమితి నృపస్యానివేద్యైవ దర్పాదినా యోగృహ్ణీత్యసౌ షణ్ణవతిం పణాన్ దండనీయస్తస్కర ప్రచ్ఛాదకత్వేనమప్తత్వాత్ ॥ ౧౭౦

పోయిన తనసొమ్మును రాజునకుఁదెలుపక చోరాదులవలన రాఁబట్టుకొన్నవానికిదండనము.

తా ॥ దొంగనుదాఁచినవానిఁ గూర్చి చెప్పుచున్నాఁడు ॥ అపహరింపఁబడినద్రవ్యమునుగానిపోఁగొట్టుకొనఁబడినద్రవ్యమునుగాని యిదినాద్రవ్యమిట్లు వీనియొద్దదొరికినదనిరాజునకుఁదెలుపకయే- పెదరింపుమొదలగువానిచేత చోరాదులయొద్దనుండి తీసికొన్నవాఁడుదొంగనుమఱుఁగుపఱిచినవాఁడగునుగనుకఁ దొంబదియాఱుపణములదండనమునకర్హుఁడగును॥ ౧౭౦

మూ. {శౌల్కికైః స్థానపాలైర్వా నష్టాపహృతమాగతమ్ । అ
ర్వాక్సంవత్సరాత్స్వామీహరేతపరతో నృపః॥ ౧౭౧॥}

వ్యా ॥ రాజపురుషానీతం ప్రత్యాహ॥ శౌల్కికైరితి॥ యదా తు శుల్కాధికారిభిః స్థానరక్షిభిర్వా నష్టమపహృతం ద్రవ్యం రాజపార్శ్వం ప్రత్యానీతం తదాసంవత్సరాదర్వాక్ప్రాప్తశ్చేన్నాష్టికస్తద్ద్రవ్యమవాప్నుయాత్ - ఊర్ధ్వం పునస్సంవత్సరాద్రాజా గృహ్ణీయాత్ - స్వపురుషానీతం ద్రవ్యం జనసమూహే ఉద్ఘోష్య యావత్సంవత్సరం రాజ్ఞా రక్షణీయం॥ యథాహ గౌతమః- ప్రణష్టమస్వామికమధిగమ్య రాజ్ఞే ప్రబ్రూయుర్విఖ్యాప్య సంవత్సరం రాజ్ఞా రక్ష్యమితి- యత్తు నమనునా అవధ్యంతరముక్తం- ప్రణష్టస్వామికం ద్రవ్యం రాజా త్ర్యబ్దం నిధాపయేత్ । అర్వాక్త్ర్యబ్దాద్ధరేత్స్వామీ పరతో నృపతిర్హరేదితి - తచ్ఛ్రుతవృత్తసంపన్నబ్రాహ్మణవిషయం - రక్షణనిమిత్తం షడ్భాగాదిగ్రహణం చ తేనైవోక్తం- ఆదదీతాథ షడ్భాగం ప్రణష్టాధిగతాన్నృపః । దశమం ద్వాదశం వాపి సతాం ధర్మమనుస్మరన్నితి తృతీయద్వితీయ ప్రథమ సంవత్సరేష్వాగతేషు యథాక్రమం షడ్ద్వాదశో భాగా వేదితవ్యాః- ప్రపంచితం చైతత్పురస్తాత్॥ ౧౭౧

తా ॥ సుంకరులు మొదలగురాజభృత్యులుపట్టుకొనివచ్చి రాజునొద్దనొప్పగించినసొమ్మునుగూర్చి చెప్పుచున్నాఁడు

సుంకరులు మొదలగువారు తెచ్చి రాజునొద్దనొప్పగించినసొమ్ము దానియధికారికిఁజేరువిషయము.

పోఁగొట్టుకోఁబడిన ద్రవ్యమునుగాని అపహరింపఁబడిన ద్రవ్యమునుగాని సుంకరులు బంట్రౌతులు మొదలగువారుకనిపెట్టి రాజునొద్దకుఁదెచ్చియిచ్చిరేని రాజాద్రవ్యమును సంవత్సరములోపలదానియధికారివచ్చినపక్షమందువానికీవలయును - తరువాతనైతేఁ దు రాసపక్షమందు తాను గ్రహింపవచ్చును.॥ రాజుతనమనుష్యులు తెచ్చినసొమ్మును సకలజనులకుఁదెలియునట్లుచాటింపించి యొకయేఁడుగడచునంతవఱకుఁ గాపాడవలయును - అట్లుగౌతములు చెప్పియున్నారు ॥ మూఁడుసంవత్సరములకుఁబిమ్మట రాజునకుఁజెందుననిమనువుచెప్పినగడువు వేదశాస్త్రసంపన్నుఁడై సదాచారపరుఁడై యుండుబ్రాహ్మణునిద్రవ్యవిషయము ॥ ఆసొమ్ముగలవాఁడొకసంవత్సరమునకు వెనుకవచ్చెనేనిదానిలో పండ్రెండవపాలును రెండుసంవత్సరములకు వెనుకవచ్చె

నేనిపదవపాలునుమూఁడుసంవత్సరములకు వెనుకవచ్చి నేనిఆయవపాలును తద్ద్రవ్యరక్షణార్థమై రాజునకుఁ జేరుననిమను వచనమున్నది-ఈవిషయము (౩౨వ) శ్లోకమందు లెస్సగా వివరింపఁబడియున్నది. ౧౬౧

మూ. { పణానేకశఫే దద్యాచ్చతురః పంచమానుషే। మహి
షోష్ట్రగవాం ద్వౌద్వౌ పాదం పాదమజావికే॥౧౬౨॥ }

వ్యా ॥ మనూక్తషడ్భాగాదిగ్రహణస్య ద్రవ్యవిశేషే పవాదమాహ॥ పణానితి ॥ ఏకశఫే అశ్వాదౌ ప్రనష్టాధిగ తేరాజ్ఞైరక్షణనిమిత్తం చతురః పణాన్ దద్యాత్ -మానుషే మనుష్యజాతీయద్రవ్యే పంచపణాన్ దద్యాత్ -మహిషోష్ట్రగ వాంరక్షణనిమిత్తం ప్రత్యేకం ద్వౌద్వౌ పణౌ-అజావికే పునః ప్రత్యేకం పాదం పాదం దద్యాదితి సర్వత్ర సంబధ్యతే- అజా వికమితి సమాహారనిర్దేశేపి పాదం పాదమితి వీప్సాబలాత్ప్రత్యేకం సంబంధోవగమ్యతే॥ ఇత్యస్వామివిక్రయప్రకరణమ్॥

తా ॥ ప్రణష్టాధిగతద్రవ్యరక్షణార్థమై మనువు చెప్పిన యాఅవపాలు మొదలైనవా నికిద్రవ్యభేదమునందపవాదమును జెప్పుచున్నాఁడు ॥ గుఱ్ఱము మొదలైన యొకగిట్టగల జంతువులు పోఁగొట్టుకొనఁబడినవై రాజపురుషులచేఁ బట్టుకొనఁబడి రాజుచేత రక్షింపఁబడినపక్షమందు రాజునకు నాలుగుపణములీవలయును - మనుష్యజాతిద్రవ్యవిషయమందయిదుపణములీవలయును- ఎనుమునకు నొంటెకు నావునకు నొకొ్కకదానికి రెండేసిపణములీవలయును-గొఱ్ఱెలకు మేకలకు నొకొ్కకదానికిఁ గాలు కాలు పణమీవలయును॥౧౬౨

అశ్వాదులు తప్పించుకొని పోయిరాజకీయులకుఁ జిక్కేనేని తద్రక్షణార్థమై రాజునకీవలసిన ద్రవ్యము.

అస్వామివిక్రయప్రకరణము ముగిసెను॥ఇఁక దత్తాప్రదానికప్రకరణము.

మూ. { స్వం కుటుంబావిరోధేన దేయం దారసుతాదృతే। నాన్వ
యే సతి సర్వస్వం యచ్చాన్యస్మై ప్రతిశ్రుతమ్। ౧౬౩॥ }

అవతరణికా ॥ అధునా విహితావిహితమార్గద్వయాశ్రయత్వాద్దత్తానపాకర్మ దత్తాప్రదానికమితి చలబ్ధాభిధానద్వయం దానాఖ్యం వ్యవహారపదమభిధీయతే- తత్స్వరూపం చ నారదేనోక్తం ॥ దత్వా ద్రవ్యమసమ్యగ్యః పునరాదాతుమిచ్ఛతి। దత్తాప్రదానికం నామ వ్యవహారపదం హి తదితి- అసమ్యగవిహితమార్గాశ్రయణేన ద్రవ్యం దత్వా పునరాదాతుమిచ్ఛతి యస్మిన్వివాదపదే తద్దత్తాప్రదానిక మితి దత్తస్యాప్రదానం పునర్హరణం యస్మిన్ దానాఖ్యే తద్దత్తాప్రదానికం నామ వ్యవహారపదం - విహితమార్గాశ్రయత్వేన తత్ప్రతిపక్షభూతం తదేవ వ్యవహారపదం దత్తానపాకర్మేత్యర్థాదుక్తం భవతి - దత్తస్యానపాకర్మ అపునరాదానం యత్ర దానాఖ్యే వివాదపదే తద్దత్తానపాకర్మ - తచ్చదేయాదేయాదిభేదేన చతుర్విధం - యథాహ నారదః - అథ దేయమదేయం చ దత్తం చాదత్తమేవ చ । వ్యవహారేషు విజ్ఞేయో దానమార్గశ్చతుర్విధ ఇతి - తత్ర దేయమిత్యనిషిద్ధ దానక్రియా యోగ్యముచ్యతే - అదేయమస్వతయానిషిద్ధతయా వా దానానర్హం - యత్పునః ప్రకృతిస్థేన దత్తమవ్యావర్తనీయం తద్దత్తమిత్యుచ్యతే - అదత్తం తు యత్ప్రత్యాహరణీయం తదుచ్యతే- తదేతత్సంక్షేపతో నిరూపయితుమాహ॥ స్వం కుటుంబావిరోధేనేతి॥ స్వమాత్మీయం కుటుంబావిరోధేన కుటుంబానురోధేన- కుటుంబభరణావశిష్టమితియావత్ -తద్దద్యాత్ తద్భరణస్యావశ్యకత్వాత్ - తథా చ మనుః-వృద్ధౌ చ మాతాపితరౌ సాధ్వీ భార్యా సుతశ్శిశుః। అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మనురబ్రవీదితి-కుటుంబావిరోధేనేత్యనేన దేయమేకవిధం దర్శితం - స్వం దద్యాదిత్యనేన చాస్వభూతానామన్వాహిత యాచితకాధిసాధారణనిక్షేపాణాం పంచానామప్యదేయత్వం వ్యతిరేకతో దర్శితం-యత్పునర్నారదేనాష్టవిధత్వమదేయానాముక్తం-అన్వాహితం యాచితకమాధిస్సాధారణం చ యత్ । నిక్షేపః పుత్రదారాశ్చ సర్వస్వం చాన్వయే సతి। ఆపత్స్వపి హి కష్టాసు వర్తమానేన దేహినా। అదేయాన్యాహురాచార్యా యచ్చాన్యస్మై ప్రతిశ్రుతమితి-ఏతదదేయత్వమాత్రాభిప్రాయేణ న పునస్స్వత్వాభావాభిప్రాయేణ-పుత్రదారసర్వస్వప్రతిశ్రుతేషు స్వత్వస్య సద్భావాత్ - అన్వాహితాదీనాం చ స్వరూపం ప్రాగేవ ప్రపంచితం- స్వం దద్యాదిత్యనేన దారసుతాదేరపి స్వత్వావిశేషేణ దేయత్వప్రసంగే ప్రతిషేధమాహ -

దారసుతాదృతఇతి - దారసుతవ్యతిరిక్తమర్థందద్యాన్నదారసుతమిత్యర్థః-తథాపుత్రపౌత్రాద్యన్వయేషు విద్యమానేషు సర్వంధనంనదద్యాత్ -పుత్రానుత్పాద్యసంస్కృత్యవృత్తించైషాంప్రకల్పయేదితిస్మరణాత్ -తథాహిరణ్యాదికం యస్మై ప్రతిశ్రుతమన్యస్మైనప్రదేయం॥ ౧౭౩

అవతరణిక ॥ శాస్త్రోక్తమార్గమునవలంబించియిచ్చుటచేతదత్తానపాకర్మయనియు - శాస్త్రోక్తముగానిమార్గమునవలంబించియిచ్చుటచేతదత్తాప్రదానికమనియు రెండుపేరులుగలిగియుండు దానము నెడువ్యవహారపదమునిరూపింపఁబడుచున్నది॥ దానిస్వరూపమును నారదులుచెప్పిన రీతినీక్రిందఁదెలుపఁబడుచున్నది ॥ శాస్త్రచోదితముగానిమార్గమునవలంబించి ద్రవ్యమునిచ్చి దానిమరలరాఁబట్టుకొననిచ్ఛగలిగినపక్షమందట్లు రాఁబట్టుకొనఁదగినదానము దత్తాప్రదానికమను వ్యవహారపదమగును - శాస్త్రమందువిధింపఁబడినరీతి నీయఁబడి పూర్వముచెప్పినదానికివిరుద్ధముగానుండునదిదత్తానపాకర్మయనియర్థమువలనసిద్ధించుచున్నది-అనఁగా ఇచ్చిమరల రాఁబట్టుకోఁగూడనిదిదత్తానపాకర్మము॥ ఈదానమార్గము। దేయము-అదేయము-దత్తము-అదత్తము-అనివ్యవహారములయందు నాలుగు తెఱంగులనుండునని నారదులుచెప్పియున్నారు॥అందుదేయమనఁగా శాస్త్రమందునిషేధింపఁబడక యిచ్చుటకుఁదగినదై యుండునది- అదేయమనఁగాఁదనదికామింజేసిగాని శాస్త్రమందునిషేధింపఁబడుటచేతఁగాని యిచ్చుటకుఁదగనిది॥దత్తమనఁగాస్వభావస్థునిచేనీయఁబడిమరలఁదీసికొనఁగూడనిది।అదత్తమనఁగామరలఁదీసికొ వఁగినది॥ దీనిసంక్షేపముగా నిరూపింపను జెప్పుచున్నాఁడు ॥ తా ॥ తనదగుద్రవ్యమును కుటుంబపోషణమునకుఁ జాలిమిగిలినదాని నీవచ్చును - అట్లులయ్యెనేఁ గుటుంబభరణముమిక్కిలియావశ్యకము - వృద్ధులగుతలిదండ్రులను పతివ్రతయగుభార్యను పసివాఁడగుకొడుకును - నూరుచేయరానిపనులైనఁజేసపోషింపవలయుననిమనువుచెప్పియున్నాఁడు ॥

శాస్త్రీయదానము దత్తానపాకర్మము - అశాస్త్రీయదానము దత్తాప్రదానికము.

ఈయఁదగినదానియుతగనిదానియు వివరణము.

ఇచటఁగుటుంబపోషణావశిష్టమనుటవలనవచననిషిద్ధమైనదానిఁదప్పతక్కినదాని దానముచేయవచ్చునని తెలుపఁబడెను ; తనదానినీవలయుననుటవలనఁదనదిగాని మొదటఁగుదవయుంపఁబడినసొమ్మును- అతఁడువరియొకనికర్గిరనుంచినపక్షమందట్టిసొమ్మును- ఎరువుసొమ్మును-తాకట్టుసొమ్మును- అనేకస్వామికమైనసొమ్మును-దాఁచనుంచినసొమ్మును ఈయఁగూడదనివ్యతిరేకముచేతఁ దెలుపఁబడెను ॥ నారదులు రెండవతాకట్టుసొమ్మును - ఎరువుదీసికొన్నసొమ్మును- తాకట్టుసొమ్మును- అనేకస్వామికమగుసొమ్మును-దాచనుంచినసొమ్మును,దారపుత్రాదులను సంతతియుండఁగాసర్వస్వమును మఱియొకనికిచ్చెదనని చెప్పినద్రవ్యమును వీనినిమిక్కిలియాపత్తులువచ్చినప్పుడు గూడనీఁగూడదనియార్యులుచెప్పుచున్నదిఅదేయత్వమాత్రాభిప్రాయము చేతనే కాని స్వత్వాభావాభిప్రాయముచేతఁగాదు । కొడుకు - ఆలు - సర్వస్వము-ఒకనికిచ్చెదనన్నది।వీనియందుస్వత్వముండనేయున్నది॥ రెండవకుదవ మొదలగువానిస్వరూపముముందేవివరింపఁబడియున్నది। తనదానినీవలయుననఁగాభార్యాపుత్రులునుదనవారేగనుక నీఁదగుదుగనిసిద్ధింపఁగా వారినీఁగూడదనినిషేధించెను । ఆలాగేవంశముండఁగాసర్వస్వమీఁగూడదనియునిషేధించెను పుత్రులఁబుట్టించి వారలకుపనయనాది సంస్కారములుచేసిజీవనమునుగల్పింపవలయుననిస్మృతియున్నది ॥ బంగారము మొదలైనద్రవ్యమునొకనికిచ్చెదనన్నదాని మఱియొకనికిఁగూడదు॥ ౧౭౩

మూ॰ ప్రతిగ్రహఃప్రకాశస్స్యాత్ స్థావరస్యవిశేషతః॥౧౭౪॥

వ్యా॥ ఏవందారసుతాదివ్యతిరిక్తం దేయముక్త్వా ప్రసంగాద్దేయధనగ్రహణంచప్రతిగ్రహీత్రా ప్రకాశమేవ కర్తవ్యమిత్యాహ॥ ప్రతిగ్రహఇతి॥ ప్రతిగ్రహఃప్రతిగ్రహణంప్రకాశఃకర్తవ్యః వివాదనిరాకరణార్థం స్థావరస్య విశేషతఃప్రకాశమేవగ్రహణంకార్యంతస్యస్వర్ణాదివదాత్మనిస్థితస్యదర్శయితుమశక్యత్వాత్ ॥ ౧౭౪

తా ॥ ఇట్టులీఁదగినదానిఁజెప్పిప్రసంగసంగతివలననీఁదగినద్రవ్యమునైననుపుచ్చుకొనువాఁడుబహిరంగముగఁ

ప్రతిగ్రహించుటబహిరంగముగానుండవలయు.

బుచ్చుకొనవలయునని చెప్పుచున్నాఁడు॥ తరువాతవివాదమురాకుండుటకై పుచ్చికోలు బహిరంగముగా జరిగింపవలయును । అందునుభూమినిఁబుచ్చుకొనుటమిక్కిలిబహిరంగముగా నుండవలయును సువర్ణాదులవలెభూమినిఁబుచ్చుకొన్నవాఁడెత్తుకొనిపోయి తనయొద్దనుంచుకొనితనదనిచూపశక్యముగాదుగనుకనని తెలియవలయు॥ ౧.౭౩౫

మూ. దేయంప్రతిశ్రుతంచైవదత్వానాపహరేత్పునః॥౧౭౮॥

వ్యా ॥ ఏవఃప్రాసంగికముక్త్వాప్రకృతమనుసరన్నాహ॥ దేయమితి ॥ యద్యస్మైధర్మార్థంప్రతిశ్రుతంతత్తస్మైదేయమేవయద్యసౌధర్మాత్ప్రచ్యుతోనభవతిప్రచ్యుతేపునర్నదాతవ్యం- ప్రతిశ్రుత్యాప్యధర్మసంయుక్తాయనదద్యాదితిగౌతమస్మరణాత్ -దత్వానాపహరేత్పునః న్యాయమార్గేణయద్దత్తంతత్సప్తవిధమపిపునర్నాపహర్తవ్యం। కింతుతత్రైవానుమంతవ్యం యత్పునరన్యాయేనదత్తంతదదత్తంషోడశప్రకారమపిపునఃప్రత్యాహర్తవ్యమేవేత్యర్థాదుక్తంభవతి నారదేనచ దత్తంసప్తవిధంప్రోక్తమదత్తంషోడశాత్మకమితి ప్రతిపాద్య దత్తాదత్తయోస్స్వరూపంవివృతం। పణ్యమూల్యంభృతిస్తుష్ట్యాస్నేహాత్ప్రత్యుపకారతః। స్త్రీశుల్కానుగ్రహార్థంచదత్తందానవిదోవిదుః।అదత్తంతుభయక్రోధశోకావేశరుజాన్వితైః। తథోత్కోచపరీహాసవ్యత్యాసచ్ఛలయోగతః। బాలమూఢాస్వతంత్రార్తమత్తోన్మత్తాపవర్జితం।కర్తామమేదంకర్మేతిప్రతిలాభేచ్ఛయాచయత్। అపాత్రేపాత్రమిత్యుక్తేకార్యేచాధర్మసంహితే। యద్దత్తంస్యాదవిజ్ఞానాదదత్తమితితత్స్మృతమితి। అయమర్థః। పణ్యస్యక్రీతద్రవ్యస్యయన్మూల్యందత్తం।భృతిర్వేతనంకృతకర్మణేదత్తం।తుష్ట్యావందిచారణాదిభ్యోదత్తం। స్నేహాద్దుహితృపుత్రాదిభ్యోదత్తం। ప్రత్యుపకారత ఉపకృతవతేప్రత్యుపకారరూపేణదత్తం। స్త్రీశుల్కంపరిణయార్థంకన్యాజ్ఞాతిభ్యోదత్తం। యచ్చానుగ్రహార్థమదృష్టార్థందత్తం।తదేతత్సప్తవిధమపిదత్తమేవనప్రత్యాహరణీయం।భయేనబందీగ్రాహాదిభ్యోదత్తం । క్రోధేనపుత్రవైరనిర్యాతనాయాన్యస్మైదత్తం। శోకావేశేనపుత్రవియోగాదినిమిత్తశోకావేశేనదత్తం । ఉత్కోచేనకార్యప్రతిబంధనిరాసార్థమధికృతేభ్యోదత్తం। పరిహాసేనోపహాసేనదత్తం। దానవ్యత్యాసఃఏకోపిస్వద్రవ్యమన్యస్మైదదాత్యన్యోపితస్మైదదాతిసదానవ్యత్యాసః। ఛలయోగతశ్శతదానమభిసంధాయసహస్రమితిపరిభాష్యదదాతిసఛలయోగః। బాలేనాప్రాప్తషోడశవర్షేణ। మూఢేనలోకవేదానభిజ్ఞేన। అస్వతంత్రేణపుత్రదాసాదినా। ఆర్తేనరోగాభిభూతేన।మత్తేనమదనీయద్రవ్యప్రమత్తేన। ఉన్మత్తేనవాతికాద్యున్మాదగ్రస్తేనవాఅపవర్జితందత్తం। తథాయంమదీయమిదంకర్మకరిష్యతీతిప్రతిలాభేచ్ఛయాదత్తం। అచతుర్వేదాయచతుర్వేదోహమిత్యుక్తవతేదత్తం। కార్యేచాధర్మసంహితేయజ్ఞంకరిష్యామీతిధనంలబ్ధ్వాద్యూతాదౌవినియుంజానాయయద్దత్తమిత్యేవం షోడశప్రకారమపిదత్తమదత్తమిత్యుచ్యతే ప్రత్యాహరణీయత్వాత్ । అత్రదత్తస్యాదత్తత్వంధర్మకార్యవ్యతిరిక్తవిషయం । స్వస్థేనార్తేనవాదత్తంశ్రావితంధర్మకారణాత్ । అదత్వాతుమృతేదాప్యస్తత్పుత్రోనాత్రసంశయ ఇతికాత్యాయనస్మరణాత్ । తథేదమపరంసంక్షిప్తార్థంవచనంసర్వవివాదసాధారణం। యోగాధమనవిక్రీతంయోగదానప్రతిగ్రహం। యస్యవాప్యుపధింపశ్యేత్తత్సర్వంవినివర్తయేదితి। యోగఉపాధిః- యోగేనాగామినోపాధివిశేషేణాధివిక్రయదానప్రతిగ్రహాఃకృతాస్తదుపాధిలింగమేతాన్విక్రయాదీన్వినివర్తయేదిత్యస్యార్థః। యఃపునష్షోడశప్రకారమప్యదత్తంప్రతిగృహ్ణాతియశ్చాదేయంప్రయచ్ఛతితయోర్దండో నారదేనోక్తః। గృహ్ణాత్యదత్తంయోలోభాద్యశ్చాదేయంప్రయచ్ఛతి।అదేయదాయకోదండ్యస్తథాఽదత్తప్రతీచ్ఛకఇతి॥ ఇతిదత్తాప్రదానికప్రకరణమ్। ౧౭౮

తా ॥ ఇట్లుప్రస్తావముమీఁదవచ్చినవిషయమునుజెప్పిమఱలప్రకృతవిషయమునను సరించిచెప్పుచున్నాఁడు ॥ ఒకనికిధర్మముకొఱకిచ్చెదనన్నదానినతఁడుధర్మమునుదప్పకయుండెనేని అతనికీయవలయును- వాఁడుధర్మముదప్పినపక్షమందీయఁబనిలేదు । అట్లుగౌతమసూత్రమందుఁజెప్పఁబడియున్నది ॥ న్యాయమార్గముననీఁబడినదాని నేడుతెఱఁగులదానినిమరలఁదీసి

ఇచ్చెదనన్నదానిఁబుచ్చుకొనువాఁడుధర్మమునుదొ

లేకుండ నేనియీవలయు న్యాయముగానిచ్చినదాని మరలఁదీసికోఁగూడదు.

కొనఁగూడదు- అట్లే యొప్పికొనవలయును- అట్లు చెప్పుటచేత అన్యాయముగానీయఁబడినదానిఁబదియారువిధములదానినిమరలఁదీసికొనవచ్చునని చెప్పఁబడినట్లగుచున్నది ॥ నారదులు-దత్తమెనిమిదివిధములుగలదనియు- అదత్తముపదియారు విధములుగలదనియుఁ జెప్పి వానిస్వరూపమునువివరించియున్నారుగనుక నాప్రకారమే యీక్రిందఁదెలుపఁబడుచున్నవి॥

న్యాయదత్తమెనిమిదివిధంబులనుండును.

కొన్నవస్తువునకిచ్చినవెలయును- పనిచేసినవానికిచ్చినజీతమును- స్తుతిపాఠకులుగాయకులు మొదలగువారికి సంతోషపడియిచ్చినదియు - ప్రీతివలనఁగూఁతురుకొడుకు మొదలగు వారికిచ్చినదియు - తనకొకయుపకారముచేసినవానికిఁబ్రత్యుపకారరూపముగానిచ్చినదియు- పెండ్లియాడనపుడుకన్యకయొక్క తలిదండ్రులు మొదలగువారికిచ్చినదియు - దైవానుగ్రహముగోరిదానముగానిచ్చినదియు - ఈయెనిమిదిదత్తములనఁబడును- దీనిమరలఁదీసికొనఁగూడదు భయముచేతబందిగ్రాహాదులకిచ్చినదియు కొడుకుమీఁదఁగోపముపుట్టియాకోపముదీరను దనద్రవ్యమును మఱియొకనికిచ్చినదియును పుత్రాదివియోగమువలనదుఃఖముచేతఁబరవశుఁడైయిచ్చినదియు - తనకార్యమునకువిఘ్నముచేయకయుండుటకై యుద్యోగస్థులకిచ్చినదియు - పరియాచకమునకిచ్చినదియు-ఒకనిద్రవ్యమునొకఁడు దనకీయగానతనికిఁ దానొకద్రవ్యమునిచ్చినదియును నూరిచ్చుచో వేయియనిచ అటియునిట్లొకలెక్కకుమఱియొకలెక్క చెప్పియిచ్చిననదియు-పదియారుసంవత్సరములకులోఁబడినవయస్సుగలవాఁడిచ్చినదియు- లోకమును శాస్త్రము నెఱుఁగనిమూర్ఖుఁడిచ్చినదియు- బంటు మొదలగుస్వాతంత్ర్యము లేనివాఁడిచ్చినదియు-రోగము చేత బాధపడుచుండువాఁడిచ్చినదియు-మయకముగలుగఁజేయువస్తువులఁదినిమయకములోనుండువాఁడిచ్చినదియు- వాతపిత్తాదిదోషములవలనమనస్స్వస్థతలేనివాఁడిచ్చినదియు తనకొక కార్యముచేయుమని ప్రతిలాభమునుగోరియిచ్చినదియు నాలుగువేదములు చదువక చదివితినని యొకఁడు చెప్పినప్పుడు వాఁడట్లు నాలుగు వేదములు చదివియున్నాఁడుగనుకనిచ్చెదనని తలంపుచేతనిచ్చినదియును-ఒకఁడు ధర్మము చేసెదనని తనదగ్గిరద్రవ్యమడిగితీసికొనిపిమ్మట నాద్రవ్యమునధర్మమునకు నియోగము చేయుచున్నట్టివానికిచ్చినద్రవ్యమును - ఇట్లీపదియారు తెఱంగులనిచ్చినదియు మరలఁదీసికొనందగినదిగనుక అదత్తమనఁబడును- రోగముచేబాధపడుచుండువాఁడిచ్చినదిధర్మకార్యవిషయముకానిదేఅదత్తమగును గాని ధర్మకార్యవిషయమైనదియదత్తముకాదు। స్వస్థుఁడుగానున్నను రోగిగానున్నను ధర్మకారణమువలననిచ్చెదనని చెప్పినద్రవ్యమునీయక వాఁడుమరణమునొందినను వానికొడుకాద్రవ్యము నీవలయునని కాత్యాయనస్మృతియందున్నది ॥ ఇదియును గాక సర్వవ్యవహారసాధారణమయి సంక్షేపింపఁబడినయర్థముగలయీవచనమొకటియున్నది- మీఁదరాఁబోవునుపాధినాలోచించిదానికొఱకై చేసిన- కుదవ-

అన్యాయదత్తముపదియారువిధములనుండును - అది మరలింపఁదగును గనుకన దత్తమనంబడును

అమ్మకము- ఈవి- పుచ్చికోలు- వీనినాయుపాధిగుఱుకుమరలించును ॥ ఈ చెప్పఁబడిన పదియారువిధములయదత్తమునుగ్రహించినవానికిని- అదేయమునిచ్చినవానికిని దండనముగలుగును- అట్లు నారదులచే జెప్పఁబడియున్నది ॥ ౧౭౪ ॥ దత్తాప్రదానికప్రకరణముముగిసెను॥

అన్యాయదత్తమును బుచ్చుకొన్నవాఁడునుఅదేయమునిచ్చినవాఁడునుదండార్హులగుదురు.

## క్రీతానుశయప్రకరణము,

మూ. { దశైకపంచసప్తాహమాసత్ర్యహార్ధమాసకమ్।బీజా యోవాహ్యరత్నస్త్రీదోహ్యపుంసాంపరీక్షణం॥౧౭౫ }

వ్యా ॥ ఇదానీంక్రీతానుశయఃకథ్యతే- తత్స్వరూపంచ నారదేనోక్తం ॥ క్రీత్వామూల్యేనయత్పణ్యం క్రేతానబహుమన్యతే । క్రీతానుశయ ఇత్యేతద్వివాదపదముచ్యతఇతి - తత్ర యస్మిన్నహనిపణ్యం క్రీతం తస్మిన్నేవాహనితదవి

కృతం ప్రత్యర్పణీయమితి తేనైవోక్తం- క్రీత్వా మూల్యేన యత్పణ్యం దుష్క్రీతం మన్యతే క్రయీ। విక్రేతుః ప్రతిదేయం తత్తస్మిన్నేవాహ్న్యవీక్షితమితి-ద్వితీయాదిదినే తు ప్రత్యర్పణవిశేషస్తేనైవోక్తః- ద్వితీయేహ్ని దదత్క్రేతా మూల్యాత్త్రింశాంశమావహేత్। ద్విగుణం తు తృతీయేహ్ని పరతః క్రేతురేవ తదితి-పరతోనుశయో న కర్తవ్య ఇత్యర్థః- ఏతచ్చ బీజవ్యతిరిక్తోపభోగవినశ్వరవస్తువిషయం- బీజాదిక్రయే పునరన్య ఏవ ప్రత్యర్పణావధిరిత్యాహ ॥ దశేతి॥ బీజం వ్రీహ్యాదిబీజం-అయో లోహం- వాహ్యో బలీవర్దాదిః-రత్నం ముక్తాప్రవాళాది- స్త్రీ దాసీ- దోహ్యం మహిష్యాది- పుమాన్ దాసః- ఏషాం బీజాదీనాం యథాక్రమేణ దశాహాదికః పరీక్షాకాలో విజ్ఞేయః- పరీక్ష్యమాణే చ బీజాదౌ యద్యసమ్యక్త్వబుద్ధ్యానుశయో భవతి- తదా దశాహాభ్యంతర ఏవ క్రయనివృత్తిః-న పునరూర్ధ్వమిత్యుపదేశప్రయోజనం - యత్తు మనువచనం- క్రీత్వా విక్రీయ వా కించిద్యస్యేహానుశయో భవేత్। సోంతర్దశాహాత్తద్ద్రవ్యం దద్యాచ్చైవాదదీత చేతి- తదుక్తలోహాదివ్యతిరిక్తోపభోగావినశ్వరగృహక్షేత్రయానశయనాసనాదివిషయం। సర్వం చైతదపరీక్షితక్రీతవిషయం। యత్పునః పరీక్షితం న పునః ప్రత్యర్పణీయమితి సమయం కృత్వా క్రీతం తద్విక్రేత్రే న ప్రత్యర్పణీయం-తదుక్తం। క్రేతా పణ్యం పరీక్షేత ప్రాక్స్వయం గుణదోషతః। పరీక్ష్యాభిమతం క్రీతం విక్రేతుర్న భవేత్పునరితి॥ ౧౭౫

అవతరణిక ॥ ఇక క్రీతానుశయము చెప్పఁబడుచున్నది॥ వెలయిచ్చి యొకవస్తువును గొన్నవాఁడు పిమ్మట నావస్తువు మంచిది కాదని యెంచిన నది క్రీతానుశయమనెడు వ్యవహారపదమని చెప్పఁబడునని దాని స్వరూపము నారదులచే వివరింపఁబడియున్నది॥ ఆవిషయమైయే దినము కొనఁబడిన వస్తువు నాదినముననే వికృతిఁజెందకుండ విక్రయించిన వానికి మరలనిచ్చి తానిచ్చిన క్రయము నుదీసుకొనవలయుననియు మరుసటిదినమున నిచ్చినపక్షమందు దానిచ్చిన వెలలో ముప్పదవపాలు తగ్గించి తీసుకొనవలయుననియు। మూడవదినమున నిచ్చినపక్షమందు పదునేనవపాలు తగ్గించి మిగిలిన క్రయమును దీసికొనవలయుననియు। పిమ్మట నావస్తువును మరలనీయనేకూడదనియు నారదులు చెప్పియున్నారు। ఈచెప్పినదంతయు విత్తనమునకంటె నితరములగు నుపభోగముచే తనశించువస్తువుల విషయము గనుక విత్తము మొదలగు వానికొనుగోలు విషయమైన మరల నిచ్చుటకు గడువులు వేరే చెప్పఁబడుచున్నవి॥ తా॥ విత్తనమునకుఁ బదిదినములును- ఇనుమునకొక దినమును-బరువు మోయు నట్టియెద్దు మొదలగు వానికయిదు నాళ్లును- ముత్యములు పవడములు మొదలగు రత్నములకు నేడు నాళ్లును। దాసికలకొక నెల యుపాలుపితుకు బఱ్ఱె మొదలగు వానికి మూఁడు నాళ్లును। పనివానికొక నెలయుఁ బరీక్షింపఁగాలముగా నుండును గనుకఁ బరీక్షించినంతట మంచిది కాదని తోఁచినపక్షమందు చెప్పిన గడువులతిక్రమింపకముందే మరల నొప్పగించిన నాకొనుగోలు మారిపోవును పిమ్మట మారదు-మనువు కొనినపిమ్మటఁగాని అమ్మినపిమ్మటఁగాని ఆకొనుగోలుగాని అమ్మకముగాని సమ్మతి లేనివాఁడు పదిదినములలోపల దాని మరలింపవచ్చునని చెప్పినది। ఇచటఁ జెప్పఁబడిన ఇనుము మొదలగు వానికంటె నితరములైన అనుభవముచే తనశించని ఇల్లు భూమి వాహనములు మంచము పీఠము మొదలగు వానివిషయమని తెలియఁదగినది। ఈచెప్పినదంతయుఁ బరీక్షింపక గొనినవిషయము- పరీక్షించి మరలనిచ్చుట లేదనిని ష్కర్ష చేసికొని కొన్న వస్తువును అమ్మినవానికి మరలనీయనేకూడదు అట్లు స్మృతివచనమున్నది॥ ౧౭౫

మూ॰ { అగ్నౌ సువర్ణమక్షీణం రజతే ద్విపలం శతే। అష్టౌ
త్రపుణి సీసే చ తామ్రే పంచదశాయసి॥ ౧౭౬॥ }

వ్యా ॥ దోష్యాద్యపరీక్షాప్రసంగేన సువర్ణాదేరపి పరీక్షణమాహ॥ అగ్నావితి॥ అగ్నౌ ప్రతాప్యమానం సువర్ణం న క్షీయతే తతః కటకాదినిర్మాణార్థం యావత్సువర్ణం కారహస్తే ప్రక్షిప్తం తావత్తులయిత్వా తైః ప్రత్యర్పణీయమితరథా క్షయం దాప్యో దండ్యశ్చ। రజతే తు పలశతే ప్రతాప్యమానే పలద్వయం క్షీయతే। అష్టౌ త్రపుణి సీసే చ శత ఇత్యనువర్తతే। త్రపుణి సీసే చ పలశతే ప్రతాప్యమానేఽష్టౌ పలాని క్షీయంతే। తామ్రే పంచదశాయసి। తామ్రే శతే పంచపలా

స్యయసీదశపలానిక్షీయంతే- అత్రాపిశతఇత్యేవ- కాంస్యస్యతుత్రపుతామ్రయోనిత్వాత్తదనుసారేణక్షయఃకల్ప్యః- అతోధికక్షయకారిణశ్శిల్పినోదండ్యాః॥ ౧౭౬

తా॥ పాలుపిలుకుబట్టి మొదలగు వానిపరీక్షను జెప్పినప్రసంగముచేతబంగారము మొదలగువానిఁబరీక్షించుక్రమమును జెప్పుచున్నాఁడు॥ మంచిబంగారమగ్నియందుఁబుటము వేసిన నెత్తుతగ్గదు గనుక కడియము మొదలగువాని జేయనగసాలవానిచేతనిచ్చినబంగారు నెత్తునకెత్తుసరిగా వాఁడొప్పగింపవలయును-తగ్గిన నాతకు వనతనిచేనిప్పించి యతనిదండింపవలయును-వెండి నూరుపలములు కాఁకలోఁబెట్టినప్పుడు రెండుపలములుతగ్గును - సీసమందునుతగరమందును నూటికెనిమిది లెక్కనుతగ్గును-రాగి- నూటికయిదు లెక్కను- ఇనుము- నూటికిఁబది లెక్కనుతగ్గును - కంచు- రాగితగరములవలనఁగలుగునదిగావునతదనుసారముగాదానితరుగునూహింపవలయును- ఇంతకంటెనధికముతగ్గించినశిల్పులనుదండింపవలయును॥ ౧౭౬

బంగారుపుటము వేసిన నెత్తుతగ్గదు-వెండి మొదలగు నవితగ్గును-వానితరుగులవివరణము.

మూ. { శతేదశపలా వృద్ధిరౌర్ణేకార్పాససూత్రకే। మధ్యే పంచపలావృద్ధిస్సూక్ష్మేతుత్రిపలామతా॥ ౧౭౭ ॥ }

వ్యా॥క్వచిత్కంబళాదౌవృద్ధిమాహ॥ శతఇతి॥స్థూలేనౌర్ణసూత్రేణయత్కంబళాదిక్రియతేతస్మింఛ్ఛతపలేదశపలావృద్ధిర్వేదితవ్యా-ఏవంకార్పాసేస్థూలసూత్రనిర్మితేపటాదౌవేదితవ్యం - మధ్యేఅనతిసూక్ష్మసూత్రనిర్మితేపటాదౌపంచపలావృద్ధిః సుసూక్ష్మసూత్రరచితేశతేత్రిపలావృద్ధిర్బోద్ధవ్యా-ఏతచ్చాప్రక్షాళితవాసోవిషయం॥ ౧౭౭

తా॥ లావైనమృగరోమములపురితోకంబళాదులనేయునపుడు నూరుపలములు నేసిననూటపదిపలములకంబళియగును - ఇట్లేప్రత్తినూలి ముదుకవస్త్రములయందును వృద్ధిగలుగునని యెఱుఁగవలయును- అంతముదకగాకయంతసన్నముగాకయుండునడిమితరమునూలిచేత నేయఁబడినవస్త్రమునందయిదుపలములును సన్నపునూలిచేతనేసినవస్త్రమునందు మూఁడుపలములునువృద్ధిగలుగునని యెఱుఁగవలయును- ఈచెప్పినదియుదుకనివస్త్రముల విషయము.

కంబళ వస్త్రాదుల నేతయందుఁగలుగువృద్ధినిర్ణయము.

మూ. { కార్మికేరోమబంధేచత్రింశద్భాగఃక్షయోమతః। నక్షయోనచవృద్ధిశ్చకౌశేయేవల్కలేతథా॥ ౧౭౮ ॥ }

వ్యా॥ ద్రవ్యాంతరేవిశేషమాహ॥ కార్మికఇతి॥కార్మికంకర్మణాచిత్రేణనిర్మితం-యత్తునిష్పన్నేపటేచక్రస్వస్తికాదికంచిత్రసూత్రైఃక్రియతేతత్కార్మికమిత్యుచ్యతే - యత్రప్రావారాదౌరోమాణిబధ్యంతేసరోమబంధః - తత్రత్రింశత్తమోభాగఃక్షయోవేదితవ్యః-కౌశేయేకోశప్రభవేవల్కలేవృక్షత్వఙ్నిర్మితేవసనేవృద్ధిహ్రాసౌనస్తః-కింతుయావద్వ్యయనార్థంకువిందాదిభ్యోదత్తంతావదేవప్రత్యాదేయం॥ ౧౭౮

తా॥ ద్రవ్యాంతరమునవిశేషమును జెప్పుచున్నాఁడు॥ నేసినవస్త్రమందుఁజిత్రవర్ణములగునూత్రములచేతఁజక్రముస్వస్తికము మొదలగువానిని జేసినను- వస్త్రము మొదలగువానియందు మేలిమిమృగరోమములనుగుట్టినను ముప్పదవపాలుతగ్గును- పట్టును నారచీరలును బెరుగను బెరుగవుతఱుగను దఱుగవు- ఈచెప్పినవానిలోఁదఱుగునవితఱుగపోనుగడచుయుండఱుగు లేనివి మొదటఁదూచినయెత్తునకు సరిగాను నాయాపనివాండ్రవలనఁదీసుకోఁదగినవని తాత్పర్యము॥ ౧౭౮

సిద్ధమైనవస్త్రమందు వర్ణపునూలిచేఁజిత్రమేర్పఱచినముప్పదవపాలు తగ్గునుపట్టునకును నారచీరకునువృద్ధిక్షయములు లేవు.

మూ. { దేశంకాలంచభోగంచజ్ఞాత్వానష్టేబలాబలమ్ । ద్రవ్యాణాంకుశలాబ్రూయుర్యత్తద్దాప్యమసంశయం ॥ }

వ్యా॥ ద్రవ్యాణామానంత్యాత్ప్రతిద్రవ్యంక్షయవృద్ధిప్రతిపాదనస్యాశక్యత్వాత్సామాన్యేనహ్రాసవృద్ధిజ్ఞా

నోపాయమాహ దేశమితి॥ శాణతాపాదౌ ద్రవ్యే నష్టే ప్రాప్తే సముపాగతే ద్రవ్యాణాం కుశలాః ద్రవ్యవృద్ధిక్షయాభిజ్ఞాః. దేశం కాలముపభోగం తథా నష్టద్రవ్యస్య బలాబలం సారాసారతాం చ పరీక్ష్య యత్కల్పయంతి తదసంశయం శిల్పినో దాప్యాః॥ ౧౭౯॥ ఇతి క్రీతానుశయప్రకరణం॥

తా॥ ద్రవ్యములనంతములగుటవలనఁ బ్రతిద్రవ్యమునకు క్షయవృద్ధులను దెలుపుట యశక్యము కాఁబట్టి సాధారణముగా వృద్ధిక్షయములను దెలియు నుపాయమును జెప్పుచున్నాఁడు॥ సానఁబట్టుట మొదలగుపనులు సేయ శిల్పులయొద్ద నిచ్చిన మణులు మొదలగువానియందు శాణోత్కర్షణాదులచేత కొంతనష్టము సంభవించెనా యపుడు ద్రవ్యముల వృద్ధిక్షయములయనుభవము గలవారు దేశమును కాలమును నుపభోగమును దెలిసి యాద్రవ్యముయొక్క సారాసారములను బరీక్షించి యెంతతఱుగునని నిర్ణయింతురో యంతఱుగుగాక మిగిలిననష్టమును శిల్పులు ద్రవ్యస్వామికిఁ గట్టియీవలయును॥ క్రీతానుశయప్రకరణము ముగిసెను॥

అన్ని ద్రవ్యములయందును వానియనుభవముగలవారాలోచించి చెప్పినట్లి వృద్ధిక్షయములు గ్రాహ్యంబులగును

## అభ్యుపేత్యాశుశ్రూషాఖ్యప్రకరము.

వ్యా॥ సాంప్రతమభ్యుపేత్యాశుశ్రూషాఖ్యమపరం వివాదపదమభిధాతుముపక్రమతే-తత్స్వరూపం నారదేనోక్తం-అభ్యుపేత్య తు శుశ్రూషాం యస్తాం న ప్రతిపద్యతే। అశుశ్రూషాభ్యుపేత్యైతద్వివాదపదముచ్యత ఇతి-ఆజ్ఞాకరణం శుశ్రూషా తామంగీకృత్య పశ్చాద్యస్తన్న సంపాదయతి-తద్వివాదపదమభ్యుపేత్యాశుశ్రూషాఖ్యం-శుశ్రూషకశ్చ పంచప్రకారః శిష్యాంతేవాసిభృతకాధికర్మకృద్దాసా ఇతి॥ తేషామాద్యాశ్చత్వారః కర్మకరా ఇత్యుచ్యంతే-తే చ శుభకర్మకారిణః-దాసాః పునర్గృహజాతాదయః పంచదశప్రకారాః। గృహద్వారాశుచిస్థానరథ్యావస్కరశోధనాద్యశుభకర్మకారిణః। తదిదం నారదేన స్పష్టీకృతం శుశ్రూషకః పంచవిధశ్శాస్త్రే దృష్టో మనీషిభిః। చతుర్విధః కర్మకరస్తేషాం దాసాస్త్రిపంచకాః। శిష్యాంతేవాసిభృతకాశ్చతుర్థస్త్వధికర్మకృత్। ఏతే కర్మకరా జ్ఞేయా దాసాస్తు గృహజాదయః. సామాన్యమస్వతంత్రత్వమేషామాహుర్మనీషిణః॥ జాతికర్మకృతస్తూక్తో విశేషో వృత్తిరేవ చ। కర్మాపి ద్వివిధం జ్ఞేయమశుభం శుభమేవ చ। అశుభం దాసకర్మోక్తం శుభం కర్మకృతాం స్మృతం। గృహద్వారాశుచిస్థానరథ్యావస్కరశోధనం। గుహ్యాంగస్పర్శనోచ్ఛిష్టవిణ్మూత్రగ్రహణోజ్ఝనం। ఇచ్ఛతస్స్వామినశ్చాంగైరుపస్థానమథాంతతః॥ అశుభం కర్మ విజ్ఞేయం శుభమన్యదతః పరమితి-తత్ర శిష్యో వేదవిద్యార్థీ- అంతేవాసీ శిల్పశిక్షార్థీ-మూల్యేన యః కర్మ కరోతి స భృతకః- కర్మకుర్వతామధిష్ఠాతాధికర్మకృత్-అశుచిస్థానముచ్ఛిష్టాదిప్రక్షేపణార్థం గర్తాదికం - అవస్కరో గృహమార్జితపాంస్వాదినిచయస్థానం- ఉజ్ఝనం త్యాగః- భృతకశ్చాత్ర త్రివిధః-తదుక్తం-ఉత్తమస్త్వాయుధీయోఽత్ర మధ్యమస్తు కృషీవలః॥ అధమో భారవాహీ స్యాదిత్యేవం త్రివిధో భృతక ఇతి- దాసాః పునః- గృహజాతస్తథా క్రీతో లబ్ధో దాయాదుపాగతః॥ అనాకాలభృతస్తద్వదాహితస్స్వామినా చ యః॥ మోక్షితో మహతశ్చర్ణాద్యుద్ధప్రాప్తః పణేజితః॥ తవాహమిత్యుపగతః ప్రవ్రజ్యావసితః కృతః। భక్తదాసశ్చ విజ్ఞేయస్తథైవ బడబాహృతః। విక్రేతా చాత్మనశ్శాస్త్రే దాసాః పంచదశ స్మృతాః॥ గృహే దాస్యాం జాతో గృహజాతః- క్రీతో మూల్యేన- లబ్ధః ప్రతిగ్రహాదినా-దాయాదుపాగతః పిత్రాదిదాసః- అనాకాలభృతో దుర్భిక్షే యో దాసత్వాయ మరణాద్రక్షితః- ఆహితస్స్వామినా ధనగ్రహణేనాధితాం నీతః-ఋణమోచనేన దాసత్వమభ్యుపగత ఋణదాసః- యుద్ధప్రాప్తస్సమరే విజిత్య గృహీతః యద్యస్మిన్పణే దేవదత్తేన జితోఽహం తదా తవ దాసో భవామీతి పరిభాష్య యో జితస్స పణే జితః- తవాహమిత్యుపగతస్తవాహం దాస ఇతి స్వయం ప్రతిపన్నః-ప్రవ్రజ్యాయాశ్చ్యుతః ప్రవ్రజ్యావసితః-ఏతావంతం కాలం త్వద్దాస ఇత్యభ్యుపగతః- భక్తదాసస్సర్వకాలం భక్తార్థమేవ దాసత్వమభ్యుపగమ్య యః ప్రవిష్టః - బడబాహృతః బడబా గృహదాసీ తయాహృతస్తల్లోభేన తాముద్వాహ్య దాసత్వేన ప్రవిష్టః- య ఆత్మానం విక్రీణీతే స ఆత్మవిక్రేతా-ఏవం పంచదశప్రకారాః-యత్తు మనునా ధ్వజాహృతో భక్తదాసో గృహజః క్రీతదత్త్రిమౌ। పైతృకో దండదాసశ్చ సప్తైతే దాసయోనయ ఇతి-సప్తవిధత్వముక్తం - తదేషాం దాసత్వప్రతిపాదనార్థం న తు పరిసంఖ్యార్థం. - తత్ర శిష్యాంతేవాసిభృతకాధికర్మకృద్దాసానాం

ధ్యేశిష్యస్యవృత్తిః పా ౨ గేవప్రతిపాదితా-ఆహూతశ్చాప్యధీయీతలబ్ధంచాస్మైనివేదయేదిత్యాదినా- అధికర్మకృద్భృతకాదీనాంతు వేతనాదానప్రకరణేవక్ష్యతే- గృహీతవేతనః కర్మత్యజన్ ద్విగుణం దద్యాత్ అకృతే వేతనం నైవ దద్యాదిత్యాదినా- దాసాంతేవాసినోస్తుధర్మవిశేషంవక్తుమాహ॥

అవతరణిక ॥ ఇప్పుడొప్పికొనిపరిచర్యచేయకపోవుటయను మఱియొకవ్యవహారపదమును జెప్ప నారంభించుచున్నాఁడు॥ దానిస్వరూపమునారదులు చెప్పినరీతినిచ్చటఁదెలుపఁబడుచున్నది - ఎవఁడైననుపరిచర్యచేయనొప్పుకొని దానిఁజేయనివాఁడయ్యేనేని అదియభ్యుపేత్యాశుశ్రూషాఖ్యవ్యవహారపదమనంబడును ॥ పరిచర్యచేయువాఁడయిదువిధములనుండును

పనులుసేయనొప్పికొనిచేయనివానివిషయము.

పరిచారకులైదువిధములవారు.

అంతశిష్యుఁడు- అంతేవాసి భృతకుఁడు అధికర్మకృత్తు- ఈనలుగురుకర్మకరులనిచెప్పఁబడుదురు-వీరుమంచిపనులుసేయువారు-శిష్యుఁడనఁగా వేదవిద్యార్థి - అంతేవాసియనఁగాశిల్పవిద్యార్థి - కూలిదీసుకొనిపనిచేయువాఁడుభృతకుఁడు - పనులుసేయువారిపైవిచారణసేయువాఁడధికర్మకృత్తు। ఐదవవాఁడుదాసుఁడు- వీరందఱుతమతమజాతికిఁదగినకర్మములఁజేయుదురు-యజమానునిం దాజ్ఞచొప్పుననడుచుకొనవలయుననుటయందఱకునుసమానము॥

దాసుఁడు చేయఁదగినపనులు.

అందుదాసుఁడుచేయఁదగినహీనకర్మములు - ఇల్లు-వాకిలి- ఎంగిలిమొదలగునపరిశుద్ధములవేయుగుంటమొదలగునది- వీధి - పెంటపోయుచోటు-వీనినెల్లనూడ్చుట-గుహ్యములైనయంగములస్పృశించుట-ఎంగిలిపురీషమూత్రము-వీనినెత్తివేయుట-తనప్రభువుకోరినప్పుడతనికిఁదనయవయవములచేతనుపచారములుచేయుట- ఇవిహీనకృత్యములు-ఇవితప్పతక్కినవిమంచిపనులు॥ పూర్వముచెప్పినవారిలోభృతకుఁడుమూఁడువిధములనుండును- అంచుఆయుధములనుబట్టి యుద్ధముచేయువాఁడుత్తముఁడు - భూమినిదున్నిపైరుపెట్టువాఁడుమధ్యముఁడు-బరువుమోయువాఁడధముఁడు ॥

దాసులుపదియైదువిధములనుందురు.

దాసులుపదియైదువిధములనుందురు - తనయింటనొకదాసియందుఁబుట్టినవాఁడు ౧. వెలయిచ్చికొనఁబడినవాఁడు ౨. ప్రతిగ్రహాదులచేతఁబొందఁబడినవాఁడు ౩. తండ్రికిదాసుఁడుగానుండి తనపాలికివచ్చినవాఁడు ౪. కఱవునందుదాసుఁడగుటకై చావువలనరక్షింపఁబడినవాఁడు ౫ ద్రవ్యమప్పిచ్చుటంజేసియాదాసుని పూర్వస్వామిచేతఁగుదవగాఁబెట్టఁబడినవాఁడు ౬. ఋణగ్రస్తుఁడైయున్నవానినాఋణమునుండితొలగించి తనకుదాసుఁడుగాఁజేసికొన్నట్టివాఁడు ౭. యుద్ధమందుజయించితీసికొనిరాఁబడినవాఁడు ౮. ఈవివాదమందునేనోడిన నీకుదాసుఁడనగుదుననిపందెమాడియోడినవాఁడు ౯. నీకునేనుదాసుఁడనుగానుండెదననితనంతటవచ్చినవాఁడు ౧౦. ప్రవ్రజ్యవలనభ్రష్టుఁడైనవాఁడు ౧౧. ఇన్నాళ్లవఱకునీకుదాసుఁడనైయుండెదననివచ్చినవాఁడు ౧౨. అన్నముకొఱకునెల్లకాలముదాసుఁడుగానుండెదననివచ్చిచేరినవాఁడు ౧౩. తనయింటనుండుదాసినిఁబెండ్లిచేసికొనిదాసుఁడైచేరినవాఁడు ౧౪. తన్నమ్ముకొన్నవాఁడు ౧౫. ఈప్రకారముదాసులుపదియేనువిధములనుందురు - మనువుదాసులేడువిధములవారన్నది యాచెప్పినయేడువిధములవారికిదాసత్వమును దెలుపనేకాని వేఱేదాసులులేరనుటకుఁగాదుగనుకవిరోధములేదు ॥ ఈచెప్పఁబడినశిష్యాంతేవాస్యాదిపంచవిధపరిచారకులలోశిష్యునివృత్తి ఆచారకాండయందలి౨౭వశ్లోకమందు గురువుపిలిచినప్పుడుచదువవలయునుమనోవాక్కాయకర్మములచే గురువునకుహితమాచరింపవలయు ననునీప్రకారముగాఁజెప్పఁబడియున్నది -అధికర్మకృత్తుభృతకుఁడుమొదలగువారివిషయమైవేతనాదానప్రకరణమందు-ఎవఁడెన్నాళ్లు పనిచేయునోవానికంతజీతమనుమొదలగుగ్రంథముచేతఁజెప్పఁబడును-దాసునకునంతేవాసికిఁగలధర్మవిశేషమునిచటఁజెప్పుచున్నాఁడు.

మూ. { బలాద్దాసీకృతశ్చోరైర్విక్రీతశ్చాపిముచ్యతే। స్వామిప్రాణప్రదోభక్తత్యాగాత్తన్నిష్క్రయాదపి॥ }

వ్యా॥బలాదితి॥బలాద్బలావష్టంభేన యోదాసీకృతః-యశ్చోరైరపహృత్య విక్రీతః-అపిశబ్దాదాహితశ్చ సముచ్చీయతే-తంయదిస్వామీనముంచతితర్హి రాజా మోచయితవ్యః- ఉక్తంచ నారదేన - చోరాపహృతవిక్రీతా యేచ దాసీకృతా బలాత్। రాజ్ఞా మోచయితవ్యాస్తేదాస్యం తేషుహి నేష్యత ఇతి-చోరవ్యాఘ్రాద్యవరుద్ధస్య స్వామినః ప్రాణాన్యః ప్రదదాతి రక్షతి సోఽపి మోచనీయః తదిదం సర్వదాసానాంసాధారణంపరం దాసత్వనివృత్తికారణం-యస్త్వేషాం స్వామినం కశ్చిన్మోచయేత్ప్రాణసంశయాత్।సదాసత్వాత్ప్రముచ్యేత పుత్రభాగంలభేత చేతి నారదస్మరణాత్ -భక్తదాసాదీనాం తు ప్రాతిస్వికమోక్షకారణముచ్యతే- అనాకాలభృతభక్తదాసోభక్తస్యత్యాగాద్దాసభావాదారభ్య స్వామిద్రవ్యం యావదుపభుక్తంతావద్దత్వా ముచ్యేతే- ఆహితర్ణదాసౌతు తన్నిష్క్రియాద్యద్గృహీత్వా స్వామినాఽహితో యద్ధత్వాధనినోత్తమర్ణాన్మోచితస్తస్య నిష్క్రయాత్సవృద్ధికస్యద్రవ్యస్య ప్రత్యర్పణాన్ముచ్యతే - నారదేనాపి శేషోఽప్యుక్తః - అనాకాలభృతోదాస్యాన్ముచ్యతే గోయుగందదత్। స్వంభక్షితంయద్దుర్భిక్షేనతచ్ఛుధ్యేత కర్మణా । భక్తస్యోత్క్షేపణాత్సద్యోభక్తదాసః ప్రముచ్యతే। ఆహితోఽపిధనందత్వా స్వామీ యద్యేనమద్ధరేత్ । ఋణం తు సోదయం దత్వా ఋణీ దాస్యాత్ప్రముచ్యత ఇతి। తథాతవాహమిత్యుపగతయుద్ధప్రాప్తపణజితకృతబడబాహృతానాంచ ప్రాతిస్వికం మోచనకారణం తేనైవోక్తం। తవాహమిత్యుపగతోయుద్ధప్రాప్తః పణేజితః। ప్రతిశీర్షప్రదానేన ముచ్యేరంస్తుల్యకర్మణా। కృతకాలవ్యపగమాత్కృతోఽపి సవిముచ్యతే। నిగ్రహాద్బడబాయాస్తు ముచ్యతే బడబాహృత ఇతి । నిగ్రహాద్దాస్యా సహ సంభోగనిరోధాదిత్యర్థః- తదేవం గృహజాతక్రీతలబ్ధదాయప్రాప్తాత్మవిక్రయిణాం స్వామిప్రాణదానతత్ప్రసాదరూపసాధారణవ్యతిరేకేణ మోక్షోనాస్తి విశేషకారణానభిధానాత్ - దాసమోక్షశ్చానేనక్రమేణ కర్తవ్యః-స్వదాసమిచ్ఛేద్యఃకర్తుమదాసంప్రీతమానసః।స్కంధాదాదాయ తస్యాసౌభింద్యాత్కుంభం సహాంభసా। సాక్షతాభిస్సపుష్పాభిర్మూర్ధన్యద్భిరవాకిరత్ । అదాస ఇతిచోక్త్వా త్రిః ప్రాఙ్ముఖస్తముపాసృజేదితి తేనైవోక్తమ్॥ ౧౮౦

దాసులకు దాసత్వమునుండి తొలఁగు కారణములు.

తా॥బలముచేతఁబట్టి దాసుఁడుగాఁజేసికొనఁబడినవాఁడును-దొంగలొకనిఁబట్టుకొనివచ్చి యమ్మఁగాఁగొనఁబడినవాఁడును - కుదువయుంచుకొనఁబడినవాఁడును దాస్యమునుండి తొలఁగుదురు - వీరిని స్వామి విడువనిపక్షమందు రాజు విడిపింపవలయును - ఇట్లు నారదులచే జెప్పఁబడియున్నది - దొంగలచేతఁగాని పులిమొదలగు దుష్టమృగములచేతఁగాని చిక్కికష్టపడునప్పుడు తనస్వామినీపదియేనువిధముల దాసులలో నేవఁడైన విడిపించెనేని యతఁడు దాస్యమునుండి తొలఁగుటయగాక పుత్రసమభాగమునుగూడఁ బొందునని నారదవచనమున్నది- అన్నదాసుఁడు మొదలగువారికిఁ బ్రత్యేకముగా దాస్యవిమోచనకారణములు చెప్పఁబడుచున్నవి- క్షామకాలమందుఁ బోషింపఁబడినవాఁడును అన్నముకొఱకు దాసుఁడైనవాఁడును-తామాస్వామిదగ్గరఁ జేరినది మొదలుకొని యతనిద్రవ్యమునెంతమాత్రము ననుభవించియుందురో అంతద్రవ్యమును మరలనిచ్చి విడువఁబడుదురు- కుదువయుంచుకోఁబడినవాఁడు తన్నుఁగుదువయుంచిన వాఁడెంత ద్రవ్యము దీసికొనెనో యంతద్రవ్యమును దానివడ్డియునిచ్చిన విడువఁబడును- ఋణమువలనఁ దొలఁగించి దాసుఁడుగాఁజేసి కొనఁబడినవాఁడా ద్రవ్యమును వడ్డితోనిచ్చిన విడువఁబడును- ఈవిషయమందు నారదులచేఁ గొంత విశేషము చెప్పఁబడియున్నది-అదియెట్లనిన- కఱవునఁ బోషింపఁబడినవాఁడు రెండావులనిచ్చి విడువఁబడును। అతఁడు పనులు చేయుచుండెనుగనుక నతఁడు భక్షించినదిమరల నీఁబనిలేదు। అన్నదాసుఁడన్నము భుజించుట విడువఁగానే విముక్తుఁడగును। కుదువయుంచఁబడినవాఁడు తనస్వామి దీసుకొన్నధనమునిచ్చిన విముక్తుఁడగును । ఋణము దీర్చుటచేత దాసుఁడైనవాఁడు దానివడ్డితోనిచ్చిన విడువఁబడును। నీకుదాసుఁడనగుదునని వచ్చినవాఁడును యుద్ధమందు జయమువలనఁ బొందఁబడినవాఁడును పందెమందు జయింపఁబడినవాఁడును తమతోసరిగాఁ బనిచేయఁగల మనుష్యులఁ బదులుగా నిచ్చి విడువఁబడుదురు । కొన్నాళ్లు దాసుఁడుగా నొప్పుకొన్నవాఁడా కాలముగడువగానే విడువఁబడును। గృహదాసిని బెండ్లియాడినవాఁడా పెతో సంబంధమును వదలిన విముక్తుఁడగును । ఇంటఁబుట్టినవాఁడు కొనఁబడినవాఁడు ప్రతిగ్రహాదులవలనఁ బొందఁబడినవాఁడు తండ్రికి దాసుఁడుగానుండి

తనకుఁజేరినవాఁడు-తన్నుదానమ్ముకొనినవాఁడు-ఈరైదువిధములగానులకుదమయజమానుని ప్రాణమునుగాపాడుట అతనియనుగ్రహమును సంపాదించుట- ఈరెండుఁ తప్ప వేఱేదాస్యవిమోచనకారణములు చెప్పఁబడలేదుగనుక వారికితర విధమున దాస్యవిమోచనము లేదు - ఈరెండ దులకును సాధారణమునైన దాస్యవిమోచనకారణములు॥ దాసునివిడువవలయువిధానము - స్వామి సంతసించినమనస్సుగలవాఁడై తనదాసునిదాస్యములేనివానిఁగాఁ జేయనిచ్ఛయించి నప్పుడతని భుజశిరస్సునుండి యుదకముతోడి ఘటముఁ గుదిసికొని పగలగొట్టి అక్షతలతోను బుష్పములతోను గూడిన యుదకమునతనిశిరస్సునఁజల్లి దాసుఁడుగాఁడని మూఁడుమాఱులు చెప్పి తూర్పుముఖముగానతని విడువవలయునని యానారదులే చెప్పియున్నారుగనుక స్వామియారీతిగ దాసుని విడువవలయును. ౧౮౦

దాసునికిదాస్యవిమోచనముచేయుక్రమము

మూ. ప్రవ్రజ్యావసితో రాజ్ఞో దాసఆమరణాంతికః ౧౮౦॥

వ్యా॥ ప్రవ్రజ్యావసితస్యతు మోక్షో నాస్తీత్యాహ॥ ప్రవ్రజ్యావసితఇతి॥ ప్రవ్రజ్యాసన్యాసస్తతోవసితః అనభ్యుపగతప్రాయశ్చిత్తశ్చేద్రాజ్ఞఏవదాసో భవతి- మరణమేవతద్దాసత్వస్యాన్తో నాంతరా ప్రతిమోక్షోస్తి॥ ౧౮౦

సన్యాసభ్రష్టునకుఁజావువఱకు దాస్యమునుండి విడదల లేదు

తా॥ ప్రవ్రజ్యావసితునకుదాస్యవిమోచనము లేదని చెప్పుచున్నాఁడు॥ ప్రవ్రజ్యయనఁగా సన్న్యాసము దానినుండి భ్రష్టుఁడైనవాఁడు ప్రాయశ్చిత్తముచేసికొనని పక్షమునఁ జావువఱకు రాజునకు దాసుఁడుగానుండవలయు నేకాని యానడుమ విడవలలేదు॥

మూ. వర్ణానామానులోమ్యేన దాస్యంనప్రతిలోమతః॥ ౧౮౧॥

వ్యా॥ వర్ణాపేక్షయాదాస్యవ్యవస్థామాహ॥ వర్ణానామితి॥ బ్రాహ్మణాదీనాంవర్ణానామానులోమ్యేనదాస్యం బ్రాహ్మణస్యక్షత్రియాదయః క్షత్రియస్యవైశ్యశూద్రౌ వైశ్యస్యశూద్రఇత్యేవమానులోమ్యేనదాసభావో భవతి - న ప్రాతిలోమ్యేన- స్వధర్మపరిత్యాగినః పునః పరివ్రాజకస్యప్రాతిలోమ్యేనాపిదాసత్వమిష్యతఏవ- యథాహనారదః- వర్ణానాంప్రాతిలోమ్యేననదాసత్వంవిధీయతే। స్వధర్మత్యాగినోన్యత్రదారవద్దాసతామతేతి. ౧౮౧

తా॥ వర్ణమునుబట్టిదాస్యమునకువ్యవస్థను జెప్పుచున్నాఁడు॥ బ్రాహ్మణునకుక్షత్రియులు మొదలగుమూఁడు వర్ణములవారును - క్షత్రియునకువైశ్యశూద్రులును - వైశ్యునకుశూద్రుఁడును - ఈరీతి ననులోమముగాదాస్యముచేయందగునుగాని యుత్తమవర్ణమువాఁ డధమవర్ణమువానికిదాసుఁడుగాఁగూడదు - తనధర్మమునువిడిచిన సన్న్యాసికిప్రతిలోమముగాదాసత్వముగలుగును - అట్లు నారదులచేఁజెప్పఁబడియున్నది॥ ౧౮౧

శ్రేష్ఠవర్ణమువారుతమకంటెహీనవర్ణమువారికి దాస్యముచేయఁగూడదు.

మూ. { కృతశిల్పోపినివసేత్కృతకాలంగురోర్గృహే। }
{ అంతేవాసీగురుప్రాప్తభోజనస్తత్ఫలప్రదః ॥ }

వ్యా॥ అన్తేవాసిధర్మానాహ॥ కృతశిల్పోపీతి॥ అన్తేవాసీగురోర్గృహేకృతకాలంవర్షచతుష్టయమాయుర్వేదాదిశిల్పజ్ఞానార్థంత్వద్గృహేవసామీతియావదఙ్గీకృతస్తావత్కాలంవసేత్ యద్యపివర్షచతుష్టయాదర్వాగేవలబ్ధాపేక్షితశిల్పవిద్యః కథంవసేత్- గురుప్రాప్తభోజనః గురోస్సకాశాత్ప్రాప్తంభోజనంయేనసతథోక్తః- తత్ఫలప్రదస్తస్యశిల్పస్యఫలమాచార్యాయప్రదదాతీతి తత్ఫలప్రదఏవమ్భూతోవసేత్ - నారదేనవిశేషోప్యత్రదర్శితః- స్వశిల్పమిచ్ఛన్నాహర్తుంబాన్ధవానామనుజ్ఞయా। ఆచార్యస్యవసేదన్తేకృత్వాకాలంసునిశ్చితం। ఆచార్యశ్శిక్షయేదేనం స్వగృహాద్దత్తభోజనం। నచాన్యత్కారయేత్కర్మపుత్రవచ్చైనమాచరేత్। శిక్షయన్తమసంతుష్టోయఆచార్యంపరిత్యజేత్। బలాద్వాసయితవ్యస్స్యాద్వధబంధౌచసోర్హతి। శిక్షితోపికృతంకాలమంతేవాసీసమాప్నుయాత్। తత్రకర్మచయత్కుర్యాదాచార్యస్యైవతత్ఫలం। గృహీతశిల్పస్సమయేకృత్వాచార్యంప్రదక్షిణం। శిక్షితశ్చానుమాన్యైనమంతేవాసీనివర్తతఇతి-వధశబ్దోత్రతాడనార్థః దోషస్యాత్యల్పత్వాత్॥ ౧౮౨॥ ఇత్యభ్యుపేత్యాశుశ్రూషాఖ్యంవివాదపదం

తా ॥ అంతేవాసిధర్మములను జెప్పుచున్నాఁడు॥ అంతేవాసియనఁగా శిల్పవిద్యార్థి-వాఁడు దనగురువింటఁ జేరు నపుడెన్నిదినములుండి పని నేర్చుకొందునని నిర్ణయము చేసికొనియుండునో అన్నాళ్ళ లోపలఁ దనకుఁ బనియంతయుఁ దెలిసినను నిర్ణీతకాలము గురువింటనే గురువు నన్నము గుడుచుచు తాను చేయుపనిలో వచ్చులాభము నా గురువునకే యిచ్చుచుండవలయును ఈవిషయమంతయు నారదులచేతఁ గొంతవిశేషము చెప్పఁబడియున్నది గనుక నదియా క్రిందవివరింపఁబడుచున్నది - తనపని నేర్చికొననిచ్ఛగలవాఁడు తండ్రి మొదలగువారి యనుజ్ఞచేత నాచార్యునింట నొక కాలము గడువుపెట్టుకొని యుండవలయును ఆచార్యుఁ డతనికిఁ దనయింట నన్నముఁ బెట్టి శిల్పము తప్పనితరములైన పనులు చెప్పక తన కొడుకునందువలె నతనియందుఁ బ్రేమగలవాఁడై యతనికిఁ బని నేర్పవలయును- ఆచార్యుఁడు పని నేర్పునపుడు సమ్మతిలేక అంతేవాసి యాయాచార్యుని విడిచిన పక్షమందు వాని బలాత్కారముచేత నాచార్యుఁడు పట్టి తెప్పించవచ్చును। మఱియు నతనికిఁ గట్టుకొట్టులు దండనములగును-పని తెలిసిన తరువాతనైన నంతేవాసి తన నిర్ణయకాలము నాచార్యునింట గడపవలయును - అప్పుడక్కడ నతఁడు చేయుపనుల యొక్క లాభమాచార్యునికే చేయును- పని నేర్చుకొన్న యంతేవాసి నిర్ణయించుకొన్న గడువుతీరిన పిమ్మట నాచార్యునకుఁ బ్రదక్షిణము చేసి గౌరవించి మరలిపోవలయును॥ ౧౮౪॥

శిల్పవిద్యార్థి నిర్ణీతకాలము నకు లోపలఁ బని నేర్చుకొన్నను గురువింటిని విడువఁ గూడదు

అభ్యుపేత్యాశుశ్రూషాఖ్యవివాదపదము ముగిసెను.

## సంవిద్వ్యతిక్రమప్రకరణము.

మూ. { రాజా కృత్వా పురే స్థానం బ్రాహ్మణాన్న్యస్య తత్ర తు ।
త్రైవిద్యం వృత్తిమద్బ్రూయాత్స్వధర్మః పాల్యతామితి॥ }

వ్యా ॥ సంప్రతి సంవిద్వ్యతిక్రమః కథ్యతే- తస్య లక్షణం నారదేన వ్యతిరేకముఖేన దర్శితం-పాషండనైగమాదీనాం స్థితస్సమయ ఉచ్యతే। సమయస్యానపాకర్మ తద్వివాదపదం స్మృతమితి - పారిభాషికధర్మేణ వ్యవస్థాపనం సమయః తస్యానపాకర్మ వ్యతిక్రమః పరిపాలనం తద్వ్యతిక్రమ్యమాణం వివాదపదం భవతీత్యర్థః -తదుపక్రమార్థం కించిదాహ ॥ రాజేతి ॥ రాజా స్వపురే దుర్గాదౌ వాస్థానం ధవళగృహాదికం కృత్వా తత్ర బ్రాహ్మణాన్న్యస్య స్థాపయిత్వా తద్బ్రాహ్మణజాతం త్రైవిద్యం వేదత్రయసంపన్నం వృత్తిమద్భూహిరణ్యాదిసంపన్నం కృత్వా స్వధర్మో వర్ణాశ్రమనియమితశ్శ్రుతిస్మృతివిహితో భవద్భిరనుష్ఠీయతామితి తాన్ బ్రాహ్మణాన్ బ్రూయాత్॥

తా ॥ ఇప్పుడు సంవిద్వ్యతిక్రమమనెడు వివాదపదము చెప్పఁబడుచున్నది - దాని లక్షణము నారదులు చెప్పినక్రమమున నీక్రిందవివరింపఁబడును - కొందఱొక యేర్పాటు చేసికొన్నదిసమయమనంబడును- అందుఁ జేరినవారు దానినతిక్రమింపఁగూడదు- అట్టిసమయమును గాపాడక యతిక్రమించినపక్షమందది సంవిద్వ్యతిక్రమమను వ్యవహారపదమగును-దానినుపక్రమింపనిచటఁ గొంచెము చెప్పుచున్నాఁడు॥ తా॥ రాజు తన పట్టణమందుఁగాని దుర్గము మొదలగు చోట్లయందుగాని తెల్లనియిల్లు మొదలగువానిగట్టించి యచ్చట బ్రాహ్మణులనిలిపి యాబ్రాహ్మణులందఱు మూఁడు వేదములు చదివి యుండునట్లును వారికి భూహిరణ్యాది ద్రవ్యములు సమృద్ధిగానుండునట్లును జేసి మీరు శ్రుతిస్మృతులయందుఁ జెప్పబడియుండు వర్ణాశ్రమధర్మముల నాచరింపుచుండుఁడని వారితోఁ జెప్పవలయును॥ ౧౮౫

కొందఱొకయేర్పాటుచేసికొనఁగా దానినుండి యెవఁడైనఁ దొలఁగిన నది సంవిద్వ్యతిక్రమము.

రాజొకస్థానము నేర్పరచి యచట బ్రాహ్మణులనుంచుట.

మూ. { నిజధర్మావిరోధేన యస్తు సామయికో భవేత్ । సో
పియత్నేన సంరక్ష్యో ధర్మో రాజకృతశ్చ యః ॥ }

వ్యా ॥ ఏవం స్థాపితైస్తైర్యత్కర్తవ్యం తదాహ॥ నిజధర్మేతి॥ శ్రౌతస్మార్తానుపమర్దేన సమయాన్విప్ర

నోన్నయో ధర్మః గోప్రచారోదకరక్షణ దేవగృహపాలనాదిరూపస్సోపియత్నేనపాలనీయః-తథా రాజ్ఞా చ నిజధర్మావిరోధేనైవ యస్సామయికో ధర్మః కృతః యావత్పథికం భోజనం దేయమస్మద్రాతిమండలే తురంగాదయోనప్రస్థాపనీయా ఇత్యేవంరూపస్సోపిరక్షణీయః॥ ౧౮౬

తా ॥ ఇట్లునియోగింపఁబడినబ్రాహ్మణులు చేయవలసినదానిఁజెప్పుచున్నాఁడు ॥ నియుక్తబ్రాహ్మణులు శ్రౌతస్మార్తధర్మములకు బాధకములుగాక సమయసిద్ధములైయున్న గోప్రచారజలసంరక్షణ దేవాలయపరిపాలనాది ధర్మములను దప్పకజరిగింపవలయును - అలాగే రాజుచేత స్వకీయధర్మమునకు విరోధములేకయేర్పఱుపఁబడిన సామయికధర్మమనఁగా మార్గస్థులుగావచ్చినవారికి దఱకునన్నము పెట్టవలయును - మాశత్రురాష్ట్రమునకు గుఱ్ఱములు మొదలగువానిం బోనీయఁగూడదు అనియిట్లు నిర్ణయింపఁబడినధర్మములనుగాపాడవలయును॥ ౧౮౬

పూర్వశ్లోకోక్తబ్రాహ్మణులు సమయాచారములనుగాపాడవలయు.

మూ. { గణద్రవ్యంహరేద్యస్తు సంవిదంలంఘయేచ్చయః। సర్వస్వహరణంకృత్వాతంరాష్ట్రాద్విప్రవాసయేత్ ॥ ... }

వ్యా ॥ ఏవం సమయధర్మః పరిపాలనీయ ఇత్యుక్త్వా తదతిక్రమే దండమాహ॥ గణద్రవ్యమితి॥ యః పునర్గణస్య గ్రామాదిజనసమూహస్య- సంబంధి సాధారణద్రవ్యమపహరతి- సంవిత్సమయస్తాం సమూహకృతాం రాజకృతాంవా యో లంఘయేదతిక్రమేత్తదీయం సర్వం ధనమపహృత్య తం రాష్ట్రాద్విప్రవాసయేన్నిర్వాసయేత్ - అయంచ దండోఽనుబంధాద్యతిశయేద్రష్టవ్యః- అనుబంధాద్యల్పేతు-యో గ్రామదేశసంఘానాం కృత్వా సత్యేన సంవిదం। విసంవదేన్నరో లోభాత్తం రాష్ట్రాద్విప్రవాసయేత్ ।నిగృహ్యదాపయేచ్చైనం సమయవ్యభిచారిణం। చతుస్సువర్ణం షణ్ణిష్కం శతమానంచ రాజతమితిమనుప్రతిపాదితదండానాంనిర్వాసనచతుస్సువర్ణషణ్ణిష్కశతమానరాజతానాం చతుర్ణామన్యతమోజాతిశక్త్యాద్యపేక్షయాకల్పనీయః॥ ౧౮౭

తా॥ ఇట్లుసమయధర్మముసుపాలింపవలయునని చెప్పి దానినతిక్రమించుట మొదలగువానియందు దండనమును జెప్పుచున్నాఁడు॥ గ్రామస్థులువర్తకులు మొదలగుజనసమూహముయొక్క యుమ్మడిసొమ్ము నెవఁడపహరించునో యెవఁడొకసభవారు చేసిననిబంధనమునుగాని రాజుచేసిననిబంధనమునుగాని యతిక్రమించునో అట్టివాని ద్రవ్యమంతయుఁదీసుకొని యతని రాజ్యములోనుండి తఱుమఁగొట్టవలయును - ఈశిక్షగొప్పవ్యవహారవిషయమందని తెలియఁదగినది- అదియేలయనిన-మనుస్మృతియందు గ్రామమువారుగాని దేశమువారుగాని వర్తకాదిసమూహమువారుగాని ప్రమాణముగానొకనిబంధనను జేసికొనియుండఁగా వారిలో నెవఁడైనలోభమువలననానిబంధనకు వ్యతిరిక్తముగాఁబ్రవర్తించెనేని వాని రాజ్యములోనుండి వెడలఁగొట్టవలయుననియు అట్టివానిఁదిరస్కరించియతనిచేత నాలుగుసువర్ణములు ఆరునిష్కములు నూరురజతములును దండనముదీయవలయుననియు స్వల్పశిక్షగూడఁజెప్పఁబడియున్నది గనుక స్వల్పవ్యవహారవిషయమందీ చెప్పినశిక్షలలోనొకటిజాతిశక్తులనుజూచివానికొలఁదినిర్ణయింపఁదగును॥

సమయోల్లంఘనము చేసినవానికిని గణద్రవ్యాపహారికిని దండనము.

మూ. కర్తవ్యంవచనంసర్వైస్సమూహహితవాదినామ్॥౧౮౮॥

వ్యా॥ ఇదంచాన్యైః కర్తవ్యమిత్యాహ॥ కర్తవ్యమితి ॥ గణినాంమధ్యే యే సమూహహితవాదనశీలాస్తద్వచనమితరైర్గణాంతర్గతైరనుసరణీయం॥ ౧౮౮

తా ॥ సమూహమువారిచేఁజేయఁదగినమఱియొకవిషయమును జెప్పుచున్నాఁడు ॥ సమూహము వారిలో నెవరైనా సమూహమునకు మేలుచెప్పెడువారో వారిమాటలనాసమూహములోఁజేరినవారందఱుఅంగీకరింపవలయును॥ ౧౮౮

సమూహమునకు మేలుచెప్పువారిమాటలనితరులంగీకరింపవలయు.

మూ. యస్తత్ర విపరీతస్స్యాత్సదాప్యః ప్రథమం దమమ్॥౧౮౬॥

వ్యా॥ అన్యథాదండ ఇత్యాహ॥ య ఇతి॥ యస్తుగణినాంమధ్యే సమూహహితవాదివచనప్రతిబంధకారీ స రాజ్ఞా ప్రథమం సాహసం దండనీయః॥ ౧౮౬

సంఘమునకు మేలుచెప్పు వానిమాట కడ్డపడువానికి దండనము.

తా॥ అట్లుగాకున్నదండనమని చెప్పుచున్నాఁడు॥ ఎవఁడు సంఘము వారిలో సంఘమునకు మేలు చెప్పువాని మాటకడ్డము సేయునో యతనికి ఇన్నూటయేఁబది తామ్రపణములదండనము విధింపవలయును॥ ౧౮౬

మూ. { సమూహకార్యఆయాతాన్కృతకార్యాన్విసర్జయేత్।
సదానమానసత్కారైః పూజయిత్వామహీపతిః ౧౮౭॥ }

వ్యా॥ రాజ్ఞాచేత్థంగణిషువర్తనీయమిత్యాహ॥ సమూహేతి॥ సమూహకార్యనివృత్త్యర్థంస్వపార్శ్వంప్రాప్తాన్గణినోనిర్వర్తితాత్మీయప్రయోజనాన్- సమహీపతిర్దానమానసత్కారైః పరితోష్య విసర్జయేదితి॥ ౧౮౭

సమూహకార్యములయం దుఁ బ్రవర్తించు వారిని రాజు సమ్మానింపవలయు.

తా॥ సమూహమువారి కార్యములయందుఁ బ్రవర్తించువారివిషయమందు రాజిట్లుండవలయునని చెప్పుచున్నాఁడు॥ సమూహమువారి కార్యములకై తనయొద్దకువచ్చినవారు వారికార్యముల నెఱవేర్చుకొనిపోవునప్పుడు రాజు ఇనాములిచ్చుట గొప్పచేయుట మొదలగుక్రియలచేత వారిని సంతోషపఱిచి పంపవలయును॥ ౧౮౭

మూ. { సమూహకార్యప్రహితోయల్లభేత తదర్పయేత్ । ఏకా
దశగుణం దాప్యోయద్యసౌనార్పయేత్స్వయమ్॥౧౮౮॥ }

వ్యా॥ సమూహదత్తాపహారిణంప్రత్యాహ॥ సమూహేతి॥ సమూహకార్యార్థంసమూహజనైః ప్రేరితో రాజపార్శ్వే యద్వస్త్రహిరణ్యాదికంలభతే-తదప్రార్థితపవసమూహజనేభ్యోనివేదయేత్-అన్యథాలబ్ధాదేకాదశగుణం దాపనీయః॥ ౧౮౮

సంఘము వారికిచ్చినదాని వారి కీయక యపహరించినవానికి దండనము.

తా॥ సంఘము వారికిచ్చినదాని నపహరించినవానిఁ గూర్చి చెప్పుచున్నాఁడు॥ సంఘము వారి కార్యముకొఱకు సంఘము వారిచేతఁ బంపబడినవాఁడు రాజునొద్ద వస్త్రములు సొమ్ములు మొదలగుదాని దేనిఁ బొందినను వారడుగకముందే దాని వారలకీవలయును - అటుగానిపక్షమున నాద్రవ్యమునకుఁ బదునొకండంతలదండనమును బొందును॥ ౧౮౮

మూ. { ధర్మజ్ఞాశ్శుచయోలుబ్ధాభవేయుః కార్యచింతకాః। కర్త
వ్యంవచనంతేషాం సమూహహితవాదినామ్ ॥ ౧౮౯ ॥ * }

వ్యా॥ ఏవంప్రకారాశ్చ కార్యచింతకాః కర్తవ్యా ఇత్యాహ॥ ధర్మజ్ఞా ఇతి॥ శ్రౌతస్మార్తధర్మజ్ఞాః బాహ్యాభ్యంతరశౌచయుక్తా అర్థేష్వలుబ్ధాః కార్యవిచారకాః కర్తవ్యాస్తేషాంవచనమితరైః కర్తవ్యమిత్యేతదాదరార్థంపునర్వచనం.

కార్యముల నాలోచించువారు ధర్మజ్ఞులై నిర్మలులై యుండవలయును.

తా॥ కార్యముల నాలోచించువారి నిట్టివారి నేర్పఱుపవలయునని చెప్పుచున్నాఁడు॥ శ్రౌతస్మార్తధర్మములఁ దెలిసినవారును మనశ్శుద్ధియునాచారమును గలవారును - ద్రవ్యమందు లోభము లేనివారునైన వారినిఁ గార్యముల నాలోచింపువారుగా నేర్పఱుపవలయును - వారిమాటప్రకారము తక్కినవారు నడచుకొనవలయును॥ ౧౮౯

మూ. { శ్రేణినైగమపాషండిగణానామప్యయంవిధిః । భేదం
చైషాంనృపోరక్షేత్పూర్వవృత్తించపాలయేత్ ॥౧౯౦ }

వ్యా॥ ఇదానీంత్రైవిద్యానాంప్రతిపాదితంధర్మం శ్రేణ్యాదిష్వతిదిశన్నాహ॥ శ్రేణీతి॥ ఏకపణ్యశిల్పోపజీవినశ్శ్రేణయః నైగమాః యె వేదస్యాప్తప్రణీతత్వేన ప్రామాణ్యమిచ్ఛంతి పాశుపతాదయః - పాషండినః యె వేదస్యప్రామాణ్యమేవనేచ్ఛంతి నగ్నాః సౌగతాదయః-గణోవ్రాతఆయుధీయాదీనామేకకర్మోపజీవినాంప తేషాంచతుర్విధానా

హృద్యయమేవవిధిర్యోఽనజధర్మావిరోధినేత్యాదినా ప్రతిపాదితవిశేషాం శ్రేణ్యాదీనాంచ భేదం ధర్మవ్యవస్థాం నృపోర క్షేత్పూర్వోపాత్తాంవృత్తించపాలయేత్॥ ౧౯౦

తా॥ఇప్పుడు వైదికులకుఁజెప్పినధర్మమును శ్రేణులు మొదలగువారియం దతిదేశించి చెప్పుచున్నాఁడు ॥ ఒకవ్యాపారము-ఒకవిధమైనశిల్పము-వీనిచేఁ బ్రతికించువారు శ్రేణులు- వేదవ్యాఖ్యాతలుచెప్పిన దగుటంజేసి ప్రమాణమని యొప్పెడు పాశుపతాదులు నైగములు - వేదము ప్రమాణము కాదనునట్టిలగు బౌద్ధాదులు పాషండులు- అనేక నముపట్టువారు మొదలగు నొకకార్యము చేసిజీవించువారిసమూహము గణము-ఈనాలుగువిధములవారికిని-౧౮౬ శ్లోకము మొదలుకొని చెప్పఁబడిన దేవిధానము గును - ఈశ్రేణులు మొదలగువారి భేదము ధర్మవ్యవస్థను రాజుగాపాడవలయును-పూర్వము వారియందువృత్తినిఁగాపాడవలయును సంవిద్వ్యతిక్రమము ముగిసెను

శ్రేణులు మొదలగు వారి భేదమును ధర్మవ్యవస్థను రాజుపాలింపవలయును.

## వేతనాదానప్రకరణము.

మూ. { గృహీతవేతనః కర్మ త్యజన్ ద్విగుణమావహేత్ । అగృహీతే సమం దాప్యో భృత్యై రక్ష్య ఉపస్కరః॥ ౧౯౧ ॥ }

అవతరణికా ॥ సంప్రతి వేతనస్యానపాకర్మాఖ్యం వ్యవహారపదం ప్రస్తూయతే-తత్స్వరూపంచ నారదేనోక్తం భృత్యానాం వేతనస్యోక్తోదానాదానవిధిక్రియః। వేతనస్యానపాకర్మ తద్వివాదపదం స్మృతమితి-అస్యార్థః - భృతకానాం వేతనస్యవక్ష్యమాణశ్లోకైరుక్తోదానాదానవిధిక్రమో యత్ర వివాదపదే తద్వేతనస్యానపాకర్మేత్యుచ్యతే- తత్ర నిర్ణయమాహ॥ వ్యా ॥ గృహీతం వేతనం యేనాసౌ గృహీతవేతనస్స స్వాంగీకృతం కర్మ త్యజన్నకుర్వన్ ద్విగుణాం భృతిం స్వామినే దద్యాత్ - యదా పునరభ్యుపగతం కర్మాగృహీతవేతన ఏవ త్యజతి తదా సమం యావద్వేతనమభ్యుపగతం తావద్దాప్యో న ద్విగుణం- యద్వాంగీకృతాం భృతిం దత్వా బలాత్కారయితవ్యః - కర్మాకుర్వన్ప్రతిశ్రుత్యకార్యో దత్వా భృతిం బలాదితి నారదవచనాత్ - భృతిరపి తేనైవోక్తా-భృత్యాయ వేతనం దద్యాత్కర్మస్వామీ యథాక్రమం । ఆదౌ మధ్యేవసానే వా కర్మణో యద్వినిశ్చితమితి- తైశ్చ భృత్యైరుపస్కర ఉపకరణం లాంగలాదీనాం ప్రగ్రహాదికం యథాశక్తి రక్షణీయమితరథా కృష్యాదినిష్పత్త్యనుపపత్తేః॥ ౧౯౧

తా॥ఇప్పుడు వేతనానపాకర్మమను వ్యవహారపదము చెప్పఁబడుచున్నది। దానిస్వరూపము॥పనివాండ్రకు జీతమీవలసినవిషయము యొక్కయు అక్కఱలేనివిషయము యొక్కయు క్రమ మేవివాదపదమం దుఁగలదో యది వేతనానపాకర్మమను వివాదపదమని నారదులుచెప్పియున్నారు-ఆవిషయమందు నిర్ణయము నుజెప్పుచున్నాఁడు ॥ జీతముతీసికొని తానొప్పికొన్నపని నిజేయనిపనివాఁడు జీతమునకు రెండంతలు యజమానునకీవలయును - జీతముతీసికొనక తానొప్పికొన్నపనిని జేయనివాఁడు జీతమంత ద్రవ్యము యజమానునకీవలయును - లేక యజమానుఁడు పనివానికి నిర్ణయించియున్న జీతమిచ్చి పనిచేయునని యతని బలాత్కారమైనఁ జేయఁదగును - అట్లు నారదస్మృతియందుఁ జెప్పఁబడియున్నది జీతమిచ్చు క్రమము నారదులచేతఁ జెప్పఁబడినరీతిని క్రిందవివరింపఁబడుచున్నది-యజమానుఁడు తనపనివానికావనినిగురించి నిర్ణయించినకూలిని మొదటఁగాని నడుమఁగాని కడను గాని యీవలయును - ఆపనివాఁడు వారివారిపనిముట్లను కాపాడవలయును - అనఁగా సేద్యగాఁడు నాఁగేలు కాడిపగ్గము కఱ్ఱలు మొదలగు పనిముట్లను దనశక్తి కొలఁది కాపాడవలయుననుట-లేనిపక్షమందు (గృషి మొదలగుపనిజరుగుటకభ్యంతరము కలుగును॥ ౧౯౧

జీతముతీసికొనియుఁదీసికొనకయుఁదానొప్పికొన్నపనినిజేయనివానివిషయము

మూ. { దాప్యస్తు దశమం భాగం వాణిజ్యపశుసస్యతః। అనిశ్చిత్య భృతిం యస్తు కారయేత్స మహీక్షితా॥ ౧౯౨ }

వ్యా ॥ భృతిమపరిచ్ఛిద్య యః కర్మకారయతి తం ప్రత్యాహ ॥ దాప్య ఇతి ॥ యస్తు స్వామీ వణిగ్గోమీ క్షేత్రికో

